# తొలి పలుకు

హైదరాబాద్ సంస్థానంలో రైతాంగానికి సంబంధించిన చట్టాలు (కానూన్) తెలుగు మున్నగు ప్రాంతీయ భాషలలో యింతవరకు దాదాపు ప్రచురింపబడనే లేదని చెప్పాలి. చట్టాలన్నీ ఉర్దూభాషలోనే వుంటూవచ్చాయి. ఇటీవల యింగ్లీషులో కూడా వెలువడుతున్నాయి. అంతే తప్ప ప్రాంతీయ భాషలలో తర్జుమా కావడంలేదు. అసలు హైదరాబాద్ సంస్థానంలో నైజాం నవాబు యొక్క వందలాది సంవత్సరాల నిరంకుశ, ఫ్యూడలు పరిపాలన ఫలితంగా రైతాంగానికి ఏర్పడివున్న హక్కులే అతిస్వల్పం. కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడ్డాక కూడ రైతాంగానికి చెప్పుకోదగ్గ హక్కులేమీ సంక్రమించలేదు. ఈ విధంగా సంస్థానంలో రైతాంగానికున్న హక్కులే చాలతక్కువ అయితే చట్టాలు దేశభాషలలో లేకపోవుటవలన వాటిని గూర్చిన వ్యవహారజ్ఞానం ప్రజలకుగాని, రైతుసంఘ కార్యకర్తలకుగాని అంతకన్నా తక్కువగావుంది. అందుచేత ఏమైనా రైతాంగానికి హక్కులున్నప్పటికీ అవి కాగితాలపై వుంటున్నాయి తప్ప ఆచరణలో అమలుజరగడంలేదు. పటేలు, పట్వారీలమాటే కానూన్‌గా గ్రామాలలో చెలామణీ అవుతోంది.

మన రైతువుద్యమములో నేడు ప్రధానమైన లోట్లలో ఒకటి నేడు అమలునందున్న చట్టాల గూర్చిన వ్యవహారజ్ఞానం రైతు సంఘకార్యకర్తలకు లోపించడం. ఈలోపాన్ని సరిజేసుకోకుండా గ్రామాల్లో పటేలు, పట్వారీలు, భూస్వాములు, లంచగొండి ప్రభుత్వోద్యోగులు గావించే అనేక రకాల చట్టవిరుద్ధమైన అక్రమచర్యలను అరికట్టజాలము. తెలంగాణాలో రైతుకార్యకర్తలను నేడు యెదుర్కొంటున్న వివిధ రైతుసమస్యలపై వ్యవహారజ్ఞానాన్ని యిచ్చేవుద్దేశ్యంతో మేము "తెలంగాణా రైతుసమస్యలు" అన్న యీ పుస్తకాన్ని తయారుచేసేందుకు పూనుకున్నాం. ఇది "తెలంగాణా

వాటిహద్దులను దాటి రైతువుద్యమాన్ని అభివృద్ధి చేయరు. రైతువుద్యమాభివృద్ధిని ప్రభుత్వచట్టాలపై ఆధారపడనివ్వరు. భూస్వామ్య దోపిడీ వ్యవస్థను వ్యవసాయపెట్టడంద్వారా అంతం చేయుడం లక్ష్యంగా పెట్టుకున్న మనం ప్రభుత్వ కానూన్ పరిమితులలో రైతువుద్యమాన్ని నిర్మించపూనుకోము. అది మన విప్లవపంథా కాదు. అయితే ప్రభుత్వచట్టాలవల్ల లభించే అవకాశాలను ప్రజలను సమీకరించడానికి వుపయోగించుకొంటాం. ఆ ప్రజాసమీకరణ ద్వారా యింకా అభివృద్ధికరమైన హక్కులు సంపాదించడానికి ముందుకు పోతాం. అందుచేత గ్రహించాల్సిన ముఖ్యవిషయమేమంటే రైతుసమస్యల గూర్చిన వ్యవహారజ్ఞానం తెలుసుకోవడం ఆ జ్ఞానాన్ని పురస్కరించుకొని ప్రజాసమీకరణగావించడానికేగాని సంస్కరణవాదులవలె రైతువుద్యమాన్ని కానూను హద్దులలో బంధించి ముందుకుపోకుండా నిర్వీర్యం చేయడానికి కాదు. సంస్కరణవాదులకూ మనకూ వున్న తేడా వ్యవహారజ్ఞానాన్ని రైతువుద్యమమును అభివృద్ధి చేయడానికి వుపయోగించే విధానంలోనే వుంది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని రైతుసంఘకార్యకర్తలు యీ పుస్తకం ద్వారా లభించే వ్యవహారజ్ఞానాన్ని రైతువుద్యమాన్ని పెంపొందించేందుకు ఒకసాధనంగా వుపయోగించుకొంటారని ఆశిస్తాం.

ఈ పుస్తకం అచ్చు పూర్తిఅయ్యాక ప్రభుత్వం కొన్ని కొత్త ప్రకటనలు గావించింది. ఉదాహరణకు కాంగ్రెసు ప్రభుత్వంలోగడ భూమి పంపకంకోసం తలపెట్టిన పథకాన్ని గూర్చి యీ పుస్తకంలో తెల్పాం. కాని కేంద్రప్రభుత్వం భూస్వాములనుతృప్తిపర్చడం తలపెట్టిన పథకాన్నికూడ వ్యతిరేకించడం వలన ఆ పథకాన్ని యింకా నీరుకార్చడం జరిగినట్లు తెలుస్తోంది. ఒక భూకామందుకు వుండాల్సిన భూమికి గరిష్ట పరిమాణాన్ని ఏర్పర్చి ఆ పరిమాణంకు మించినభూమిని ప్రభుత్వం నష్టపరిహారమిచ్చి తీసుకుంటుంది అన్నది లోగడ పథకంలోని ముఖ్యమైనవిషయం. దీన్ని యిప్పుడు ఎగరగొట్టుచున్నట్లు, 1950వ సంవత్సరపు కౌలుచట్టంలో భూమి గరిష్ట

పరిమాణాన్ని కూర్చి యిచ్చిన నిర్వచనానికి బదులుగా రు 3600 ల సాలీనా నికరాదాయం లభించే భూమి విస్తీర్ణాన్ని గరిష్ఠ పరిమాణంగా ఏర్పరుస్తూ ఒక సవరణ మాత్రం తేనున్నట్లూ తెలుస్తోంది. రు 3600 ల సాలీనానికరా దాయం ఎంతభూమిలో వస్తుందో నిర్ణయించేందుకు ఒక లాండుకమీషన్ ఏర్పరుస్తారట! అంతకుమునుపే ప్రస్తుతం ఏమీచేసేది లేనట్లు యిటీవల హైదరాబాద్ ముఖ్యమంత్రి బూ. రామకృష్ణారావుగారు చెప్పిన విలేఖ రులతో సాగించిన సంభాషణలవల్ల తేలుతోంది. కాంగ్రెసు మంత్రివర్గం భూమి సంస్కరణకోసం తలపెట్టిన పథకంగూర్చి మేము వ్రాసినదాని విష యంలో యీ మార్పు గమనింపగోరుతాం.

పుస్తకంలో అనేక అచ్చుపొరపాట్లు దొర్లాయి. ఒక దీర్ఘమైన తప్పొప్పులపట్టిక తయారు చేసాం. ఇన్ని అచ్చుపొరపాట్లు దొర్లినందులకు పాఠకులు మన్నించగోరుతాం.

ఈ పుస్తకంలో కానూన్‌కు సంబంధించిన విషయాలు అనేకం వున్నా యి. హైదరాబాద్ సంస్థానంలో రైతులకు సంబంధించిన కానూన్ అంతా ఒకచోట క్రోడీకరింప లేకపోవడం, చాలా చిక్కుచిక్కుగా వుండడం వలన కానూన్‌ను వివరించడంలో మా యీ ప్రయత్నం అనేక పరిమితులతో సహజంగా కూడివుంటుంది. అంతేగాకుండా కానూన్ వివరపర్చడంలో కొన్ని ప్రధాన పొరపాట్లు కూడ దొర్లవచ్చు. వీటన్నిటిగూర్చి రైతు శ్రేయోభిలాషులైన న్యాయవాదులు, రైతురంగంలో అనుభవమున్న నాయకులు, కార్యకర్తలు తమఅభిప్రాయాలను మాకుపంపగోరుతాం. ద్వితీయసంపుటాన్ని తయారుచేయు డానికి అట్టి అభిప్రాయాలు మాకెంతో తోడ్పడతాయని మనవిచేసుకొం టున్నాం.

ఈ గ్రంథాన్ని తయారుగావించడానికి మమ్మలను ప్రోత్సహించి, మాకు అనేకసలహాలు, సూచనలుయిచ్చి, మాకుయెంతగానో తోడ్పడిన మిత్రులందరికీ, ముఖ్యంగా మాయీ పుస్తకానికి పరిచయవాక్యాలు వ్రాసిన శ్రీ మాకినేని బసవపున్నయ్యగార్కి మా కృతజ్ఞతాభివందనాలు.

హైదరాబాదు,
20-11-52.

ఇట్లు,
గ్రంథకర్తలు.

# పరిచయం

కొలదిమాసాలక్రితం, తెలంగాణా రైతు ఉద్యమాన్ని గూర్చి మాట్లాడుకొనే సందర్భంలో, ఇలాంటి పుస్తకప్రకటన ఎంతేని అవసరమని, కామ్రేడ్సు వాసుదేవరావు ప్రసాదరావుగార్లిద్దరితో నేను ప్రస్తావించియుంటిని. తదుపరి వీరిద్దరూ, అట్టిపనికి పూనుకొని, అత్యంతశ్రమకోర్చి, "తెలంగాణా రైతుసమస్యలు" మొదటిసంపుటాన్ని వెనువెంటనే తయారుచేశారు. అందులకు గ్రంథకర్త లిద్దరకు నా ప్రత్యేక ధన్యవాదాలు

తెలంగాణా రైతు సమస్యలనే ఈపుస్తకం, తెలంగాణా రైతు ఉద్యమనిర్మాణంలో ఒక చారిత్రిక కర్తవ్యాన్ని నిర్వహిస్తుందని నా విశ్వాసం. తెలంగాణా రైతాంగం, నైజాం నవాబుయొక్క నిరంకుశ ఫ్యూడల్ పరిపాలనా నరకకూపంలో నలిగిపోతూ, రైతుసంఘాన్ని నిర్మించుకొనుటకుగాని, రైతుసమస్యను ఒక సమస్యగా సమగ్రమైన రూపంలో రైతాంగముందు, ప్రజలముందు ఉంచుటకుగాని ఎట్టిలీగలు అవకాశాలులేకుండా ఉండిపోయింది. ప్రజా ఉద్యమబలంతో వచ్చిన ప్రస్తుత పరిణామాల ననుసరించి, నేటికి తెలంగాణా రైతాంగం, అట్టిలీగలు అవకాశాలనుకొంతవరకైనా సాధించుకోగల్గింది. సంఘనిర్మాణం, రైతు సమస్యను సమగ్రంగా ముందుకు తేవడం, కోర్కెలను ప్రస్ఫుటంచేసి వాటిసాధనకొరకు పోరాడటం, మున్నగునవి, నేడొక నూతనప్రాతిపదికపై ప్రారంభమయ్యాయి. ఇట్టితరుణంలో, ఇలాంటి పుస్తకం, రైతుసేవకుల, సంఘకార్యకర్తలచేతుల్లో ఒక అమూల్య ఆయుధంవలె ఉపకరించుతుందనడం నిస్సందేహం.

తెలంగాణా రైతుసమస్యలు రెండుసంపుటాలుగ ప్రకటించసంకల్పించిన రచయితలు, ఈ మొదటిసంపుటంలో భూమిహక్కుల విధానము, భూమిశిస్తు విధానం (Land tenure & land revenue system) అనే రెండు

సమస్యలనే ప్రధానంగా చర్చించారు. తెలంగాణాలో భూమిహక్కుల విధానం, భూమిశిస్తువిధానం, రెండూ కూడా, ఒక నీతినియమాలులేని, తలా తోకలేని, వరుస, పద్ధతిలేని పంచకూళ్లకి షాయంగా తయారయ్యాయి. నైజాం నవాబు జారీచేసిన చట్టాలు ఫర్మానాలు, అట్టివేమీలేకుండానే ఏర్పాటు చేసిన సాంప్రదాయాలు కొన్ని వున్నాయి. జాగీర్దార్లు, దేశముఖులు వగైరా భోగానవాబులు, అమల్లోపెట్టిన అక్రమవిధానాలు వరొకరూపంలో లిఖిత రహితమైన చట్టాలుగా తయారయ్యాయి. అటుపైన పోలీసుయాక్షనుతదుపరి, మరికొన్ని చట్టాలు ఆర్డినెన్సులు అమల్లోకివచ్చాయి. వీటన్నింటి ఫలితంగా, పర్యవసానానికి, నేడమల్లోఉన్న భూమిహక్కువిధానం, శిస్తువిధానం ఎట్టిది? అన్నవిషయంపై రైతాంగంలోను, రైతుసేవకులైన కార్యకర్తల్లోను ఎంతో గందరగోళం నెలకొంది. రైతాంగంలోనేగాదు. తుదకు హెచ్చుభాగం రివిన్యూ ఉద్యోగప్రపంచంగూడ అయోమయావస్థలో ఉంది. దీనితో చట్ట బద్ధంగా రైతాంగానికి ఉన్న స్వల్పహక్కులను సహితం, రైతులు గుర్తించి, రక్షించుకోలేని పరిస్థితిలో పడవలసివస్తోంది. అమల్లో ఉన్న చట్టాలను, శాస నాలను ఒలాదూసుగా తుంచివేసి, తమ చిత్తాయిత్తంగా రైతుహక్కులను నిరంకుశంగా కాళ్లక్రింద మట్టగిస్తున్న భూస్వామి బృందం సాగించే రైతు వ్యతిరేకపోరాటంలో, రైతులకు చట్టప్రకారమున్న భూమిహక్కులను రక్షించడం గూడ తెలంగాణా రైతు ఉద్యమనిర్మాణంలో అత్యంతప్రా ముఖ్యత గల్గియుంది. భూమిహక్కుల విధానాన్ని స్థూలంగా వివరించిన ఈ “తెలంగాణా రైతుసమస్యలు,” రైతుకార్యకర్తలకు పై కార్యనిర్వహణలో ఎంతైనా తోడ్పడుతుంది.

“తెలంగాణా రైతు సమస్యలు,” అనే ఈ పుస్తకంలో రచయితలు ప్రయత్నించిన రెండవముఖ్యసమస్య గూడ అత్యంతప్రాధాన్యతను గల్గియుంది. ప్రభుత్వం ప్రకటించిన అసమగ్రమైన, కృత్రిమలెఖ్ఖల ను

సరించే, తెలంగాణాలో ఫ్యూడల్ భూస్వామివిధానం, ఎలా ప్రజాపురోభి వృద్ధికి ప్రబల ఆటంకంగా ఉందో నిరూపించుతూ, తెలంగాణాలో అత్యధికభాగం రైతాంగం, రైత్వారీహక్కులతో స్వతంత్రంగా ఉందనే ప్రభుత్వ వాదనలు పటాపంచలు చేయబడ్డాయి. ప్రభుత్వం ప్రవేశపెట్టిన జాగీర్దారీ రద్దుచట్టాలు, కౌలుదార్లరక్షణచట్టాలు, బ్రహ్మాండమైన విప్లవయుతవ్యవసాయ సంస్కరణలని బాకాలూదబడతున్నాయి. అందలి బండారమేమిటో, అసలు వ్యవసాయసమస్య ఎలా వీటితో పరిష్కరింపబడలేదో, బడజాలదో గూడ స్పష్టం చేయబడింది. భూస్వామ్యవిధానాన్ని రద్దుగావించి, దున్నే వారికే భూమిహక్కు సాధించుటకు సాగినవీరోచిత తెలంగాణా రైతుపోరాటలక్ష్యం యధాతథంగా ఎలా మిగిలిఉందో గూడా వివరించబడింది. సాగుకులాయికి అయిన లక్షల ఎకరాలు ఏవిధంగా పడావుగ పెట్టబడియున్నదీ, నూటికి అయిదారుగురికి మించనిబడా భూస్వాములచేతుల్లో సగానికిసగం మొత్తంభూమి ఉండిపోయిందో, నష్టపరిహారం పేరిట భూస్వాములకు రైతాంగంచే ఇప్పించప్రయత్నించే కోట్లరూపాయలు రైతాంగాన్ని ఏవిధంగా శాశ్వితరుణగ్రస్తులగను బానిసలుగను చేస్తుందో బహిర్గతం చేయబడింది. తెలంగాణారైతు ఉద్యమభవిష్యత్ లక్ష్యాలను, కర్తవ్యాలను స్పష్టంగా ముందుకు పెట్టడంలో గ్రంధకర్తలు చాలవరకు కృతకృత్యులయ్యారు.

ఈ సందర్భంలో మరొకవిషయం ప్రస్తావించడం అప్రస్తుతం కాజాలదు. వ్యవసాయసమస్య, నేటి భారత జాతీయ సమస్యల్లోకెల్లా ప్రధానసమస్యయేగాక ప్రథమసమస్యయనే మాటగూడ నిర్వివాదాంశం. వ్యవసాయసమస్య ఒక్కరైతాంగంయొక్క లాభనష్టాలసమస్యగాదు. తీవ్రవ్యవసాయసంస్కరణలను ప్రవేశపెట్టవలసిన అవసరం, మొత్తం మనదేశప్రజల అవసరంగా ముందుకువచ్చి నిల్చియుంది.

తీవ్రవ్యవసాయ సంస్కరణలు ప్రవేశపెట్టినచో భూములు కోల్పోయిన లక్షల, కోట్ల వ్యవసాయ కూలీలవర్గం దరిద్ర, నిరుద్యోగ రాక్షసికి గురియై, లేబరుమార్కెటు చవుకయిపోవటం తథ్యం. ఇట్టిస్థితిలో పారిశ్రామిక కార్మికవర్గం, నిరుద్యోగవ్యవసాయ కూలీసైన్యంతో నిరంతరం పోటీకి గురియవుతుంది. కార్మికవర్గం, తనదైనందిన జీవిత సమస్యలపై పోరాటాలు సాగించలేని దుస్థితిలో బడకతప్పదు. అందుచే కార్మికవర్గం తన అంతిమ ప్రయోజనలకేగాక, తక్షణప్రయోజనాల రీత్యాగూడ వ్యవసాయసంస్కరణలు, తద్వారా గ్రామీణ నిరుద్యోగసమస్యా పరిష్కారానికి తోడ్పాటు చేయాల్సివుంటుంది.

ఇట్టి అతిప్రధానమైన వ్యవసాయసమస్యను, ఎన్నో పార్టీలు, ప్రజాసంస్థలు, ఎందరో ప్రగతిశీలురైన ప్రముఖవ్యక్తులు చాలకాలం నుండి వ్యక్తపరుస్తూనేవున్నారు. వీరంతా చేసిన లక్షల తీర్మానాలు, వేల చిన్నచిన్నపోరాటాలు, ప్రకటితమైన [illegible] చేయజాలని ప్రభావం, తెలంగాణా రైతుపోరాటం చేయగల్గింది. తెలంగాణాపోరాటం, వ్యవసాయ విప్లవసమస్యను తక్షణసమస్యగా ముందుకు తెచ్చింది. దేశంలోని నలు మూలలనున్న ప్రజాతంత్రవాదులు, అభ్యుదయకాముకులు తెలంగాణా పూరించిన శంఖారావాన్నివిని వ్యవసాయసమస్యా పరిష్కారం సత్వరం జరుగాలని కోరుతున్నారు. తెలంగాణా రైతుపోరాట తాకిడి తగిలిన సనాతనవాదులు, మితవాదులు, రైతుసంస్కరణ వ్యతిరేకశక్తులుగూడ కదిలి, భూదానయజ్ఞాలనో, జమీందారీరద్దు చట్టాలనో, కౌలుదారుసంరక్షణ శాసనాలనో కళ్లనీళ్ళుతుడిచే కార్యక్రమాలకు, రైతాంగానికి భ్రమలుకల్పేటట్టి, ఆశలురేకెత్తించేటట్టి, పెద్దపెద్దవాగ్దానాలకు దిగకతప్పలేదు. ఆఖర్లో అమెరికన్ డాలరుకబంధుని ఆధ్వర్యాన "కమ్యూనిటీప్రాజెక్టుల" [illegible] లేవదీయవలసివచ్చింది. వ్యవసాయసమస్యను తీరుస్తామని మాటలు, తీర్మానాలు చేసే

యుగాన్నుంచి, తక్షణ ఆచరణ సమస్యగా రంగంపైకి తెచ్చిన గురుతరగౌరవం తెలంగాణాకే దక్కింది. సుదీర్ఘమైన, వీరోచిత పోరాటం సాగించి, మహత్తర త్యాగాలుచేసి, వేలమంది తమ పుత్రపుత్రికారత్నాల ప్రాణబలిదానంచేసి, వ్యవసాయసమస్యను నేటి ప్రథమజాతీయ సమస్యగా ముందుకు తెచ్చిన, తెలంగాణా రైతాంగానికి నా జేజేలు.

భారతవ్యవసాయ విప్లవోద్యమంలో మొనగాడుగ ముందుకువచ్చిన తెలంగాణా రైతు ఉద్యమంయొక్క బాధ్యత అంతటితో తీరిపోలేదు. తెలంగాణారైతాంగం, రైతు-కూలీసంఘాలలో సంఘటితమై, మరొకముందడుగువేస్తూ. భారత రైతువుద్యమానికి అగ్రగామి పాత్ర నిర్వహించాలి.

భూస్వామ్యవర్గం, కాంగ్రెసు ప్రభుత్వ అండతో, రైతాంగంపైనే పోక నూతనదాడిని కొనసాగించుతోంది 1945 చివరభాగంలో, భూములపైనుండి రైతులనుతొలగించే దేశముఖు జాగీర్దారు కుట్రలకు వ్యతిరేకంగా, ప్రారంభమైన తీవ్రతర రైతాంగ ప్రతిఘటన, ఉత్తమశిఖరాలనందుకొని, 1951 ఆఖరుభాగంవరకు సాగింది. ఈ అయిదేండ్లు ప్రతిఘటనాకాలంలోనూ, ఏ భూస్వామివర్గం రైతాంగాన్ని భూములనుండి తొలగించ విఫలమైందో, ఆ భూస్వామివర్గం నేడాపనికుపక్రమించి,విజృంభించుతోంది. తెలంగాణారైతు ప్రతిఘటనసాగిన అయిదేండ్లకాలంలోనూ, పల్లెలువిడిచి పట్టణాలకుపారిపోయిన బడాభూస్వాములమురా నేడు స్వేచ్ఛగా తమ పాతదుర్గాల్లో తిష్టవేసి, కాంగ్రెసు పోలీసు సాయంతో భూముల దురాక్రమణ సాగించుతోంది. ఏ పటేలు, పట్వారీబృందం ప్రజాక్రోధానికి బెదిరి, భూస్వాముల ఏజెంట్లుగా పనిచేయజంకి ఉంటూవచ్చారో, నేడాపటేలు, పట్వారీబృందం భూస్వాముల జేబుపిచ్చుకలుగా పనిచేస్తోంది. ఏ కాంగ్రెసు ప్రభుత్వం, రైతాంగవిప్లవ జ్వాలలను చల్లార్చుటకు, కొన్ని సంస్కరణలు ప్రకటించిందో, ఆ కాంగ్రెసు ప్రభుత్వం, నేడు, వాటినన్నిటిని నామమాత్రంచేసి, చట్టవిరుద్ధంగా సాగింపబడుతున్న బేదఖలీలకు పరోక్షసాయం

చేస్తోంది. రైతాంగంపైసాగే ఈ దాడికి వ్యతిరేకంగా, రైతులను చైతన్యవంతంచేయడం, సంఘటితంచేయడం, ప్రతిఘటనకు సంసిద్ధం చేయడం, ఎంతేని అవసరం. అలాంటి రైతు ఉద్యమ నిర్మాణానికి, తెలంగాణా రైతు సమస్యలనే ఈ పుస్తకం ఎంతేని తోడ్పడుతుందని ఆశిస్తున్నాను.

కామ్రేడ్స వాసుదేవరావు, ప్రసాదరావుగారలు, ఆలస్యంచేయకుండా, తెలంగాణా రైతుసమస్యలు రెండవసంపుటాన్ని వ్రాసి ప్రకటించపూనుకోవాలని నా విజ్ఞాపన. రెండవసంపుటంలో గ్రామసీమల్లోని చేనేతగీత పనివారల సమస్యలు, వ్యవసాయ కూలీపాలేళ్ల సమస్యలు, ఇరిగేషను, కోఆపరేటివ్ ఉద్యమసమస్యలు, సంఘనిర్మాణ సమస్యలు, వ్యవసాయ కార్యక్రమం మున్నగు వాటిపై కేంద్రీకరించనున్నట్లు స్పష్టంచేశారు. అప్పుడే సమగ్రమైన 'రైతుసమస్యలు' గ్రంథం, రైతు కార్యకర్తలచేతుల్లో పదునైన ఆయుధంగా పనిచేస్తుంది.

ఆంధ్రరైతు ఉద్యమంలో గతపదిహేనేళ్లకుపైగా ప్రత్యక్షపరిచయం గల్గి, పలాసా మొదలు, మద్రాసువరకు, వేలమైళ్లను కాలినడకతో రైతుయాత్రలుసాగించి, మునగాల చల్లపల్లి మున్నగు జమీందారీ వ్యతిరేక పోరాటాల్లో పాల్గొని, ఆంధ్రరాష్ట్ర రైతుసంఘానికి అధ్యక్ష కార్యదర్శులుగా అనేక సంవత్సరాలు పనిచేసిన కామ్రేడ్స్ వాసుదేవరావు, కంపూరి ప్రసాదరావు గారలు, స్వయంగా గత రెండుమూడేళ్లుగ తెలంగాణా రంగంలో పనిచేస్తూ ఈ అనుభవజ్ఞానాన్ని గూడ జోడించి, ఈ పుస్తకాన్ని తయారుచేయడంలో ఒక ప్రత్యేక విశిష్టతఉంది.

పాఠకులు, రైతు శ్రేయోభిలాషులు, తెలంగాణాలోని తదితర అభ్యుదయకాముకులు, ఈ గ్రంథాన్ని సానుభూతితో ఆదరిస్తారని, గ్రంథకర్తలకు సముచిత ప్రోత్సాహం ఇస్తారనివిశ్వసిస్తున్నాను.

ఇట్లు,
భవదీయుడు,
మాకినేని బసవపున్నయ్య

హయిదరాబాదు
15-11-1952

# విషయసూచిక

విషయం. పేజీ.



—◆ అనుబంధం. ◆—



—◆ రెండవభాగం. ◆—

# హైదరాబాద్ సంస్థానంలో భూమిచట్టాలలోని ముఖ్యాంశాలు

[ మొదటి భాగము ]

## —♦ హైదరాబాదు సంస్థానం — దాని వైశాల్యం; జనాభా; భూమి వివరాలు. ♦—

(అ) మొత్తం వైశాల్యం:— 82,698 చదరపుమైళ్లు. లేదా 5 కోట్ల 30 లక్షుల ఎకరాలు.

(ఆ) మొత్తం జనాభా:— 1 కోటి 86 లక్షులు. (ఇందులో పురుషులు 94 లక్షులు; స్త్రీలు 92 లక్షులు.)

హైదరాబాదు సంస్థానంలో మూడు ప్రధాన భాషా ప్రాంతాలున్నాయి. అవి ఏవంటే (1) తెలంగాణా (8 జిల్లాలు). (2) మరాట్వాడా (5 జిల్లాలు). (3) కన్నడప్రాంతం (3 జిల్లాలు) మొత్తం 16 జిల్లాలు. పైన తెల్పిన భాషాప్రాంతాల వైశాల్యం, జనాభా వివరాలు యీ క్రిందివిధంగా వున్నాయి.—

| ప్రాంతం పేరు. | వైశాల్యం మొత్తం (ఎకరాలలో). | సంస్థానం మొత్తం వైశాల్యంలో ఎంతభాగం. | మొత్తం జనాభా. | సంస్థానం మొత్తం జనాభాలో ఎన్నోవంతు? |
|---|---|---|---|---|
| తెలంగాణా | 2 కోట్ల 66 లక్షులు. | 50% | ఒకకోటి. | 54% |
| మరాట్వాడా | 1 కోటి 16 లక్షులు. | 28% | 47 లక్షుల 75 వేలు. | 26% |
| కన్నడప్రాంతం | 1 కోటి 18 లక్షులు. | 22% | 37 లక్షుల 75 వేలు. | 20% |
| సంస్థానం మొత్తంమీద | 5 కోట్ల 30 లక్షులు. | 100 | 1 కోటి 86 లక్షులు. | 100 |

(1951 సంవత్సరం జనాభాలెక్కల రిపోర్టు.)

## తెలంగాణా జిల్లాలవారిగా సంస్థానం వైశాల్యం, జనాభా.

| జిల్లా పేరు. | వైశాల్యం (ఎకరాలలో) | సంస్థానంమొత్తం వైశాల్యంలో ఎన్నోవంతు? (%) | జనాభా. | మొత్తం జనాభాలో ఎన్నోవంతు? (%) |
|---|---|---|---|---|
| వరంగల్లు | 50,84,000 | 9.5 | 15 81,326 | 8.5 |
| నల్లగొండ | 38,71,000 | 7.5 | 15,43,975 | 8,0 |
| కరీంనగరు | 36,62 000 | 7.0 | 15,81,667 | 8.5 |
| మహబూబ్ నగరు | 34 09,000 | 6.5 | 11,86,496 | 6.5 |
| ఆదిలాబాద్ | 46,68 000 | 9.0 | 9,02,522 | 5.0 |
| హైదరాబాదు | 19,97,000 | 3.8 | 15,11,336 | 8.0 |
| మెదక్ | 19,55,000 | 3.5 | 10,27,293 | 5.5 |
| నిజామాబాదు | 19,15,000 | 3.6 | 7,73,158 | 4.0 |
| మొత్తం తెలంగాణా | 2 66,00,000 (సుమారు) | 50.4 | 1,00,50,00 (సుమారు) | 54.0 |
| మరాట్వాడా మొత్తంప్రాంతం | 1,46,00,000 | 28.0 | 47,75.000 | 26.0 |
| కన్నడమొత్తం ప్రాంతం | 1,18,00,000 | 21.6 | 37,75,000 | 20.0 |
| మొత్తం హైదరాబాదుసంస్థానం | 5,30,00,000 | 100 | 1,86,00,000 | 100 |

(ఇ) భూమి వివరాలు:— హైదరాబాదు సంస్థానం భూమివివరాలలో కొన్ని విశేషాలు ఉన్నాయి. మొత్తం సంస్థానం వైశాల్యంలో ఆక్రమితభూమి నూటికి 64½ వంతులు. ఆక్రమితభూమి అంటే అంతా సాగులోకి తేబడి పంటలు పండుతున్న భూమి అని అర్థంకాదు. దేశముఖులు, జాగీరుదార్లు మున్నగు పెద్ద భూస్వాములు ప్రభుత్వోద్యోగులను కట్టుకొని తమ అధీనంలో అట్టిపెట్టుకొనివున్న భూమిగూడ యిందులో చేరివుంది. అంటే వాళ్ళక్రింద పచ్చికబీళ్లుగాను, కంచెలుగాను పడివున్న భూమిగూడ యిందులో కలిసివుందన్నమాట. వాస్తవంగా సాగుఅయ్యేభూమి అంతకన్నా తక్కువగానేవుంది. అందుచేతనే పడావుగావున్నభూమి యితర రాష్ట్రాలలోకంటే హెచ్చుగావుంది. మొత్తం సంస్థానంలో సాగుభూమివైశాల్యం 2 కోట్ల 25 లక్షలు ఎకరాలుఅయితే (యీ సాగుభూమిలో కంచెలు, చిన్నబోళ్లు, దిబ్బలు మొదలగు వాస్తవంగా సాగులో లేని భూములుగూడ కలిపివున్నాయి) పడావుగా పడివున్నభూమి దాదాపు 78 లక్షల ఎకరాలవరకూ వుంది. అంటే మొత్తం సాగుభూమిలో పడావుగా పడివున్నభూమి దాదాపు నూటికి 35 వంతులవరకు అంటే మూడవవంతుకుపైగా వుందన్నమాట. అందులోనూ తెలంగాణాలో పడావుగా పడివున్నభాగం మరీ విస్తారంగావుంది. ఉదాహరణకు: ఎనిమిది తెలంగాణాజిల్లాలలో పడావుగావున్నభూమి దాదాపు 43 లక్షల ఎకరాలవరకూ

వుంది. అంటే సంస్థానం మొత్తంమీద పడావుగా పడివున్న భూమిలో నూటికి 55 వంతులవరకూ తెలంగాణాలోనే వున్నదన్నమాట. ఇంత విస్తారంగా పడావుగావున్నభూమి తెలంగాణాలో వుండడానికి తెలంగాణాలో సాగుతూవున్న ప్యూడలు దోపిడీయే ప్రధానకారణం. రైతులపై ఫ్యూడలు దోపిడీభారం క్రమక్రమేణా అధికమగుటవలన వ్యవసాయం చేసుకొనేశక్తి, ఉత్సాహం రైతాంగంలో నశించిపోయింది. అందుచేత రైతుల క్రిందవున్న భూములు క్రమక్రమేణా భూస్వాముల చేతుల్లోకి పోవడం, అవి పడావుగా పడివుండడం జరుగుతోంది. ఈ విషయాన్ని యీ క్రింద చూపెట్టిన లెక్కలు స్పష్టపరుస్తాయి.

| సంవత్సరం. | తెలంగాణాప్రాంతం. భూఖామందుకుండే సగటు సాగు భూమి (ఎకరాలలో) | | | మరాఠ్వాడాప్రాంతం. భూఖామందుకుండే సగటు సాగుభూమి (ఎకరాలలో) | | | కన్నడప్రాంతం. భూఖామందుకుండే సగటు సాగుభూమి (ఎకరాలలో) | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | తరి | ఖుష్కి | బాగాత్ | తరి | ఖుష్కి | బాగాత్ | తరి | ఖుష్కి | బాగాత్ |
| | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. |
| 1914—15 | 1—86 | 14—8 | — | 0—66 | 25—63 | — | — | — | — |
| 1933—34 | 1—58 | 12—51 | — | 0—50 | 21—85 | — | — | — | — |
| 1935—36 | 1—59 | 12—26 | — | 0—41 | 21—15 | — | — | — | — |
| 1939—40 | 1—56 | 11—85 | — | 0—46 | 10—19 | — | — | — | — |
| 1940—41 | — | 10—78 | — | — | 18—39 | — | — | — | — |
| 1945—46 | 1—17 | 8—56 | — | 0 35 | 15—48 | — | — | — | — |

(హైదరాబాదు వ్యవసాయసంస్కరణల విచారణకమిటీ నివేదిక అనుబంధం 'ఎ' నుండి)

సాగు భూమి తగ్గుపైన యివ్వబడిన పట్టీకనుబట్టి సంస్థానంలో పడావుగా పడివున్నభూమి విస్తీర్ణం హెచ్చుతూ వున్నట్లు సుస్పష్టం. ఉదాహరణకు 1914-15 సంవత్సరంలో తెలంగాణాలో భూఖామందకుండే సగటు తరి సాగుభూమి ఒక ఎకరం 86 సెంట్లువుంటే 1945-46 వ సంవత్సరం వచ్చేప్పటికి అదే భూమి ఎకరం 17 సెంట్లకు పడిపోయింది. అంటే దాదాపు నూటికి 37½ వంతులు పడిపోయింది. ఖుష్కీ భూమి విషయం తీసుకుంటేగూడ అదేవిధమైన తగ్గుదల కన్పిస్తుంది. తెలంగాణాలో సగటు ఖుష్కీ సాగుభూమి 1914-15 సంవత్సరంలో 14 ఎకరాల 8 సెంట్లువుంటే 1945-46లో అదేభూమి 8 ఎకరాల 56 సెంట్లకు తగ్గింది. అంటే దాదాపు నూటికి 37 వంతులు తగ్గిందన్నమాట బాగాతు భూమి విషయంలో లెక్కలు పైన తెల్పిన నివేదికలో యివ్వబడలేదు.

మరాట్వాడా ప్రాంతంలోగూడ తెలంగాణాలోవలెనే సగటు సాగుభూమి తగ్గి పడావుభూమి హెచ్చుతూవచ్చింది. తెలంగాణాలోకంటే గూడ మరట్వాడాలో సగటు త. సాగు భూమి హెచ్చుగా పడిపోయింది. ఉదాహరణకు 1914-15 సంవత్సరంలో ఆ ప్రాంతంలో భూఖామందులకుండే సగటు తరి సాగుభూమి 66 సెంట్లువుంటే 1945-46 సంవత్సరం వచ్చేప్పటికి ఆ విస్తీర్ణం 35 సెంట్లకు దిగిపోయింది. అంటే దాదాపు సగానికి సగం పడావుగా పడివుందన్నమాట. ఖుష్కీ సాగుభూమి విషయంలో తరి సాగుభూమివలె అధికంగా పడావుగావుండి పోవడం జరగలేదు. 1914-15లో సగటు ఖుష్కీ సాగుభూమి

25 ఎకరాల 63 సెంట్లు వుంటే 1945-46 వచ్చేప్పటికి అది 15 ఎకరాల 48 సెంట్లకు తగ్గిపోయింది. అంటే దాదాపు నూటికి 40 వంతులు తగ్గిపోయింది.

నేడు సంస్థానంలో సాగుబడిదారులక్రింద వుండే సగటు సాగుభూమి విస్తీర్ణాన్ని జిల్లాలవారిగా తెల్పుతూ ఈ క్రింద చూపబడింది.

| | సాగుదారులక్రిందవుండే సగటు భూమి విస్తీర్ణం (ఎకరాలు) | | | | | |
|---|---|---|---|---|---|---|
| జిల్లా పేరు | తరి | | ఖుష్కీ | | బాగాతు | |
| | ఎకరాలు | గుంటలు | ఎకరాలు | గుంటలు | ఎకరాలు | గుంటలు |
| వరంగల్ | 2 | 13 | 10 | 15 | 0 | 3 |
| నల్లగొండ | 1 | 17 1/2 | 13 | 29 1/2 | 0 | 2 |
| కరీంనగరు. | 1 | 16 | 7 | 21 | 0 | 7 |
| మహబూబ్‌నగరు | 2 | 12 | 13 | 34 | 0 | 4 |
| ఆదిలాబాద్ | 1 | 07 | 10 | 16 | 0 | 1 |
| హైదరాబాద్ | 1 | 20 | 14 | 39 | 0 | 14 |
| మేదక్ | 1 | 13 | 5 | 07 | 0 | 02 1/2 |
| నిజామాబాద్ | 1 | 13 | 2 | 34 | 0 | 02 |
| తెలంగాణాప్రాంతం సగటు | 1 | 26 | 9 | 22 | 0 | 04 1/2 |
| మరాట్వాడప్రాంతం సగటు | 0 | 10 1/2 | 24 | 9 | 0 | 25 |
| కన్నడప్రాంతం సగటు | 0 | 3 | 18 | 00 | 0 | 7 1/2 |
| సంస్థానం సగటు | 1 | 3 1/ | 14 | 02 | 0 | 8 |

("హైదరాబాదు గ్రామీణ ఆర్థికవిచారణ" అన్న యింగ్లీషు గ్రంథంనుండి. పేజీ. 72)

ఈ విధంగా పడావుభూమి జాస్తిగా వుండడమేగాకుండా సంస్థానంలో ఇంకా సాగులాయకుభూమిగూడ చాలవుంది. సాగుభూమిమొత్తం దాదాపు 2 కోట్ల 40 లక్షలు ఎకరాలు. అయితే సాగులోకి తేవడానికి నేను అనుకూలంగా వున్నభూమి దాదాపు 4 లక్షల ఎకరాల వరకూవుంది. అంటే దాదాపు సాగుభూమిలో 6 వంతు సాగు లాయకుభూమి వుందన్న మాట. ఇదిగాక ప్రభుత్వం లెక్కలప్రకారం సాగులాయకు కానట్టిభూమి 86 లక్షల ఎకరాలకుపైగావుంది. కాంగ్రెసుప్రభుత్వం అంచనాలప్రకారం యీ భూమిఅంతా సాగుకు లాయకు అయినది కాకపోవచ్చు. కాని ప్రజా ప్రభుత్వం ఆధ్వర్యముక్రింద యీభూమిలో అధికభాగాన్ని ఆధునిక వ్యవసాయ పద్ధతులద్వారా, యంత్రసహాయంతో సాగు లాయకుభూమిగా చేయడానికి అవకాశం వుంటుంది. ఈ విధంగా పడావుభూమిని, సాగులాయకుభూమి, సాగు లాయకు కాదని చెప్పబడేభూమిలో అధికభాగాన్ని సాగులోకి తీసుకురావడానికి ప్రయత్నిస్తే దాదాపు 1½ కోట్ల ఎకరాల భూమిని అదనంగా సాగులోకి తీసుకురావడానికి అవకాశం వుంటుంది. సంస్థానంలో ప్రధాన మూడు భాషాప్రాంతాలలో సాగుభూమి, పడావు, సాగులాయకు, సాగుచేయు, లాయకుభూముల వివరాలు యీ క్రింది విధంగా ఉన్నాయి:—

| ప్రాంతం పేరు. | అడవి విస్తీర్ణం (ఎకరాలలో). | మొత్తం సాగుభూమి విస్తీర్ణం. | పడావు భూమి విస్తీర్ణం. | సాగులాయకుభూమి విస్తీర్ణం. | సాగుచేయి లాయకు భూమి విస్తీర్ణం. |
|---|---|---|---|---|---|
| తెలంగాణా | 54 లక్షల 68 వేలు | 91 లక్షల 60 వేలు | 41 లక్షల 37 వేలు | 19 లక్షల 94 వేలు | 58 లక్షల 7 వేలు |
| మరాట్వాడా కన్నడప్రాంతం | 7 లక్షల 8 వేలు | 1 కోటి 73 లక్షలు | 35 లక్షల 12 వేలు | 19 లక్షల 86 వేలు | 28 లక్షల 44 వేలు |

భూమివిచారలగూర్చిన భోగట్టా జిల్లాలవారిగాచూస్తే తెలంగాణా జిల్లాలలో పడావుభూమి, సాగు లాయకుభూమి, అరణ్యప్రాంతం ఎలా అధికంగావుందో బోధపడుతుంది. ఆ భోగట్టాను ఈ క్రింద యిస్తున్నాం:—

| జిల్లా పేరు. | వైశాల్యం (ఎకరాలలో). | అరణ్యం. | సాగుభూమి విస్తీర్ణం. | పడావుభూమి. | సాగు లాయకు భూమి. | సాగుచేయు లాయకు భూమి. |
|---|---|---|---|---|---|---|
| వరంగల్లు | 50,81,000 | 13,80,000 | 12,63,000 | 8,61,000 | 2,12,000 | 13,88,000 |
| నల్లగొండ | 38,71,000 | 2 61,000 | 15,81,000 | 8,00,000 | 3,66,000 | 8,70,000 |
| కరీంనగరు | 36,62,000 | 5,38,000 | 13,30,000 | 6,88,000 | 2 82,000 | 8,24,000 |
| మెదక్ | 19,55,000 | 2,09,000 | 6,45,000 | 3,16,000 | 3,75,000 | 4,11 000 |
| మహబూబ్‌నగరు | 34,09,000 | 6,22,000 | 17,05,000 | 3 25,000 | 1,10,000 | 6,47,000 |
| హైదరాబాదు | 19,97,000 | 1,41,000 | 6,62,000 | 4,33,000 | 2,87,000 | 3,91,000 |
| నిజామాబాద్ | 19,15,000 | 2,69,000 | 5,99,000 | 2,95,000 | 2,70,000 | 4,82,000 |
| ఆదిలాబాదు | 46 68,000 | 20,74,000 | 13,18,000 | 3,90,000 | 92 000 | 7,04,000 |
| తెలంగాణా | 2,65 61,000 | 54 63 000 | 91,60,000 | 41,37,000 | 19,14,000 | 53 07,000 |
| మొత్తంమీద | (50%) | (89%) | (35%) | (55%) | (50%) | (67%) |
| సంస్థానం మొత్తంమీద | 5,29,27,000 | 61,70.000 | 2,64,75,000 | 76 49,000 | 39,50,000 | 86,51,000 |

ఇచ్చట యివ్వబడిన పట్టికను బట్టి తేలేదేమంటే, 1) తెలంగాణా ప్రాంతంలో తదితర ప్రాంతాలకంటె సాగుఅవుతున్న భూమి తక్కువగాను పడావుభూమి ఎక్కువగానూవుంది. ఉదాహరణకు మొత్తం సంస్థానం విస్తీర్ణంలో తెలంగాణా విస్తీర్ణం సగంవుంది. అయినా సాగు భూమిమాత్రం నూటికి 35 వంతులు మాత్రమే వుంది. తతిమా రెండువంతుల సాగు భూమిఅంతా మరాట్వాడా, కన్నడ ప్రాంతాలలోవుంది. ఇందుకు కారణం తెలంగాణాలో అరణ్య ప్రాంతం ఎక్కువగా వుండటమే ప్రధానకారణంగాదు. తెలంగాణలో పడావుభూమి హెచ్చుగా వుండడం; దీనితోపాటు సాగులాయకుభూమి సాగుచేయలాయకు భూమి దాదాపు 70 లక్షల ఎకరాలపై చిల్లరవరకూ వృధాగా పడివుండడమే ప్రధానకారణం. అందుచేత తెలంగాణాలో నేడు వ్యవసాయం క్షీణదశలో వుండడానికి ఆహార సంక్షోభవం దారిద్ర్యం తీవ్రంగా వుండడానికి కొందరు తప్పుగా వాదిస్తున్నట్లుగా భూమి కొరతగాని, జనాభా వృద్ధిగాని, అరణ్యం అధికంగా వుండటంగాని ప్రధాన కారణంకాదు. వందల సంవత్సరాలనుండి నైజాంనవాబు, ప్యూడలు జాగీరుదార్లు, దేశముఖులు, మున్నగు వాళ్ల దారుణ దోపిడీ ఫలితంగా భూమిలో అధికభాగం దున్నేవానిచేతిలో లేకుండా పరాన్న భుక్కులైన పై దోపిడీ వర్గాల చేతుల్లో కేంద్రీకరింపబడి వుండడమే ప్రధాన కారణం.

నైజాంనవాబు, ప్యూడలు భూస్వాముల వందల సంవత్సరాల దోపిడీ ఫలితంగా భూమిదున్నేవాని చేతినుండి తొల

గింపబడి భూస్వామిక పీడక వర్గాల చేతుల్లో కేంద్రీకరింపబడి వుంది. ఈ విషయంపై ప్రభుత్వం సేకరించిన లెక్కలు చాలా తక్కువగా వున్నాయి. 1950-51 ప్రభుత్వం పరిపాలనా నివేదికలో మూడు జిల్లాలకు సంబంధించిన లెక్కలు ఇవ్వబడ్డాయి. వాటిని యీక్రింద వుదహరిస్తున్నాం.

| జిల్లా | 500 ఎకరాలకుమించిన పట్టాల సంఖ్య | పదిఎకరాలకు తక్కువగా వున్న పట్టాలసంఖ్య |
|---|---|---|
| నల్లగొండ | 252 | 21,913 |
| మహబూబ్‌నగరు | 144 | 18,262 |
| వరంగల్లు | 155 | 10 690 |

పైన తెల్పిన లెక్కలనుబట్టి భూమి కేంద్రీకరణగూర్చి వాస్తవ పరిస్థితి అంతగా తెలియదు. ఎందుచేతనంటే 500 ఎకరాలకు మించిన పట్టాలసంఖ్య ఇవ్వబడిందేగాని ఆపట్టాలక్రింద వున్న మొత్తం భూమిని బయటపెట్టడం జరగలేదు. 500 ఎకరాలకు మించిన పెద్దకుటుంబాలు అన్నీ దాదాపు దొరల కుటుంబాలుగా వుంటాయి. ఈ కుటుంబాలసంఖ్య మొత్తం పట్టాదారులసంఖ్యతో పోల్చినపుడు అతి స్వల్పమేఅయినా వీటి ఆధీనంక్రింద వున్న భూమిమాత్రం నూటికి 60,70 వంతుల వరకూ వుంటుంది. కాని ప్రభుత్వలెక్కలు యీ విషయాన్ని బయటపెట్టవు. మనం స్వతంత్రంగా నిష్పక్షపాత దృష్టితో యే ప్రాంతం లెక్కలుతీసినా పైన తెల్పిన విషయం బయటబడుతుంది.

(ఈ) దివానీ లేక ఖాల్సా, జాగీరు, సర్ఫఖాస్ ప్రాంతాలు:-

పోలీసుచర్యకు పూర్వం, అటుతర్వాత కొంతకాలంవరకు హైదరాబాదుసంస్థానం మూడురకాల ప్రాంతాలుగా (భూమి శిస్తువిధానం, భూస్వామ్య పద్ధతిరీత్యా) విభజింపబడి వుండేది. ఈ మూడుప్రాంతాలు ఏవంటే: (1) దివానీ లేక ఖాల్సా ప్రాంతం. (ఈ ప్రాంతం దాదాపు యూనియన్ ప్రాంతాల రైతువారీ ప్రాంతంమాదిరిది). (2) జాగీరుప్రాంతం. (3) సర్ఫ ఖాస్‌ప్రాంతం. (నైజాంనవాబు స్వంతఆస్థిగా పరిగణింపబడిన ప్రాంతం.)

ప్రాంతాలవారిగా పైవాటి వైశాల్యం, దివానీప్రాంతం 3 కోట్ల ఎకరాలకుపైగా వుంటుంది. దీనితరువాత పెద్దప్రాంతం జాగీరుప్రాంతం దీనివైశాల్యం 1½ కోట్ల ఎకరాలకు అంటే దాదాపు ఖాల్సాలో సగభాగంపైగా వుంటుంది. సర్ఫఖాస్ దాదాపు 55 లక్షల ఎకరాలు అంటే దాదాపు ఖాల్సాలో ఆరవవంతు వుంటుంది.

జనాభావారిగా చూస్తేమాత్రం కొంత తేడా కన్పించుతుంది. దివానీప్రాంతం దాదాపు నూటికి 60 వంతులే వున్నప్పటికీ, జనాభాలో నూటికి 75 వంతులువుంది. జాగీరు, సర్ఫ ఖాస్ ప్రాంతాలలోమాత్రం నూటికి 25 వంతులు మాత్రమే వుంది. వైశాల్యంచూస్తే ఈ రెండుప్రాంతాలలో, మొత్తం సంస్థానం వైశాల్యంలో నూటికి 40 వంతులవరకూ వుంది. అయినా జనాభా ఆదామాషాలో లేదు. ఇది గమనించాల్సినవిషయం. హైదరాబాదు సంస్థానమే అసలు భూస్వాములుదోపి

డీకి పెట్టింది వేసు. అందులో హూ జాగీరు, సర్ఫ్‌ఖాస్‌పాంతంలో ప్రజలు మరీ ప్రత్యేకంగా దోపిడీకి గురిఅయి వుండడం వలననే అచ్చటిజనాభా ఆ దోపిడీకి తట్టుకోలేక పొట్ట చేతపట్టుకొని రాష్ట్రాంతరాలు వలసపోతున్నారు. అందుచేతనే ఆ ప్రాంతాల విస్తీర్ణానికి తగినవిధంగా జనాభా పెంపొందలేదు.

సంస్థానంలో మొత్తంగ్రామాలసంఖ్య 22 457. ఇందులో దివానీ లేక ఖాల్సాగ్రామాలు 13,961. అంటే సంస్థానం మొత్తంగ్రామాలలో నూటికి 62 వంతు లున్నవన్నమాట. జాగీరు గ్రామాలు 6535. అంటే మొత్తం గ్రామాలలో నూటికి 29 వంతులు. సర్ఫ్‌ఖాస్ గ్రామాలసంఖ్య 1961. అంటే నూటికి 9 వంతులు. (9%).

తెలంగాణాలో మొత్తం గ్రామాలసంఖ్య 10,167. ఇందులో దివానీప్రాంతంలోని గ్రామాలు 6891. అంటే మొత్తం తెలంగాణాగ్రామాలలో నూటికి 66 వంతులు ఖాల్సాగ్రామాలు అన్నమాట. జాగీరు, సర్ఫ్‌ఖాస్‌గ్రామాలు మొత్తం 3276. అంటే నూటికి 32 వంతులన్నమాట.

మరాట్వాడా, కన్నడప్రాంతాలలో మొత్తం గ్రామాల సంఖ్య 12,290. ఈ ప్రాంతాలలో మొత్తం ఖాల్సాగ్రామాలు 7070. అంటే నూటికి 57 వంతులు అన్నమాట. అంటే తెలంగాణా ప్రాంతంకన్నా ఖాల్సాగ్రామాలు తక్కువ అన్నమాట. జాగీరు, సర్ఫ్‌ఖాస్ గ్రామాలసంఖ్య ఎక్కువ అన్నమాట.

తెలంగాణాలో జిల్లాలవారిగా యీ మూడుప్రాంతాల లెఖ్ఖలు ఈ క్రింద యివ్వబడుతున్నాయి:—

| జిల్లా పేరు | దివానీ లేక ఖాల్సా గ్రామాల మొత్తం. | జాగీరు గ్రామాలు. | సర్ఫేఖాస్ గ్రామాలు | జిల్లాలోని లేక ప్రాంతంలోని గ్రామాల సంఖ్య. |
|---|---|---|---|---|
| వరంగల్ | 1117 | 291 | 4 | 1412 |
| నల్లగొండ | 1002 | 239 | 15 | 1256 |
| కరీంనగరు | 978 | 224 | 25 | 1227 |
| మెదక్ | 551 | 364 | 13 | 928 |
| మహబూబ్ నగర్ | 698 | 718 | 15 | 1431 |
| హైదరాబాదు | 83 | 303 | 573 | 959 |
| నిజామాబాదు | 521 | 229 | 1 | 751 |
| ఆదిలాబాదు | 1881 | 262 | — | 2143 |
| మొత్తం తెలంగాణా | 6891 (49½%) | 2630 (40%) | 646 (36%) | 10167 (44½%) |
| మరాట్వాడా | 4892 (35 1/2%) | 1435 (22%) | 713 (35%) | 7040 (31 1/2%) |
| కన్నడప్రాంతం | 2178 (15%) | 2470 (38%) | 602 (29%) | 5250 (24%) |
| మొత్తం సంస్థానం | 13,961 (62%) | 6535 (29%) | 1961 (9%) | 22457 (100) |

పైన తెల్పిన పట్టికనుబట్టి తేలేదేమిటి? సంస్థాన మొత్తం గ్రామాలలో దివానీగ్రామాలు నూటికి 62 వంతులు. యీ దివానీగ్రామాలలో దాదాపు సగభాగం అంటే నూటికి 49½

వంతులు తెలంగాణాజిల్లాలలో వున్నాయి. అంటే దివానీ ప్రాంతం తెలంగాణాలో సగం, మరాట్వాడా, కన్నడప్రాంతా లలో సగం వుందన్నమాట. కాని జాగీరు, సర్ఫేఖాస్ గ్రామాల విషయంమాత్రం అలా లేదు. మొత్తం సంస్థాన గ్రామాలలో జాగీరుగ్రామాలు నూటికి 29 వంతులున్నాయి. అయితే సంస్థా నంలో సగభాగంగావున్న తెలంగాణాలో జాగీరు మొత్తంగ్రా మాలలో నూటికి 50 వంతులుమాత్రం లేవు. నూటికి 40 వంతులు మాత్రమే వున్నాయి. తతిమ్మా 60 వంతులు గ్రామాలు మరా ట్వాడా, కన్నడప్రాంతాలలో వున్నాయి. అంటే మరాట్వాడా, కన్నడప్రాంతాలలో తెలంగాణాకంటే జాగీరుప్రాంతం అధికంగా వుందన్నమాట. అంటే నూటికి 20 వంతులు అధికంగా వుందన్న మాట. అదేవిధంగా సర్ఫేఖాస్ ప్రాంతంగూడ. మొత్తం సంస్థా నంలోవున్న సర్ఫేఖాస్ గ్రామాలలో నూటికి 36 వంతులుమా త్రమే తెలంగాణాలో వున్నాయి. తతిమా 64 వంతులు మరా ట్వాడా, కన్నడప్రాంతాలలో వున్నాయి. ఈ లెక్కలనుబట్టి తేలేదేమంటే మరాట్వాడా, కన్నడప్రాంతాలలో తెలంగాణా ప్రాంతంలోకంటే ఫ్యూడలు భూస్వామ్యపద్ధతి బలహీనంగా వుందనడం తప్పువాదన అవుతుంది. అచ్చటగూడ ఫ్యూడలు భూసంబంధాలు బలంగానే వున్నాయి. అయితే దీనిఅర్థం తెలం గాణాలో ఫ్యూడలు దోపిడీసంబంధాలు బలహీనంగా వున్నా యని ఏమాత్రంకాదు.

పోలీసు చర్యానంతరం పైనతెల్పిన మూడురకాలప్రాం తాలు ఒకేరకం ప్రాంతంక్రిందకు అంటే దివానీప్రాంతం క్రిందకు

మార్చబడ్డాయి. జాగీరు, సర్ఫేఖాస్ ప్రాంతాలు ఖాల్సాప్రాంతంలో లీనం చేయబడ్డాయి. 1949 మార్చి నెలలో సర్ఫేఖాస్ ప్రాంతం రద్దుగావించబడి దివానీప్రాంతంలో లీనంచేయబడింది. అదేవిధంగా 1949 సెప్టెంబరుమాసంలో జాగీరుప్రాంతమంతా రద్దుచేయబడి దివానీప్రాంతంగా మార్చబడింది. ఈ మార్పుల ఫలితంగా నేడు సంస్థానంఅంతటా ఒకేరకమైన పద్ధతి అనగా రైతువారీపద్ధతి అమలులో వుంది.

అయితే జాగీర్లు, సర్ఫేఖాస్ప్రాంతాలు రద్దుచేయబడి ఖాల్సాప్రాంతంలో లీనంచేసినప్పటికీ వెనుకటి పరిపాలనా ఫలితంగా రైతులు తమహక్కులను కోల్పోవడం జరిగింది. ముఖ్యముగా జాగీరుభూములను రైతాంగానికి దక్కనీయకుండా జాగీరుదారీవర్గం విశ్వప్రయత్నం చేసింది. ఇప్పుడుగూడ యింకా ప్రయత్నిస్తోంది. 1356 వ ఫసలీ (1946 సం.) లో జారీచేయబడిన జాగీరుదారీ ప్రాంతాలలోని పట్టాదారు హక్కులగూర్చిన ప్రభుత్వ నియమాలు, ఉత్తర్వులు ఆచరణలో బుట్టదాఖలు చేయడంగాని లేక నామమాత్రంగా అమలుజరపడంగాని జరిగింది. కాంగ్రెసుప్రభుత్వం వచ్చాకగూడ జాగీరురైతుల హక్కులగూర్చి శ్రద్ధ తీసుకోలేదు.

## —♦ సంస్థానంలో వివిధరకాల భూసంబంధాలు — భూమిపైఉన్న యాజమాన్యపు హక్కులు. ♦—

సర్ఫేఖాస్, జాగీరుప్రాంతాలను ఖాల్సాప్రాంతాలలో కలిపివేయకముందు సంస్థానం భూసంబంధాలరీత్యా మూడు

ప్రధానభాగాలుగా విభజింపబడి వుండేది. అవేమంటే:—
(1) ఖాల్సా లేక దివానీప్రాంతం. యూనియన్ ఆంధ్రజిల్లాలలో రైతువారీప్రాంతాన్ని యిది పోలివుంటుంది. ఖాల్సా ప్రాంతంలో యితర పరిపాలనతోపాటు శిస్తువసూలుకూడ సంస్థాన ప్రభుత్వోద్యోగులే నేరుగా చేస్తూవుంటారు.

(2) సర్ఫేఖాస్‌ప్రాంతం:— ఇది నైజాంనవాబు స్వంతఖర్చులకై ప్రత్యేకించబడినభాగం. పూర్వం నైజాంప్రభువుల స్వంతఖర్చులు ప్రభుత్వ ఖజానానుండే తీసుకోబడుతుండేవి. కాని నవాబు నాసిరుద్దౌలా బహద్దూర్ కాలంలో సర్ఫేఖాస్ పద్ధతి ప్రవేశపెట్టబడింది.

సర్ఫేఖాస్ ప్రాంతం దాదాపు 8000 చదరపుమైళ్ళ వైశాల్యం కల్గిన 18 తాలూకాలతో కూడివుండేది. 7 తాలూకాలు గల అత్రాఫ్‌బల్దా (నేటి హైదరాబాదు జిల్లా) అంతా సంస్థాన ప్రభుత్వంతో సంబంధం లేకుండా నేరుగా నైజాం నవాబుక్రింద సర్ఫేఖాస్ యిలాకా తాలూకాదారు చేత పాలింపబడుతూవుండేది. మిగతా 11తాలూకాలు ఆయాజిల్లల మాల్గుజారీ శాఖ (రెవెన్యూశాఖ ద్వారా) పరిపాలింపబడుతూ వుండేది. పరిపాలనాఖర్చులు పోను మిగతా సొమ్ము సర్ఫేఖాస్ ఇలాకాకు జమకట్టబడు తుండేది.

సర్ఫేఖాస్‌మీద వచ్చే ఆదాయంగాక ప్రభుత్వ ఖజానానుండి సాలీనా 50 లక్షల రూపాయలు నైజాంనవాబుకు భరణ మివ్వబడుతూవుండేది.

సర్ఫేఖాస్ ప్రాంతం నైజాంనవాబు స్వంతభూములు లక్షలాది యెకరాలు వుండేవి. ఈ భూములను సాగుకావించే రైతులు దాదాపు మధ్యకాలపునాటి దాసులస్థితిలో (సెర్ఫ్స్) వుండేవారు. ఏ భూమిహక్కులు లేకుండా దారుణదోపిడీకి గురిఅయి వుండేవారు. సర్ఫేఖాస్ ప్రాంతాన్ని ఖాల్సాప్రాంతంలో కలిపి వేసేవరకు ఈ రైతులకు ఖాల్సాప్రాంతంలో ఇవ్వబడిన స్వల్ప హక్కులుగూడ లేకుండెను. నైజాంనవాబు స్వంతభూములలో తప్ప తతిమ్మాప్రాంతంలో, ఖాల్సాప్రాంతంలోవుండే భూమి శిస్తువిధానమే అమలులో వుండేది.

సంస్థానంలోకి యూనియన్ సైన్యాలు వచ్చాక సర్ఫేఖాస్ ప్రాంతాన్ని ఖాల్సాప్రాంతంలో కలిపివేస్తూ 1358 వ ఫసలీ అమరదాద్ 20 వ తేదీన (1948 సం. జూన్ 20 వ తేదీన) ప్రభుత్వం గెజిట్ ప్రకటన గావించింది. అప్పటినుండి సర్ఫేఖాస్ ప్రాంతాన్ని నైజాంనవాబు స్వంతపరిపాలనక్రింద నుండి తీసివేయడం జరిగింది. ఇందుకుగాను నైజాంనవాబుకు కాంగ్రెసుప్రభుత్వం నష్టపరిహారంక్రింద ప్రతిఏటా దాదాపు కోటిరూపాయలు ప్రజలధనాన్ని ముట్టచెప్తున్నది.

ఇప్పుడు సర్ఫేఖాస్ ప్రాంతం అనేది ప్రత్యేకంగాలేదు. పూర్వం సర్ఫేఖాస్ ప్రాంతానికిచెందిన 18 తాలూకాలను ఆయా జిల్లాలోని ఖాల్సాప్రాంతంలో కలిపివేయడం జరిగింది. ఖాల్సా ప్రాంతంలోని అన్నిచట్టాలు నేడు సర్ఫేఖాస్ ప్రాంతంగా పరిగణింపబడుతూవచ్చిన 18 తాలూకాలకు వర్తింపచుతాయి.

(3) మిగతాభూములు:— ఈ ప్రాంతంలో జాగీరులు, పాయగాలు, మక్తాలు, చిన్నసంస్థానాలు యినాములు, అగ్రహారాలు మున్నగు ఫ్యూడలు, అర్ధఫ్యూడలు వ్యవస్థలతో కూడుకొనివున్న ప్రాంతాలుండేవి. సంస్థానం మొత్తంమీద ఇవి 1167 వరకూ వుండేవి. వీనిలో శిస్తువసూలు ఖాల్సాప్రాంతాలలోమాదిరిగా ప్రభుత్వోద్యోగులు నేరుగా శిస్తు వసూలు చేయడమనేది వుండేదిగాదు. జాగీరుదార్లు, పాయిగాదార్లు, సంస్థానాధీశులు, మక్తేదార్లు మొదలైనవారికింద ప్రత్యేక రెవెన్యూ ఉద్యోగులు శిస్తు వసూలుగావించేవారు. వీరిలో కొందరు సంస్థాన ప్రభుత్వానికి పన్ను (పేష్కస్ లాంటిది) చెల్లించేవారు; కొందరు ఏమీ చెల్లించేవారుకారు.

ఈ ప్రాంతాలలో పరిస్థితులు చాల దారుణంగావుండేవి. అనేక అక్రమపన్నులు వసూలుచేయడం, నిర్బంధ వెట్టిచాకిరీలు చేయించడం నిత్యకృత్యంగా వుండేవి. ఇటీవల వెట్టిచాకిరీచేయించడం, అక్రమపన్ను వసూళ్లు గావించడం నిషేధిస్తూ సంస్థానంలో చట్టం గావించేవరకూ ఇవి యధేచ్ఛగా సాగుతూనే వుండెను. ప్రభుత్వంగావించిన చట్టాలు చాల జాగీర్లలోనూ, సంస్థానంలోనూ యిటీవలవరకూ అమలుజరుగలేదు. యూనియన్ ప్రాంతానికి, ఫ్యూడలు సంస్థానాలకు యెంత తేడావుంటుందో ఖాల్సాలకు, ఈ ప్రాంతాలకు అంత తేడా వుండెడిది. కొన్ని జాగీర్లకు, పాయెగాలకు ప్రత్యేక కోర్టులు, పోలీసుసిబ్బంది, జైళ్ళుగూడ వుండెడివంటే ఇక ప్రజలస్థితి ఎంత అధ్వాన్నంగా వుండెనో చెప్పడానికి వీలులేదు. భూస్వామ్య హక్కుల

గూర్చి యిటీవలవరకూ ఈ ప్రాంతాలలో దాదాపు యేహ
కుర్లులు లేవనే చెప్పాలి. దాదాపు రైతులందరూ కౌలుదా
ర్లుగా పరిగ్గిసగూ పడివు చేవారు. ఈ ప్రాంతంలో ముఖ్యమైన
వాటిగూర్చి ప్రస్తుతంగా తెల్సుకుందాం.

(అ) 'పాయెగాలు: — పూర్వం నిజాం ప్రభుత్వమునకు యుద్ధములందు సహాయముచేయుటకై కొంతసైన్యమును ఎల్లప్పుడూ సిద్ధంగా వుంచుటకు కొందరేర్పాటు చేయబడిరి ఆవిధంగా ఏర్పాటుచేయబడిన ప్రతివాడూ, తాను సిద్ధంచేసే సైన్యఖర్చులంతా తానేభరించుకోవాలి. ఇందుకోసం వాళ్లకు నైజాంప్రభువు కొన్నిజాగీరులు ఉచితంగా యిచ్చివేశాడు. అట్టి జాగీర్లనే పాయెగాలందురు. ఈ సంస్థానంలోని పాయెగాలు యితరసంస్థానాలలోని వాటికంటె పెద్దవి. ఈ పాయెగాలను మహమ్మదీయులకే ఇవ్వబడెను. హిందువులకు ఇవ్వబడలేదు. వీటిలోగూడ నవాబుగారి బంధువర్గాకు చెందినవారికే యివ్వబడెను.

(ఆ) "జాగీరులు:- పూర్వం ప్రభుభక్తి చూపినందున లేక గొప్ప ఉద్యోగములు చేసినందున, లేక యుద్ధములో ప్రాణాలిచ్చి ప్రభుభక్తితో పోరాడినందున లేక మతవిషయాలలో గురువులు అయినందున హిందూరాజులు ఆతర్వాత మహమ్మదీయ ప్రభువులు అనేకులకు జాగీరులను యిచ్చియున్నారు. అట్టివానిలో పెద్దపెద్దవాటిని సంస్థానములనియు చిన్నవాటిని జాగీరులు అనియు చెప్పుదురు.

"జాగీరులవంటివే ప్రభువులచేత యివ్వబడిన ఈనా ములలో అనేక తేడాలుకలవు. మఖ్తాలని, యీనాములనీ అగ్రహారాలనీ వివిధరకాలుగా వుండెను.

(ఇ) "మఖ్తాలు, బంజర్లు:- అడవిప్రాంతంలో భూమిని బాగుచేయించి, గ్రామాలు ఏర్పర్చి, భూమినిసాగులోనికి తెచ్చినందుకు ఆ గ్రామాలు ప్రభుత్వం అలా కృషిచేసినవారికి యిచ్చింది. వీనినే మఖ్తాలంటారు. వీనిలో అనేక బేధా లున్నాయి.

(ఈ, 'అగ్రహారాలు:- హిందూరాజులు, జాగీరు దార్లు తమ గురువులైన బ్రాహ్మణులకు యిచ్చినగ్రామాలనే అగ్రహారాలు అందురు.

(ఉ) 'మాఖుదార్లు:- వీరినే దేశముఖు, దేశపాండ్యా లందురు ఇప్పుడు జీతాలు తీసుకొంటున్న ప్రభుత్వోద్యోగులు పన్ను వసూలుచేస్తున్నారు. పూర్వం అలాగాక దేశపాండ్యాలు దేశముఖులు పన్నులు వసూలుజేసి అందులో కొంతభాగాన్ని మాత్రం ప్రభుత్వానికి చెల్లించుతూ వుండేవారు. తతిమ్మా భాగాన్ని తామేవుంచుకొనేవారు. మొదటి సాలారుజంగు కాలంలో యీ పద్ధతి (దేశముఖు, దేశపాండ్యాలు పన్నువసూలు చేసేపద్ధతి) రద్దుచేయబడి ప్రస్తుతం అమలులోవున్న శిస్తు వసూలుపద్ధతి ప్రవేశపెట్టబడింది. పన్నులో 100 కి కొంత వేరు జేసి దానిలోనుండి వారివారి హోదాల ననుసరించి డబ్బు యివ్వబడుతోంది. వీనినే రుసుములు అంటారు. దేశముఖులలో కూడ చాలమంది పేదవారు వున్నారు. వీరు రైతులవలె జీవితం

సాగిస్తూవుండేవారు. దేశముఖు, దేశపాండ్యాలలో కొందరు వేల యకరాల స్వంతభూమి కలవారున్నారు. వాళ్లు పన్ను వసూలు జేసేరోజుల్లో సారవంతమైన భూమిని అనేక మాయోపాయాలు దౌర్జన్యాలద్వారా ఆక్రమించుకున్నారు. పన్ను వసూలు గావించేహక్కు పోగొట్టుకున్నా గ్రామాల్లో యిలాంటి దేశ ముఖుల పెత్తనం చాలాచోట్ల అలాగేవుంది. ఇప్పుడు వీరితో పాటు కొంతమంది వతనదారులుగూడ చాల భూములు సంపాదించి యిట్టి దోపిడీ పద్ధతులను అవలంభించుతున్నారు. వీరంతా గ్రామ ప్రజలను అనేకవిధాల పీడించుకు తింటారు. వీరు గ్రామాలలో ప్రస్తుతం అభివృద్ధికి పెద్ద ఆటంకం.

('నేటి హైదరాబాద్ — మనకర్తవ్యం' అన్న గ్రంథంనుండి)

పైన తెల్పిన దోపిడీ సంస్థలలో జాగీరులను, పాయెగాలను, మక్తాలను, రద్దుగావిస్తూ హైదరాబాదు ప్రభుత్వం 1948లో ఒక ఉత్తర్వు గావించింది. దానిప్రకారం నేడు ఆ ప్రాంతాలు ప్రత్యేకంగా లేవు. ఖాల్సాప్రాంతంలో కలిపివేయబడె వాటికి జాగీరు అడ్మినిస్ట్రేటర్లు అన్న ప్రత్యేక ప్రభుత్వోద్యోగుల ద్వారా పరిపాలించబడుతున్నాయి. మరికొన్ని పూర్తిగా జిల్లా రెవెన్యూ పరిపాలనక్రిందకు తేబడ్డాయి. ఖాల్సాప్రాంతాలల్లో వున్న అన్ని భూమిచట్టాలు, శిస్తువసూలు పద్ధతి యీ ప్రాంతాలకు నేడు వర్తించుతాయి.

ఈ ప్రాంతాలను ప్రత్యేకంగా తీసుకుని వాటిల్లో యింతవరకూ అమలు జరుపుతుంటూ వచ్చిన భూమిచట్టాలు

గూర్చి; తత్ఫలితంగా ఏర్పడిన భూమి సంబంధాల గూర్చి క్లుప్తంగా తెలుసుకుందాం.

## ఖాల్సాప్రాంతంలోని భూమిచట్టాలు.

(అ) 1317వ ఫసలి ల్యాండు రెవెన్యూచట్టానికి పూర్వ మున్న పరిస్థితి:-

పన్నుల విధానాన్ని భూ సంబంధాలను ఒక క్రమపద్ధతి లోకి తీసుకురావడానికి ప్రథమపర్యాయంగా హైదారాబాదు సంస్థానంలో 1317వ ఫసలీలో ఒకచట్టాన్నిగావించారు. దాని పేరు 1317వ ఫసలీ హైదరాబాదు ల్యాండు రెవెన్యూచట్టం. ఈ చట్టానికి పూర్వం వాస్తవంగా సాగుచేసేవారికి ఎట్టి హక్కులు లేకపోవుటే గాకుండా (పైన తెల్పినల్యాండు చట్టం ప్రకారంగూడ దున్నేవానికే హక్కులు రాలేదు.) భూఖామందుల హక్కుల నిర్వచనంగూడ లేదు. మొత్తం రైతాంగం అంతా ఎట్టిహక్కులులేకుండా వుండి పోయింది.

నైజాం ప్రభుత్వానికి వ్యవసాయం చేసేవారికి మధ్య అనేకరకాల పన్నువసూలు దార్లు వుండేవారు. వీళ్లు నైజాం ప్రభువు భూమికి సర్వాధికారులుగా వుండేవారు. శిస్తువసూలు హక్కును ప్రభుత్వం ఏటేటగాని లేక కొన్ని సంవత్సరాల కొక పర్యాయంగాని హరాజు (వేలం) పెట్టడమో లేక కొంత మందికి ప్రత్యేకించి యిస్తూవుండడమో జరుగుతూవుండేది. ఈ పన్ను వసూలుదారులు రైతులనుండి వసూలు చేయాల్సిన

పన్ను మొత్తాన్ని నిర్ణయించేందుకు సదర్ నాయబ్బు మరియు నాయబ్బు అన్నవారిని నియమిస్తూ వుండేవారు. వీళ్లు ఒకొక పరగణా తీసుకుని పరగణా మొత్తంమీద రైతులు చెల్లించాల్సిన శిస్తు మొత్తాన్ని నిర్ణయించేవారు. ఆ మొత్తాన్ని బట్టి ప్రతిగ్రామమూ ఎంతెంతశిస్తు చెల్లించాల్సింది కూడ నిర్ణయింపబడేది. ఆ మొత్తాన్ని తిరిగి గ్రామపటేలు, పట్వారీలు సాగుదారులపై వ్యక్తిగతంగా విభజించేవారు. ఈ విభజన గ్రామసంపన్నులైన పటేలు పట్వారీల చిత్తంప్రకారం జరిగేది గాబట్టి ఎప్పుడూ సంపన్నులకు, సంఘంలో పలుకుబడిగలవాళ్లకు లాభదాయకంగాను, పేదలకు నోరులేనివాళ్లకు, ఎక్కువభారంగానూ బాధాకరంగానూ వుండేది. అంతేగాకుండా ప్రభుత్వంచే నియమింపబడిన పన్ను వసూలుదార్లు తమ జేబులు నింపుకోడానికి తరుచు వసూలు చేయాల్సిన శిస్తుమొత్తాన్ని తమయిష్టం వచ్చినట్లు పెంచుతూ వుండేవారు. అందుచేత సాగుదారులు తమ సాగుభూములను కోల్పోవడం ఎక్కువగా జరుగుతూ వుండేది.

ప్రభుత్వంతరఫున శిస్తువసూలుదార్లుగా వ్యవహరిస్తున్న ప్రాంతంలోనే యీ విధంగా జరుగుతూవుంటే భూమిపై సర్వాధికారాలు కల్గిన జాగీరుదార్లు, ఈనాందార్లు, మక్తాదార్లు, మున్నగు ఫ్యూడలు భూస్వాముల అధీనంలోవున్న ప్రాంతాలలో భూమిదారులకు భూమిపైగల హక్కు, భుక్తాలు యెంత సూక్ష్మమో వేరే చెప్పనవసరంలేదు. దీర్ఘకాలం అనిశ్చిత

కౌలుదార్లకో లేక నామకః క్విట్ రెంటు మీదనో, ప్రభుత్వంవద్ద విశాలమైన భూఖండాలను కౌలుకుతీసుకున్న ఇజారాదార్లు, బంజరుదార్లు, మక్తాదార్లు అధీనంకిందవున్న భూఖామందులు గూడ పైన తెల్పిన జాగీర్లు వగైరా ఫ్యూడలు ప్రాంతాలలో వలెనే ఎట్టిహక్కులు లేకుండా పడివుండేవారు. 1317 వ ఫసలీ (1907 సం.) ల్యాండు ఆక్టు అమలులోకి వచ్చాకగూడ చాల కాలంవరకూ పైనతెల్పిన రెండుప్రాంతాల భూఖామందులు ఎట్టిహక్కులు లేకుండా పడివున్నారు.

(ఆ) '1317 వ ఫసలీ ల్యాండు రెవెన్యూచట్టం'-భూఖామందులకు సంబంధించినంతవరకు దానిలోని ముఖ్యాంశాలు:—

1317 వ ఫసలీ (1907 సం.)లో 'హైదరాబాదు ల్యాండు రెవెన్యూచట్టం' అనబడే శాసనం గావించబడింది. 1879 లో బొంబాయిరాష్ట్రంలో ఏర్పర్చబడిన "ల్యాండు రెవెన్యూకోడ్" ను దాదాపు యిది పోలివుంది. ఈచట్టం తిరిగి సవరింపబడుతూ గూడ వచ్చింది. ఇలాసవరింపబడిన ఈ చట్టంప్రకారం "భూఖామందు" అంటే ఎవరో, "పట్టాదారు" అంటే ఎవరో, "కౌలుదారు" అంటే ఎవరో మున్నగు భూసంబంధాలగూర్చి నిర్దిష్టమైన నిర్వచనాలు ప్రధమపర్యాయంగా చేయబడ్డాయి. యావత్తు సాగుభూమిన్ని సాగులాయకుభూమిని అప్పటి బ్రిటిష్ ఇండియా ప్రాంతంలోవుండే 'సర్వే సెటిల్‌మెంటు' (బందోబస్తు) నియమాల నాధారంగాగొని బందోబస్తుచేయించి భూమి తరముల ప్రకారం శిస్తు నిర్ణయంచేయడానికీ, భూఖామందలకు భూము

ఉన్నవాండే హక్కులను నిర్ణయిస్తూ పట్టాలివ్వడం మున్నగు చర్యలు ఈచట్టంద్వారా తీసుకోబడ్డాయి. వీటినిగూర్చి క్లుప్తంగా విచారిద్దాం.

ముందు భూఖామందుల (ల్యాండుహోల్డర్సు) హక్కులగూర్చి పరిశీలిద్దాం

1317 వ ఫసలీ (1907 సం.) ల్యాండు రెవెన్యూచట్టం రెండవ సెక్షన్‌లో భూఖామందు అంటే యీ క్రింది నిర్వచనం చేయబడింది:—

" 'భూమిని కలిగిఉండడం' అంటేగాని లేక 'భూఖామందుగా వుండడం' (ల్యాండుహోల్డర్సుగా వుండడం) అంటేగాని అర్థం ఏమంటే, ఆ భూమిని తన స్వంతకబ్జా ద్వారాగాని లేక అట్టికబ్జా లేకుండాగాని న్యాయరీత్యా తనస్వాధీనంలో వుంచుకోవడం అని అర్థం". (సబ్ సెక్షన్ 6.)

పట్టేదారు అంటే నిర్వచిస్తూ అదేచట్టంలో ఈ క్రింది విధంగా వ్రాయబడింది:—

"తన స్వంతకబ్జాద్వారాగాని, లేక తన 'సిక్మీదారు' ద్వారాగాని భూమిస్వాధీనం కల్గియుండి అట్టిభూమికి తానే నేరుగా ప్రభుత్వానికి శిస్తుచెల్లించుతూ అలా ప్రభుత్వ రికార్డులలో తనపేరు నమోదుఅయివున్న వ్యక్తి పట్టాదారుగా పరిగణింపబడుతాడు." (సెక్షను 2. సబ్ సెక్షను 11.)

పైనతెల్పిన నిర్వచనాలబట్టి భూఖామందు ఎవరో తేలిపోయింది. ప్రభుత్వానికి శిస్తు తానే స్వయంగాచెల్లిస్తూ తానే స్వయంగాగాని లేక యితరులకు కౌలుకుగాని, పాలుకుగానిఇచ్చి

మరేరకంగానైనా తన స్వాధీనంలోవున్న భూమిని సాగుచేయి
స్తూవుండేవారు. భూఖామందులుగా 1317 ఫసలీ (1907 సం.)
ల్యాండు రెవెన్యూచట్టంప్రకారం పరిగణింపబడ్డారు. అంటే
చట్టం అమలునాటికి ప్రభుత్వానికి నేరుగా శిస్తు చెల్లించుతూ
వుండేవారంతా భూఖామందులుగా గుర్తింపబడ్డారు. వారినే
పట్టాదారులుగా ప్రభుత్వం గుర్తించింది.

ల్యాండురెవెన్యూ చట్టంవలనహక్కు వాస్తవంగా భూమి
దున్నేవానికి రాలేదు. ప్రభుత్వానికి నేరుగా పన్నుచెల్లించేవా
ళ్ళనుమాత్రమే పట్టాదార్లుగా గుర్తించుటవలన అలాంటిరకానికి
చెందిన రైతులు చట్టానికిపూర్వం చాల స్వల్పంగా మాత్రమే
వుండిపోయారు. ప్రభుత్వానికి, రైతులకుమధ్య ఏర్పర్చబడిన
పన్నువసూలుదార్లు, ఈనాందార్లు, మక్తాదార్లు ఇజారాదార్లు,
జాగీరుదార్లు మున్నగు దళారులు ప్రభుత్వానికి నేరుగా శిస్తు
చెల్లిస్తూ విశాలమైన భూఖండాలను. పరగణాలకు పరగణాలనే
చట్టానికిపూర్వంనుంచీ తమ అధీనంలో వుంచుకోవడం జరిగింది.
అందుచేత సాగుభూమిలో అత్యధికభాగాన్ని పై దళారులు
ల్యాండు రెవెన్యూచట్టాన్ని ఆధారంగాగొని స్వంతభూములుగా
పట్టా చేయించుకోగల్గారు. ప్రభుత్వంకు నేరుగా శిస్తుచెల్లిస్తున్న
భూఖామందులు కొలదిమందిమాత్రం తమ కబ్జాలోవున్న భూము
లకు పట్టాలు సంపాదించుకున్నారు. చట్టానికిపూర్వం పన్ను
వసూలుదారులుగా వున్నవారిలో కొందరు చట్టంతర్వాత కూడ
పన్ను వసూలుదారులుగా వుండకుండా మానుకోవడం జరిగింది.
అలాంటివారికి (వారే దేశముఖులు, దేశపాండ్యాలు వగైరా)

పన్ను వసూలుహక్కును వదులుకొన్నందుకు ప్రభుత్వం రుసు ములు, పెన్షన్లు చెల్లించే ఏర్పాటు చేసుకొని వారి అధీనంలో వున్న భూములను వసూలుదార్ల పట్టాపై వుంచుకొన్నవాటిని మినహాయించి తతిమ్మా భూములను కబ్జాదార్లకు పట్టాలపై ఇచ్చింది. ఆవిధంగా కొలదిమందికి పట్టాలు లభించాయితప్ప అశేష రైతాంగానికి భూమిహక్కులు లభించలేదు. వాళ్లంతా ఉత్త కబ్జాదారులుగానో లేక ఏహక్కులులేని కౌలుదారుగానో వుండిపోయారు. ఈ కౌలుదార్లను ఆసామీ సిక్మీదారులని పిలిచారు.

1317 ఫసలీ 1907సం॥ ల్యాండు రెవెన్యూ చట్టంప్రకారం భూమి హక్కులగూర్చి ప్రధానమైన అంశాలు యివి:-

(1) పట్టాదారు:- ప్రభుత్వానికి నేరుగా శిస్తు చెల్లిస్తూ స్వయంగాగాని లేక సిక్మీదారు ద్వారాగాని లేక ఆసామీ సిక్మీదారు ద్వారాగాని తన స్వాధీనంలో వున్న భూమిని సాగు చేయించేవారు పట్టాదార్లుగా గుర్తింపబడుతారు. ఇలాంటి వారికి వారి స్వాధీనంలోవున్న భూములను బందోబస్తుచేసి పన్ను విధించి వాటికి పట్టా యివ్వబడుతుంది. ప్రభుత్వం విధించిన శిస్తు చెల్లిస్తూ వున్నంతవరకు పట్టాదారును భూమి నుండి తొలగించడానికి ప్రభుత్వానికి అధికారంలేదు. భూమిపై దానా, దమన విక్రయాది వంశపారంపర్య హక్కులు పట్టాదార్లకు యివ్వబడ్డాయి. తమభూమిలో తామిష్టప్రకారం పట్టాదార్లు పైరుపంటలు వేసుకోవచ్చు.

(2) పోటు పట్టేదార్లు:- ఇద్దరుగాని అంతకన్నా ఎక్కువ మంది భాగస్వాములు జమగుంటుగా పట్టాభూమి కల్గివుంటే వారిని పోటు పట్టాదారులంటారు. ఈ భాగస్వాములలో ఎవరి పేరునో ఒకరిపేర పట్టానమోదు అయివుంటుంది. తతిమ్మా భాగస్వాములను పోటుపట్టాదార్లంటారు. వీరు తమ వాటా క్రింద వున్న భూమి విస్తీర్ణానికి ప్రభుత్వానికి శిస్తు చెల్లిస్తూ వుంటారు. పట్టాదారు పోటు పట్టాదార్లనుండి అధికశిస్తు డిమాండు చేయడంగాని లేక భూమినుండి తొలగించడంగాని చేయరాదు. పట్టాదారుకుండే సర్వహక్కులూ పోటుపట్టాదారుల కుంటాయి.

(3) శిక్మీదారులు:- వీరు రెండురకాలుగా వుండవచ్చు మొదటిరకం తమ కబ్జాలోని భూమిసాగు ప్రారంభంనుండిగాని లేక ఆ భూమిపేర పట్టా పుట్టినప్పటినుండిగాని పట్టాదారుతో పోత్తుకలిపి భూమిని సాగిచేస్తూ భూమిపై కబ్జాకలిగి వున్నవారు యీ రకంక్రిందకొస్తారు. పట్టాదారువలెనే భూమిపై స్వాధీనపు హక్కు కల్గివున్న వ్యక్తిగాని లేక ప్రారంభంనుండే పట్టాదారుతో కలిసి కబ్జా కల్గియుండిన వ్యక్తిగాని లేక చట్టానికి పూర్వం అమలునందున్న ఏ చట్టం ప్రకారమైనా సిక్మీదారుగా హక్కుపొందివున్న వారుగాని లేక యీ చట్టం ఏర్పాట్లు ద్వారా అలాంటి హక్కు పొందేవ్యక్తినిగాని సిక్మీదారు అవుతారు అని ల్యాండు రెవెన్యూ చట్టం రెండవ సెక్షనులో 12వ సబ్ సెక్షనులో నిర్వచింపబడివుంది.

ఇక రెండోరకం సిక్మీదారు ఎవరుఅంటే చట్టానికి పూర్వం వరుసగా 12 సంవత్సరాల కాలం కబ్జా కల్గిన ఏ ఆసామీ సిక్మీ అయినా యీ చట్టంక్రింద సిక్మీదారుగా గుర్తించబడుతాడు. ఈ విషయాన్ని గూర్చి చట్టంలో యీ క్రిందివిధంగా చెప్పబడింది:-

ఆసామీ సిక్మీదారు ఎవరైనా 12 సంవత్సరాలు విడవకుండా వరసగా ఏ పట్టా భూమినైనా కబ్జా కలిగి వున్నట్లయిన ఆ భూమికి సంబంధించినంతవరకూ అతను సిక్మీదారుగా పరిగణింపబడాలి. ఆభూమికి పట్టాకల్గిన పట్టాదారు క్రింద శాశ్వత కబ్జా హక్కును కల్గివుంటాడు అయితే పట్టాదారు, ఆసామీ సిక్మీకిమధ్య కౌలుకాలాన్నిగూర్చి వ్రాతపూర్వకంగా గాని లేక నోటిమాటద్వారాగాని ఏదైనా ఒప్పందం జరిగివుండక పోతేనే పైన తెల్పిన హక్కును ఆసామి సిక్మీదారు పొందగల్గుతాడు (సెక్షను 67) అదే సెక్షనులో వరసగా కబ్జా కల్గివుండడం అన్న హంశాన్ని వివరిస్తూ యీ క్రిందివిధంగా చెప్పబడింది.

"ఆసామీ సిక్మీగనుక పైనతెల్పిన 12 ఏండ్ల కౌలుకాలంలో ఒక సంవత్సరానికిమ్మించి కబ్జాలో లేకుండా వున్నట్లయిన అట్టికబ్జాను వరసగా, విడవకుండావున్న కబ్జాకాలంగా ఎంచరాదు."

పైనతెల్పిన మినహాయింపులకు, పరిమితులకు లోబడి ఏ ఆసామీ సిక్మీదారుఅయినా 12 ఏండ్లు వరుసగా కబ్జా కలిగి వుంటే అలాంటివారు సిక్మీదారులుగా ఎంచబడుతారు. అయితే

ఇట్టి తరగతికిక్రిందకు వచ్చే సిక్మీదార్లు ఆచరణలో వుండరనే చెప్ప
వచ్చు. ఎందుచేతనంటే, (1) పట్టాదారుకు, ఆసామిషా సిక్మీకి
మధ్య వ్రాతపూర్వకమైనట్టిగాని లేక కనీసం నోటిమాటద్వారా
గాని కౌలుకాలాన్ని గూర్చి ఒడంబడిక అనేది దాదాపు ఏమీ
వుండదనే చెప్పాలి. (2) అలా ఒడంబడికలు వున్నప్పటికీ 12
సంవత్సరాలు వరసగా కబ్జాకలిగివున్న ఆసామీ సిక్మీలువుండడం
చాలతక్కువ. ఒకవేళ ఎచ్చటైనా అట్టి ఆసామీసిక్మీలు వున్న
ప్పటికీ వాళ్లు రికార్డుపూర్వకంగా తమకు 12 సం॥ల కబ్జావున్నట్లు
రుజువుచేసుకోవడం చాల కష్టమైనపని. అందుచేత ఆసామీ
సిక్మీ సిక్మీదారుగా గుర్తింపబడేందుకు యీ చట్టంలోవున్న
ఏర్పాటు దాదాపు ఆచరణలో నామకఃగానే వుండిపోయింది.

పైనతెల్పినవిధంగా మొదటిరకంక్రిందకువచ్చే సిక్మీదా
రులుకుమాత్రం శాశ్వత కబ్జాహక్కు యివ్వబడింది. పట్టాదా
రుకు, లేక పోటు పట్టాదారుకు సిక్మీదారుకుమధ్య కౌలురేటు
గూర్చి ఉభయులమధ్య ఒప్పందంకుదిరితే ఆ ఒప్పందంప్రకారం
గాని, లేక అట్టిఒప్పందం ఏమీలేనప్పుడు గతసంవత్సరం అతను
చెల్లించిన కౌలురేటుప్రకారంగాని, కౌలుచెల్లించాల్సివుంటుంది.
అలా కౌలురేటు చెల్లించుతూవున్నంతవరకు పట్టాదారు అతన్ని
కబ్జానుండి తొలగించరాదు.

(4) ఆసామిసిక్మీ:—ఈ తరగతికి చెందినవారంతా ఏట్టిహ
క్కులు, రక్షణలు లేని కౌలుదార్లన్నమాట. వీరినిగురించి చట్టంలో
యీ విధంగా నిర్వచించబడివుంది:—

"ఆసామీ సిక్మీ అంటే వ్రాతపూర్వకమైన పత్రం ద్వారాగాని లేక నోటిమాటమీదగాని భూమిని కౌలుకు తీసుకున్న వాడు. ఆసామీసిక్మీహక్కులున్న స్వాధీనపు తనఖాదారు గూడ యీ తరగతిక్రిందకు వస్తాడు. అయితే ప్రభుత్వం భూములను కౌలుకు జేసేవారు యీ తరగతిక్రిందకు రారు" (సెక్షను 2. సబ్ సెక్షను 13.)

కాబట్టి ఆసామీ సిక్మీ అంటే ఏ ట్రీహక్కులు లేనట్టి, పట్టాదారులచేత ఎప్పుడుబడితేఅప్పుడు తమ కబ్జాలనుండి తొలగింపబడడానికి వీలుగావుండే కౌలుదారు అని అర్థం. అంటే పట్టాదారులు, పోటు పట్టాదార్లు సిక్మీదారులు కానట్టి రైతాంగం అంతా దాదాపు యీ తరగతిక్రిందకే వస్తారు.

ఈ విధంగా హైదరాబాదు రెవెన్యూచట్టంప్రకారం ప్రథమపర్యాయంగా భూమిపై భూఖామందులకుండే హక్కుల నిర్వచనం చేయబడినప్పటికి రైతాంగంలో అధికభాగం భూమిపై ఏహక్కు లేకుండా వుండిపోయారు.

1317 వ ఫసలీ (1907 సం.) హైదరాబాదు ల్యాండు రెవెన్యూచట్టాన్ని ప్రభుత్వం నేరుగా తన ఉద్యోగులద్వారా గాని, లేక పన్ను వసూలుదార్లద్వారాగాని రైతులనుండి శిస్తులు వసూలుగావించే ఖాల్సాప్రాంతాలకే వర్తింపజేయబడింది. ఈ ఖాల్సాప్రాంతాలలో గూడ ఈనాం, మక్తా ఇజారాప్రాంతాలు మినహాయింపబడ్డాయి. దీర్ఘకాలపు ప్రభుత్వ కౌలుదార్లు, బంజరుదార్లు గూడ యీ చట్టాన్నుండి మినహాయింపబడ్డారు. అంతేగాకుండా మొత్తం సంస్థానంలో నూటికి

40 వంతులకులోగా విస్తీర్ణంవున్న జాగీరు, సర్ఫెఖాస్ప్రాంతాలకు అసలే యీ చట్టాన్ని యిటీవలవరకు వర్తింపజేయలేదు. (1356 వ ఫసలీ 1946 సం. వరకు.) అంటే ఈ చట్టంద్వారా భూఖామందులకు కలుగజేసిన ఆ కొద్దిపాటి పరిమితహక్కులు గూడ దాదాపు మొత్తంసంస్థానంలో సగభాగంవరకు అప్పట్లో వర్తింపజేయలేదు. ఒక్క ఖాల్సాప్రాంతానికిమాత్రమే వర్తింపజేయడం జరిగింది.

(ఇ) '1354 వ ఫసలీ ఆసామి షిక్మీస్ఆక్టు' — దానిలోని ప్రధానాంశాలు:—

కౌలుదార్ల రక్షణ, హక్కుల గూర్చి హైదరాబాదుప్రభుత్వం 1354 వ ఫసలీ (1944 సం.) వరకూ ఎట్టిచట్టం గావించలేదు. 1357 వ ఫసలీ (1937 సం.)లో కౌలుదార్ల స్థితిగతులను విచారించేందుకు ఒక కమిటీని నియమించవలసిందిగా అప్పటి రెవెన్యూ డిపార్టుమెంటు నైజాంనవాబుకు ఒక మెమోరాండం పంపింది. (1347 ఫసలీ ఆబాన్ 10 వ తేదీ. గుజారిష్.) ఈ మెమోరాండంను పురస్కరించుకొని హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూడిపార్టుమెంటు అప్పటి అడిషనల్ సెక్రెటరీ అధ్యక్షతను ఒక టెనెన్సీకమిటీని నియమించింది. ఆ కమిటీలో సభ్యులందరూ అధికారులే. అధికారేతరులు ఒక్కరూగూడ సభ్యులుగా లేరు. అందుచేత యీ కమిటీ సిఫారసులకు, నివేదికకు చాల పరిమితులుంటాయి. అయినా యీ కమిటీ నివేదికలో కౌలుదార్ల దారుణ స్థితిగతులగూర్చిన వాస్తవవిషయాన్ని కొంతవరకు అంగీకరింపక తప్పిందికాదు.

సంస్థానంలోని 48 గ్రామాలలో యీ కమిటీ తన విచారణ గావించింది. ప్రతిజిల్లాలో ఒక ఖాల్సాగ్రామం, ఒకబంజరు, ఇజారా లేక యీనాంగ్రామము, ఒక జాగీరు లేక మక్తా గ్రామం తీసుకుని ప్రత్యేకంగా విచారించడం జరిగింది. విచారణగావించిన 48 గ్రామాల్లో పట్టాదారుల సంఖ్య 4028; సిక్మీ ధారులసంఖ్య 1161. (వీరిద్దరుకలిసి 5189 మంది వున్నారు.) కౌలుదార్లసంఖ్య 1865. పట్టాదార్లసంఖ్యతో పోల్చినప్పుడు కౌలుదార్లు నూటికి 46 వంతులవరకు వున్నారు. మొత్తంపట్టాదార్లు, సిక్మీదార్లతో పోల్చినప్పుడుగూడ నూటికి 36 వంతుల వరకూ వున్నారు. 1931 సంవత్సరం జనాభా లెక్కలప్రకారం హైదరాబాదు సంస్థానంలో మొత్తం భూఖామందులసంఖ్య 18 లక్షలు; కౌలుదార్లసంఖ్య దాదాపు 6 లక్షలవరకూ వుంది. అంటే నూటికి 33 వంతులువరకు వున్నదన్నమాట. పైనపేర్కొన్న టెనన్సీకమిటీ అంచనాలప్రకారం మొత్తంసంస్థానంలో కౌలుదార్లు భూఖామందులసంఖ్యలో దాదాపు నూటికి 40 వంతులవరకూ వుంటారని తేల్చబడింది.

ఇంత పెద్దసంఖ్యలో కౌలుదార్లు వుండుటేగాకుండా కౌలు కాలపరిమితి స్థితిగతులుగూడ చాలఅధ్వాన్నంగావున్నట్లు ఆ కమిటీనివేదికలోనే అంగీకరింపబడింది. ఈ విషయాన్నిగూర్చి ఆ కమిటీనివేదికలో యీ విధంగా చెప్పబడింది:—

"కౌలుకాలం కనీసపరిమితి ఒక సంవత్సరం; అంటే ఒక పంటకాలం అన్నమాట. ఒకేకౌలుదారు రెండునుండి ఐదుసంవత్సరాలకంటె ఎక్కువకాలం వరుసగా కౌలుకు చేస్తూవుం

డడం అవుతుగా కనుపింపుతుంది. 1931 మంది కౌలుదార్లను విచారిస్తే 12 సంవత్సరాలు అంతకమించిన కౌలు కాల నిర్ణయంగల కౌలుదార్లసంఖ్య 139 మాత్రమే. వీరిలోగూడ 12 సంవత్సరాల కౌలుకాలానికిమించిన వ్రాతపూర్వకమైన కౌలు పత్రాలు 9 మాత్రమే. కౌలుదార్లలో అత్యధికసంఖ్యాకులు రెండుసంవత్సరాల కౌలుకాలాన్ని కల్గియున్నారు." (మాధవరావు వ్యవసాయసంస్కరణల కమిటీ నివేదికనుండి పేజి 23.) దీన్నిబట్టి 12 సంవత్సరాలు వరుసగా కౌలుకు జేసిన కౌలుదార్లకు శాశ్వితకబ్జా యివ్వడం అన్న ఏర్పాటు ఆచరణలో ఎంత బూటకమయిందో బోధపడుతుంది. భూస్వాములు దీర్ఘకాలపు కౌళ్ళు అందులో వ్రాతపూర్వకమైన దీర్ఘకాలపుకౌళ్లు అంటే ఎంతగా భయపడుతారో తెల్పుతూ కుమారప్పకమిటీ రిపోర్టులో యిలా చెప్పబడింది:—

'పట్టాదార్లు (అంటే భూస్వాములు అని చదువుకోవాలి) వ్రాతపూర్వక కౌలు ఖరారునామాలు వ్రాసుకోవడానికి యిష్టపడుటలేదు. ఎందుచేతనంటే వాళ్లకు దీర్ఘకాలపు కౌళ్లంటే యిష్టంలేదు. ప్రతి రెండు లేక మూడు లేక ఐదు సంవత్సరాలకు కౌలుదార్లను మార్చడం వారి కిష్టముంటుంది. దీర్ఘకాలపు కబ్జాను ఆధారంగాగొని కౌలుదార్లు కౌలుహక్కులును, కౌలుదార్లు డిమాండుచేయకుండా వుండగలందులకే భూస్వాములు దీర్ఘకాలపు కౌళ్లుఅంటే యిష్టపడరు మావిచారణవలన ఒక విషయం తేలింది. (ఈవిషయం ప్రభుత్వానికిగూడ యింతకుముందే తెలుసు) అదేమంటే ఆసామీ శిక్మీలు 12 సంవత్సరాల

వరస కబ్జా కల్గివుండి 1317వ ఫసలీనాండు ఆక్టుప్రకారం పట్టాదారు క్రింద శాశ్వత కబ్జాహక్కును పొందడం అనేది చాల అరుదు మాత్రమే ఈ విషయాన్ని భూస్వాములు అంగీకరిస్తారు. (అదే రిపోర్టునుండి)

ఈ విధంగా కౌలుదార్ల దారుణ స్థితిగతులను అంతా ప్రభుత్వోద్యోగుల చేత నింపబడిన టెనెన్సీ కమిటీయే అంగీకరించక తప్పిందికాదు. చివరకు కౌలుదార్లకు ఏదో రకమైన రక్షణ ఏర్పర్చవలసినదిగా ఆ కమిటీ సిఫార్సు చేయాల్సివచ్చింది కూడా. ఆ టెనెన్సీకమిటీ సిఫార్సుల నాధారంగా గాని నైజాం ప్రభుత్వం ఒక కౌల్దారీ చట్టాన్ని గావించింది. దీన్ని 1354వ ఫసలీ (1944 సంవత్సరం), ఆసామీ సిక్మీస్ చట్టం అంటారు. ఈ చట్టం ప్రస్తుతం అమలులోలేదు. 1950 కౌల్దారీచట్టం అమలులోకి వచ్చాక యిది రద్దు గావించబడింది. అయినప్పటికీ దీనిప్రకారం కౌల్దార్లకు లభించిన హక్కులు రద్దుగాలేదు. అందుచేత క్లుప్తంగా 1354వ ఫస్లీ ఆసామీ సిక్మీస్ చట్టంలోని ప్రధానాంశాలను గూర్చి తెలుసుకోవలసి వుంది.

ఈ చట్టంలోని ప్రధానాంశాలు యివి.

1. ఈ చట్టంప్రకారం కౌలుదార్లు రెండు తరగతుల క్రింద విభజింపబడ్డారు. (1) రక్షిత ఆసామీ సిక్మీలు, (2) సాధారణ ఆసామీ సిక్మీలు.

రక్షిత ఆసామీ సిక్మీ అంటే వ్యవసాయపనులకోసం వినియోగింపబడే భూమిపై 1342–1352 ఫస్లీలమధ్య 10ఏండ్ల

కాలంలో 6 సంవత్సరాలకు తగ్గకుండా వరుసగా కబ్జా కలిగి వుండి ఆ భూమిని స్వయంగా సాగుచేస్తున్న ఏ వ్యక్తిఅయినా రక్షిత ఆసామి సిక్మీగా పరిగణింపబడతాడు.

రక్షిత ఆసామీ సిక్మీగా పరిగణింపబడేందుకు అవుసరమయిన 6 ఏండ్ల కబ్జాకాలాన్ని ఈక్రిందివిధంగా లెక్కకట్టాలి.

(అ) 1342—52 ఫసలీలమధ్య వరుసగా 6 ఏండ్లు కాలం వుంటే దాన్ని లెక్కించుట సులభమే.

(ఆ) అలాగాకుండా ఆసామీ సిక్మీగావున్న ఒకనికబ్జాపైన తెల్పిన 6 సంవత్సరాలకాలం నిండకపూర్వమే (అతను చనిపోవుట వలనగాని, లేక మరి యితరవిధాలగాని) అతని వారసుడైన మరొక ఆసామీ సిక్మీకి లభించినపక్షంలో అలా లభించిన ఆసామీసిక్మీ కౌలుకాలం లెక్కించేప్పుడు మొదటివాని కబ్జాకాలాన్ని గూడ లెక్కలోనికి తీసుకోవలసి వుంటుంది. ఉదాహరణకు మొదటివాని కబ్జాకాలం నాలుగేండ్లు, అతని వారసుని కబ్జాకాలం రెండేండ్లు వున్నట్లయిన వారసుని కబ్జాకాలం 6 ఏండ్లుగా లెక్కించి అతన్ని రక్షితఆసామీ సిక్మీగా లెక్కించవలసి వుంటుంది.

(ఇ) ఒకేగ్రామంలో ఒకేభూస్వామికి చెందిన రెండు ఖండాలను విడివిడిగా అదే గ్రామానికి చెందిన ఒకఆసామీ సిక్మీ కౌలుకు చేసినప్పుడు (1342—52 ఫసలీలమధ్య) రెండుఖండాలను కౌలుకుచేసిన కాలాన్నంతా లెక్కలోకి తీసుకోవాలి. ఉదాహరణకు ఒక ఆసామీసిక్మీ చట్టంలో నిర్దేశించిన 6 సంవ

త్సరాల కబ్జాకాలాన్ని నిర్ణయించడానికి పెట్టిన ఆఖరు తేదీ (అంటే 1352 వ ఫసలీ ఆఖరు తేదీ) నాటికి కబ్జా కలిగివుండి భూస్వామికి చెందిన ఒక ఖండాన్ని 3 సంవత్సరాలు, మరొక ఖండాన్ని మరో 3 సంవత్సరాలు 1342–52 ఫస్లీల మధ్యకాలంలో సాగుచేసిన అతన్ని రక్షిత ఆసామీసిక్మీగా పరిగణింపవలసి వుంటుంది.

(ఈ) ఇద్దరుగాని లేక అంతకన్నా మించిగాని ఆసామీ సిక్మీలు వుమ్మడిగా ఒకభూమిపై కబ్జాకలిగివుండి (1342–52 ఫస్లీలమధ్య) సాగుచేస్తున్నారనుకోండి 6 సంవత్సరాలకాలం నిండకముందే యిందులో కొందరు ఆసామీసిక్మీలు సాగుమానివేసినప్పటికీ ఏ ఒకరైనా ఆ సంవత్సరాలకాలం పూర్తయ్యే వరకు కబ్జాకలిగి సాగుచేస్తున్నట్లయిన ఆభూమిపై ప్రారంభంలో వుమ్మడిగా సాగుచేస్తున్నావారందరిని రక్షిత ఆసామీ సిక్మీలుగా పరిగణించాల్సి వుంటుంది. (1354 ఫస్లీ ఆసామీ సిక్మీ చట్టం సెక్షను 3.)

(ఉ) 1342 నుండి 52 వ ఫస్లీలమధ్య 10 సంవత్సరాల కాలంలో 6 సంవత్సరాలకు తక్కువగాకుండా ఏ భూమిపైనన్నా వరుసగా కబ్జాకలిగి 1352 ఫస్లీ ఆఖరు తేదీనాటికిగాని, అటుతర్వాత గాని బేదఖలు చేయబడివున్నప్పటికీ అట్టి ఆసామీసిక్మీ నికూడ రక్షిత ఆసామీ సిక్మీగానే పరిగణించాల్సివుంటుంది.(సెక్షను 4) పైవిధంగా పరిగణింపబడే రక్షిత ఆసామీసిక్మీ ఈ చట్టం అములులోకి వచ్చాక 2 సంవత్సరాలలోపల తిరిగి తనకు భూమిపై కబ్జాఇప్పించవలసిందిగా దరఖాస్తు చేసుకోవచ్చును.

అయితే ఏభూమిపైనైతే కబ్జా తిరిగి యిప్పించమని దరఖాస్తు చేస్తాడో ఆ భూమిని భూస్వామి తాను స్వంతసాగు చేసుకోవాలని దరఖాస్తు చేసినకబ్జా యిప్పించడానికి అవకాశముండదు.

2. రక్షితఆసామీ సిక్మీలుగా ఎవరిని పరిగణించాలో దీనిపైన తెల్పాం. అలా పరిగణింపబడినవారు చట్టానికిపూర్వంగాని, లేక తరువాతగాని భూస్వామికి వ్రాతపూర్వకంగా యీ చట్టం క్రింద తమకులభించే హక్కులకు విరుద్ధంగా వ్రాసిచ్చినప్పటికీ, లేక మూజువాణీగా ఒప్పందం కుదుర్చుకున్నప్పటికీ అవేమీ చెల్లనేరవు.

3. రక్షితఆసామీ సిక్మీలను యీ క్రింది సందర్భంలో బేదఖలీలు చేయడానికి ఆసామీ సిక్మీచట్టం అనుమతించుతోంది.

(అ) 1344 వ ఫసలీతో అంతమయ్యే సంవత్సరానికి భూస్వామికివ్వవలసిన బకాయి ఏదైనావుంటే అట్టి బకాయిని ఈచట్టం అమలులోకివచ్చాక ఆసామీ సిక్మీదారు 2 సంవత్సరాలలోపల చెల్లించకపోయినప్పుడు,

(ఆ) తనకబ్జాలోవున్న భూమికి ప్రమాదకరమైన శాశ్వితహానిని దేనినైనా కౌలుదారు కలిగించినపుడు,

(ఇ) తాను స్వయంగా సాగుచేయకుండా తిరిగి మరొకరికి కౌలుకిచ్చినపుడు (కౌలుదారు మైనరుగాగాని లేక వితంతువుగాగాని అయివుంటే తిరిగి కౌలుకిచ్చుకోవచ్చును.)

(ఈ) వ్యవసాయేతర కార్యాలకోసం భూమిని కౌలుదారు వినియోగించుతున్నప్పుడు,

(ఉ) భూస్వామి స్వయంగా సాగుచేసేవుద్దేశంతో తహసీల్దారుకు చట్టం అమలులోకివచ్చిన సంవత్సరంలోపల దరఖాస్తు చేసుకున్నప్పుడు లేక భూఖామందు వ్యవసాయేతర కార్యాలకోసం భూమిని వుపయోగించ దలచినప్పుడు,

(అయితే పైనచెప్పిన రెండు సందర్భాలలోనూ భూమి తనకు స్వాధీనపర్చబడినతరువాత ఆ భూమిని పైనచెప్పిన కార్యాలకోసం వినియోగించకుండా ఒకసంవత్సరం పడావుగా వుంచినట్లయిన ఒకసంవత్సరం నోటీసుతో [illegible] రక్షితఆసామీ సిక్మీ తిరిగి ఆ భూమిని అంతకుపూర్వం కల్గియుంటున్న కౌలు రేటుపై సాగుచేసుకుంటూ కబ్జా చేసుకోవచ్చును. తాను బేదఖలు చేయబడినకాలంలో తనకుకలిగిన నష్టానికి భూస్వామిచేత పరిహారం ఇప్పించాలని తహసీల్దారుకు దరఖాస్తుచేసుకోవచ్చును. (సెక్షను 9. సబ్ సెక్షన్ 1,2,5.)

4. స్వయంగా వ్యవసాయం చేసే భూఖామందులంటే ఎవరో ఈ చట్టం ఈ క్రిందివిధంగా నిర్వచించింది:—

(అ) తమభూమిని స్వయంకష్టంద్వారా సాగుచేసేవారు లేదా

(ఆ) తమకుటుంబంలో ఏ ఒకసభ్యునైనా స్వయంగా కష్టంచేస్తూ వ్యవసాయాన్ని సాగించేవారు. లేదా

(ఇ) తాము అంతాగాని లేక కుటుంబంలో ఏ ఒకరైనా గాని తమభూములను మేనేజ్ చేసుకొంటూ (నిగురానీ గావించుకొంటూ) తమ వ్యవసాయాన్ని జీతగాండ్లు లేక వ్యవసాయకూలీలు లేక ముద్దచేత చేయించుకొంటూ వుండేవారు.

పైన నిర్వచించినవిధంగా స్వంతవ్యవసాయం సాగించే వుద్దేశ్యంతో ఏ భూఖామందుఅయినా, తనభూమిని కౌలుకుజేస్తున్న రక్షితఆసామీ సిక్మీని బేదఖలు చేయవచ్చును. అయితే అలా బేదఖలు చేయడానికిముందు రక్షితఆసామీ సిక్మీ చట్టం ప్రకారం ఆసామీ సిక్మీ భూమిని అభివృద్ధిచేయడానికి ఏదైనా పెట్టుబడి పెట్టివుంటే అట్టి పెట్టుబడిమొత్తాన్ని భూఖామందు నుండి రాబట్టుకోడానికి ఆసామీ సిక్మీకి హక్కువుంది.(సెక్షన్ 8.) ఇందుకోసం తహశీలుదారుకు ఆసామీ సిక్మీ బేదఖలుఅయిన తరువాత దరఖాస్తు చేసుకోవాల్సి వుంటుంది. (సెక్షన్ 8.)

5. ఈ చట్టం అమలులోకివచ్చాక వ్రాతపూర్వకమైన కవులు కరారునామాల ద్వారాగాని, లేక మూజువాణీగాగాని కౌలుకాలాన్నిగూర్చి ఏ నిర్ణయం జరిగినప్పటికీ, ఆ నిర్ణయం చెల్లదు. పాతకౌళ్లకుగూడ కౌలుకాలం 10 ఏండ్లకు తక్కువ వుండరాదు. చట్టం అమలులోకివచ్చాక యివ్వబడేకౌళ్లు 10 ఏండ్లకు తక్కువ యివ్వరాదు. (సెక్షన్ 23)

6. కౌలుదార్లు చెల్లించాల్సిన గరిష్టరేటును (మాక్సిమమ్) ప్రభుత్వం నిర్ణయించవచ్చు. (సెక్షన్ 15.)

7. కౌలుశిస్తు చెల్లిస్తూవున్నంతవరకు, ఏ రక్షితఆసామీ సిక్మీనిగూడ భూస్వామి స్వయంగా సాగుచేసుకొనే పక్షంలో తప్ప బేదఖలు చేయరాదు.

8. ప్రభుత్వం నిర్దేశించిన కౌలురేటుగాని, అదిలేనప్పుడు అంతకుముందు ఆచారయుతంగా కౌలుదార్లు చెల్లిస్తూయున్న క్రమ కౌలురేటు తప్ప భూస్వామి మరి ఏ యితర సెస్సుగాని,

పన్ను గాని వసూలుచేయరాదు. ఇతరత్రా యే యితర అక్రమ, అదనపుక్రమ చేయించుకోరాదు. (సెక్షన్ 14.)

9. ప్రభుత్వం పట్టాదారులకు శిస్తు మాఫీగాని లేక సస్పెన్షన్ గాని చేసినప్పుడు భూస్వామి కౌలుదారుకు (అటు రక్షితకౌలుదారు అయినా లేక వృత్త కౌలుదారుఅయినా ఇద్దరి సందర్భంలోనూ) ఆయాసందర్భాన్నిబట్టి శిస్తు మాఫీచేయడమో లేక శిస్తువసూలు నిలుపుచేయడమో చేయాలి. (సెక్షన్ 16.)

10. ఒకసంవత్సరంలో ఆసామి సిక్మీ భూస్వామికిచెల్లించే ప్రతిమొత్తం, ఆసంవత్సరం కౌలురేటుక్రింద నే భూస్వామి జమ కట్టుకోవాలి. (తద్విరుద్ధమైన నిర్దిష్ట వ్రాతపూర్వకమైన ఒడంబడిక కౌలుదారు, భూస్వామిమధ్య ఏదైనా జరిగివుంటే ఆ ఒడంబడికప్రకారమే జమకట్టుకోవచ్చు.) ఆసామి సిక్మీ కౌలుక్రింద చెల్లించే మొత్తానికి ప్రభుత్వంనిర్ణయించిన ఫారంమీద రశీదును భూస్వామి వ్రాసిఇవ్వాలి. అలా రశీదు ఇవ్వనిభూస్వామిపై కౌలుదారు తహశీలుదారుముందు సికాయత్ చేస్తే భూస్వామికి రు 100/– లవరకూ జరిమానా విధించవచ్చు. (సెక్షను 22.)

11. ఏ భూస్వామితాలూకు భూమిని కౌలుకుచేస్తూవుంటాడో, అట్టి భూస్వామికిచెందిన గ్రామములోని నివేశనస్థలంలో ఆసామి సిక్మీగాని లేక అతని వెనుకటి తరములోనివారుగాని ఏదైన స్వంతఖర్చుతో ఇల్లు వేసుకొనివుంటే అట్టి యింటినుండి భూస్వామి ఆసామీ సిక్మీని బేదఖలు చేసినప్పటికీ వెళ్ళగొట్ట రాదు.

12. బేదఖలు చేయబడ్డ వ్యవసాయకభూమిలోనే అద్దె యిల్లు వేసుకొని వున్నప్పుడు భూస్వామి స్వంతఖర్చుతో ఇల్లు వేయించినప్పుడుమాత్రం బేదఖలు చేయవచ్చు.(సెక్షన్ 17).

అలా ఇల్లువేసుకున్న భూస్వామికి చెందిన స్థలాన్ని భూస్వామి అమ్మదలుచుకుంటే ఆసామి సిక్మీ కొనుక్కోడానికి నిరాకరించినప్పుడే ఇతరులకు అమ్మవలసివుంటుంది. (సెక్షన్ 18.

ఈ చట్టం ఈ క్రిందితరగతుల భూములకుతప్ప తక్కినా అన్నిరకాల వ్యవసాయభూములకు వర్తిస్తుంది.

(అ) ప్రభుత్వంనుండిగాని లేక ఏదైనా సహకారసంఘం నుండిగాని నేరుగా కవులుకు తీసుకున్నభూములు. లేదా,

(ఆ) పారిశ్రామిక లేక వ్యాపారిక వ్యవస్థలు తమ ప్రయోజనాలకు కవులుకు తీసుకున్నభూములు.

పైన చెప్పిన రకాల భూములసంబంధంలో యీ చట్టం వర్తించనేరదు.

ఈ చట్టం మొత్తం చూచినప్పుడు చట్టంకు పూర్వము ఎట్టి హక్కులు లేకుండా పడివున్న కౌలుదార్లకు కొంతవరకు రక్షణ కలిగించింది. హైదరాబాదు ల్యాండు రెవెన్యూ చట్టం ప్రకారం కౌలుదారు సిక్మీదారుగా పరిగణించబడడానికి 12 సంవత్సరాలు విడవకుండా కబ్జా కలిగి వుండాలి. ఈ చట్టం ప్రకారం 6 సంవత్సరాల కబ్జా కల్గివున్న ఆసామీ సిక్మీదారులు రక్షిత ఆసామీ సిక్మీదారులుగా గుర్తింపబడుతారు. ఈ చట్టంలో యిలా నిర్దేశించబడడం అభివృద్ధికరమైనదే. కాని ఆచరణలో

యీ అవకాశాన్ని వుపయోగించుకోవడంజరగలేక. ఎందు
చేతంటే 1347వ ఫసలీలో టెనన్సీ విచారణ కమిటీని ప్రభు
త్వం నియమించుటతో భూస్వాములు ఏదో కౌలుదార్ల చట్టం
రాబోతున్నదన్న భయంతో పెద్దయెత్తున కౌలుదార్లను బే
దఖలు చేయడం ప్రారంభించారు. టెనెన్సీ కమిటీ విచారణ
పూర్తియి ఆగామీ సిక్మీ చట్టం వచ్చేప్పటికి అంటే
1354ఫసలీకు చాలవరకు పాతకౌలుదార్లు ముఖ్యంగా దీర్ఘకాలపు
కౌలుదార్లు బేదఖలు చేయబడ్డారు. ఈ బేదఖళ్లను నిషేధిస్తూ
ప్రభుత్వం ఏ చర్యా తీసుకోలేదు. ఈ కారణంవలన చట్టం
అమలులోకి వచ్చేప్పటికి భూస్వాములు తమ యిల్లు చక్క
బెట్టుకోగలిగారు. చట్టంలోని ఏర్పాట్లను తప్పించుకోడానికి అవ
సరమైన బేదఖలుచర్యలూ గావించడం రికార్డులు సృష్టించు
కోవడం జరిగింది. తత్ఫలితంగా చట్టంవలన బేదఖలు చేయబడ్డ
దీర్ఘకాలపు కవులుదార్లకు ఆచరణలో హక్కులు సంక్రమించ
లేదు.

ఇక చట్టంప్రకారం రక్షితఅసామీ సిక్మీలుగా పరిగణింప
బడాల్సిన వారినిగూర్చిగూడ ప్రభుత్వోద్యోగులు సక్రమముగా
చర్య గైకొనలేదు. చట్టం అమలులోకి వచ్చేనాటికి హైదరా
బాదు సంస్థానంలో భూములపై రైతులకున్న హక్కులను రికార్డు
చేయడానికి సక్రమమైన నియమాలుగాని పద్ధతిగాని లేవు.
హైదరాబాదు లాండు రికార్డ్సులో కౌలుదార్ల ప్రమేయమే
ఎత్తుకోలేదు. ప్రథమపర్యాయంగా రక్షిత కౌలుదార్ల హక్కుల
గూర్చిగూడ గ్రామోద్యోగస్థులు రికార్డు చేయాలని 1358 వ

ఫసలీలో అంటే 1354వ ఫసలీ ఆసామియా సిక్మీస్ చట్టం అమలు లోకి వచ్చాకనే వుత్తర్వు జారీచేయడం జరిగింది అందుచేత ఆసామియా సిక్మీస్ చట్టం కౌలుదార్లకు కల్పించిన కొద్ది లాభాల నైనా వినియోగించుకొనేందుకు కౌలుదార్లకు వ్రాతపూర్వక మైన ప్రభుత్వ రికార్డులు చట్టానికిముందు ఏమీ లేవు.

ఇక రక్షిత కౌలుదార్లుగా గుర్తింపబడ్డవారిని సహితం స్వంతసేద్యంకోసం అన్నపేరుతో బేదఖలు గావించేందుకు పెద్దాచిన్న భూస్వాములకు గూడ అవకాశాన్ని కల్గించడం వలన ఆచరణలో రక్షిత కౌలుదార్లకు కబ్జా రక్షణే లేకుండా పో యింది ఈ విధంగా ఆచరణలో ఆసామి సిక్మీస్ చట్టంలోని పరిమితమైన లాభాలు గతంలోని కౌలుదార్లకు పెద్దగా వుప యోగపడలేదు. అయితే కౌలుదార్లకు కొన్ని పరిమితమైన రక్షణాలును చట్టం కలుగజేసింది. అవి ఏమంటే:—

(1) చట్టం అమలులోకి వచ్చాక భూస్వాములు యిచ్చే కౌళ్లు అన్నీ 10 సంవత్సరాలకాల పరిమితికి ఎక్కువ లేకుండా వుండాలి. అంటే దాదాపు ఆసామియా సిక్మీస్ చట్టం అమలు లోకి వచ్చాక నేటివరకూభూస్వాములు గావిస్తూవచ్చిన బేదఖ లీలలో అత్యధికభాగం చట్టం విరుద్ధమన్నమాట. ఆసామీసిక్మీస్ చట్టంలోని ఈ సెక్షనుక్రింద యివ్వబడిన హక్కు నేటికీ అమ లులోనే వుంది. ఎందుచేతనంటే 1950 కౌలుదారీచట్ట 33వ సెక్షనులో అంతకుముందు అమలులోవున్న ఏ చట్టం ప్రకార మైనా హక్కులుగాని సౌకర్యాలుగాని ఏర్పడివుంటే అవి రద్దు గావని అని స్పష్టంగా చెప్పబడివుంది. కాబట్టి పైన తెల్పిన

హక్కును నేటికి కౌలుదార్లు రక్షణకోసం యెంతవరకు వుపయోగించుకోడానికి వీలుందో అంతవరకు వుపయోగించు కోడానికి ప్రయత్నించాలి.

(2) భూస్వాములు యిష్టంప్రకారం కౌలురేట్లను మితిమీరి పెంచకుండా గరిష్టహద్దు పెట్టడానికి ప్రభుత్వంపై ఆందోళన గావించేందుకు ఈ చట్టంద్వారా అవకాశంలభించింది.

(3) పట్టాదార్లకు శిస్తుమాఫీ, శిస్తువసూలు నిలుపుదల చేయబడ్డప్పుడు కౌలుదార్లుగూడ ఆ మేరకు కౌలు మాఫీచేయుమని ఆందోళన గావించుకోడానికి అవకాశం లభించింది.

(4) ఆసామీ సిక్మీలలో కొందరు సిక్మీస్ చట్టంప్రకారం రక్షిత కౌలుదార్లుగామారి శాశ్వితకబ్జాహక్కును పొందడానికి అవకాశం ఏర్పడింది.

(5) ఖాల్సాప్రాంతంలోని కౌలుదార్లకే గాకుండా ఈ చట్టాన్ని జాగీరు, యీనాం, మక్తా మున్నగు ఖాల్సా కాని యితరప్రాంతాలలోని కౌలుదార్లకుగూడ ప్రథమపర్యాయం వర్తింపచేయడం జరిగింది

1354 వ ఫసలీ (1944 సం.) లో గావించిన ఆసామీ సిక్మీస్‌చట్టం రైతులకు కల్గించిన ముఖ్యప్రయోజనాలు యివి.

ఈచట్టాన్ని అమలుజరిపేందుకు 1356 ఫసలీ (1946)లో 'ఆసామీ సిక్మీచట్టం నిబంధనలు' ప్రచురింపబడ్డాయి. న్యాయమైన కౌలురేటును నిర్ణయించేందుకు తహశీలుదారుకు కౌలుదార్లు ఎలా దరఖాస్తు చెయ్యాల్సింది, భూస్వాములు కౌలుదార్లుచెల్లించే కౌలుమొత్తానికి యివ్వాల్సిన రశీదులు ఎలావుం

డాల్సింది, ఖాల్సాకాని జాగీరు మున్నగు ప్రాంతాలలో యీ చట్టాన్ని ఎలా అమలుజరపాల్సింది. మున్నగువిషయాలను విశదీకరిస్తూ ఆ నిబంధనలలో చెప్పబడింది.

1254 ఫసలీ (1944) ఆసామీ సిక్మీ చట్టం 1950 వ సంవత్సరపు కౌలుదారీచట్టం అమలులోకివచ్చాక రద్దుగావించబడింది. అయితే ఆసామి సిక్మీస్ చట్టక్రింద సంక్రమించిన హక్కులుమాత్రం రద్దుచేయబడలేదు.

(ఈ, భూములపైవున్న హక్కుల రికార్డులు — వీటినిగూర్చి ప్రభుత్వం రెగ్యులేషనులు.

1317 వ ఫసలీ 1907) లో గావించిన ల్యాండురెవెన్యూ చట్టం 86 వ సెక్షనుప్రకారం ప్రతి ఖాల్సాగ్రామానికి ప్రత్యేకంగా ఒక భూమిరిజిష్టరు తయారుచేయబడాలని చెప్పబడివుంది. ఆ రిజిష్టరును ఆ చట్టంక్రింద నియమించబడిన సర్వేఆఫీసరు ప్రతి సెటిల్ మెంటుకాలము (బందోబస్తు) అప్పుడు నూతనంగా తయారుచేసి గ్రామాధికారులకు అప్పగిస్తాడు. ఆ రిజిస్టరులో భూములపై వ్యవసాయకులలోని వివిధతరగతులకుండేహక్కులు నమోదుచేయబడుతాయి. ప్రతిపట్టా సర్వేనెంబరు, పట్టాదారునిపేరు, అతను చెల్లించాల్సిన, శిస్తుమొత్తంగూర్చి ఆ రిజిష్టరులో నమోదుచేయబడుతాయి. పట్టాభూములగూర్చేగాకుండా గ్రామములోని, గ్రామకంఠం, పోరంబోకు, బంచరాయి, ఖార్జుకాతా మున్నగు భూములగూర్చి తెల్పే ప్రత్యేకరికార్డులుగూడ తయారుచేయబడుతాయి.

ల్యాండు రెవెన్యూ చట్టం ప్రకారం ఏర్పర్చాల్సిన పట్టా దారుల రిజిస్టరు, భూమిహక్కుల రికార్డు, సర్వే సెటిల్ మెంటు అయిన ఖాల్సా ప్రాంతాలలో మాత్రమే తయారు చేయబడ్డాయి. ఖాల్సా గ్రామాలలో గూడ ఈనాం, మక్తా మున్నగు గ్రామా లలో అట్టి రికార్డులు తయారు చేయబడలేదు. అదే విధంగా జాగీరు మున్నగు స్టాట్యూటరీ జమీందారీ ప్రాంతాలలో గూడ అట్టి రికార్డులు ఏర్పర్చలేదు. 1317 ఫసలీ (1907) ల్యాండు రెవె న్యూ చట్టాన్ని 1355 ఫసలీ (1945)లో సవరించారు. ఆ సవరణ ప్రకారం అంటే (సెక్షను 77 ప్రకారం) ఖాల్సాగాని గ్రామా లలో గూడ సర్వే సెటిల్ మెంటు గావించేందుకు ప్రభుత్వం అధి కారం తీసుకొంది. ఈ సవరణ ప్రకారం ప్రభుత్వం రికార్డులు తయారు చేయడానికి పూనుకొనేవరకు జాగీరులలో పైన తెల్పిన భూమి రికార్డులు తయారు చేయబడలేదు.

ఖాల్సా గ్రామాలలో తయారు గావించిన రికార్డులు, ల్యాండు రిజిస్టర్లలో గూడ కౌలుదార్లను గూర్చి ప్రసక్తియే లేదు. 1358 ఫసలీలో ప్రభుత్వం ల్యాండు రికార్డుల గూర్చి ఒక రెగ్యులేషను జారీ గావించింది. దాని ప్రకారం ఆసామీ సిక్మీన్ ఆక్టు ప్రకారం రక్షిత ఆసామీ సిక్మీలుగా గుర్తింపబడిన కౌలు దార్ల గూర్చిన భోగట్టాను గూడ ల్యాండు రికార్డులలో చూపె ట్టాలని ఆదేశించడం జరిగింది. కాబట్టి 1358 ఫసలీ వరకు ఖాల్సా గ్రామాలలో సహితం, గ్రామములోని వ్యవసాయకులలోని వివి ధతరగతుల గూర్చిన ప్రభుత్వ భూమి రికార్డులు సమగ్రంగా లేవు. ఇక ఖాల్సా కాని గ్రామాలలో జాగీరుదార్లు, మక్తాదార్లు,

ఈనాందార్లు మున్నగు భూస్వాముల చిత్తంవచ్చిన రికార్డులు మాత్రమే అమలులో వున్నాయితప్ప ప్రభుత్వం రికార్డులంటూ అసలు ఏమీ లేవు. 1358 ఫసలీలో 'భూమిహక్కులరికార్డు' సవరణచట్టం ఒకటి గావించబడింది. దానిప్రకారం ఖాల్సా ప్రాంతాలలోనూ, ఖాల్సాకాని ప్రాంతాలలోనూ, ఎచ్చటెచ్చట సర్వేసెటిల్‌మెంట్లు పూర్తి అయి వుంటాయో లేక ముందు పూర్తి అవుతాయో అచ్చటల్లా నూతనంగా భూమిహక్కుల రికార్డులను ప్రతి రెవెన్యూ గ్రామములోను ప్రభుత్వం తయారు చేయించాల్సి వచ్చింది. అట్టి 'భూమిహక్కుల రికార్డు' లో ఈ క్రిందివిషయాలు వుండాలని చెప్పబడింది:—

(1) చట్టరీత్యా కబ్జాహక్కు గుర్తింపబడిన వారి పేర్లు, వాస్తవంగా అప్పటికి భూమిపై కబ్జాలో వున్నవారి పేర్లు, భూఖామందుల పేర్లు, స్వాధీనపు భూమితర ఖాతాదారుల పేర్లు, కౌలుగాని లేక భూమిశిస్తుగాని గ్రహించేవారి పేర్లు.

(2) పైన తెల్పబడినవారి హక్కులు, బాధ్యతలు, వాటిస్వభావం గూర్చిన భోగట్టా.

(3) పైన తెల్పబడినవారిలో కౌలు లేక భూమిశిస్తు పుచ్చుకోవడంగాని, లేక యివ్వడంగాని ఎవరైనా చేస్తారా? అలా చేస్తే వారుయిచ్చే మొత్తాలెంత? ఎవరెవరు ఎవరెవరికి ఇచ్చేదెంత? పుచ్చుకునేదెంత?

(4) ప్రభుత్వం నిర్ణయించే యితరవివరాలు.

అయితే పైన మొదటిహాంశంలో తెల్పినవారిపేర్లలో మామూలు కౌలుదార్లపేర్లు చూపెట్టనవసరంలేదు. ప్రభుత్వపు

నియమాలప్రకారం శాశ్వత లేక దీర్ఘకాలపు కౌలుదార్లుగా గుర్తింపబడినవారి పేర్లుమాత్రమే నమోదుచేయాలి.

ఈవిధంగా నమోదు చేసినతరువాత ప్రభుత్వ గెజెట్ ద్వారా ప్రభుత్వం నిర్ణయించిన పద్ధతిప్రకారం యీ హక్కుల రికార్డులనుగూర్చి ప్రకటనజరుగుతుంది. అలా ప్రకటన జరిగాక రెండుసంవత్సరాలవరకూ ఆక్షేపణలు ఏమైనావుంటే భూఖామందులు, తదితర రైతులు తెల్పుకోవచ్చు. (సెక్షన్ 4.)

ఇలా "రికార్డు ఆఫ్ రైట్సు" తయారుచేయబడ్డాక పైన తెల్పినవ్యక్తులు తమహక్కు బాధ్యతలలో ఏమైన అన్యాక్రాంతంవలనగాని, క్రయవిక్రయాలవలన, యింక మరేవిధంగానైనా మార్పులు తెచ్చుకుంటే వాటిగూర్చి పటేలు పట్వారీలకు అట్టి మార్పులుజరిగిన మూడునెలలలోపల రిపోర్టుచేయాలి. సాధారణకౌలుదార్లుమాత్రం అలా రిపోర్టు చేయనవసరం లేదు. మైన రైతే అతనిగార్డియన్ రిపోర్టుచేయాలి. రిజిష్ట్రారు ఆఫీసుద్వారా పైనతెల్పినమార్పులు జరిగినసందర్భంలో రిపోర్టు చేయనవసరం లేదు. రిజిష్ట్రేషన్ ఆఫీసువాళ్లే అలారిపోర్టుచేస్తారు. (సెక్షన్ 5.)

ఈ మార్పులగూర్చి గ్రామపట్వారీలకు రైతులు తెల్పడంగాని లేక వారే స్వయంగా తెలుసుకున్నప్పుడుగాని అట్టి భూమిహక్కుల, బాధ్యతల గూర్చిన మార్పులను ప్రత్యేకంగా ఒక రిజిష్టరులో యెప్పటికప్పుడు నమోదుచేయాలి. ఈ రిజిష్టరును 'రిజిష్టరు ఆఫ్ మ్యుటేషన్సు' (భూమిమార్పిళ్ల రిజిష్టరు అని అర్థం) అని పిలుస్తారు ఈ రిజిష్టరులో నమోదుగావించే ప్రతిఒక్క మార్పునుగూర్చినకాపీ అందుకుసంబంధించిన వ్యక్తు

లకు గ్రామపట్వారీ పంపాలి. అదేసమయంలో అందరికీ తెలిసేం దుకు ఒకకాపీని గ్రామచావిడిలో వ్రేలాడగట్టాలి. ఇలానమో దుఅయ్యే మార్పిళ్ళగూర్చి ఆక్షేపణలు ఎవరికైనావుంటే వాటి నిగూడ గ్రామపట్వారీ నమోదుచెయ్యాలి. ఇలాజరిగిన మార్పు లనుగూర్చి రెవెన్యూ డిపార్టుమెంటు తన అంత్యనిర్ణయాన్ని గావించాక అవి గ్రామ భూమిహక్కుల రికార్డులో నమోదు చేయబడుతాయి. ఆవిధంగా తయారుచేసిన రికార్డును ప్రభు త్వము, రైతులు అధికారయుతమైనదిగా పరిగణించాల్సి వుంటుంది.

ప్రభుత్వంతయారుచేసిన ఈ భూమిహక్కుల రికార్డులను తహశీలు ఆఫీసులలోగాని, లేక గ్రామపట్వారీ ఆఫీసులోగాని రైతులు చూచుకోడానికి హక్కువుంటుంది. ప్రభుత్వ రికార్డు లను చూడడానికి యీక్రిందివారికి హక్కువుంటుంది. (1) ముక ద్దమాలో ఇద్దరికివున్న ఉభయపార్టీలవారు వారికి సంబంధించిన రికార్డులు చూచుకోవచ్చు. (2) వారితరపున వకాల్తా తీసు కున్న వకీలు చూడవచ్చు. (3. ప్రభుత్వ రికార్డులలో నమోదు అయిన హంశాలకు సంబంధించిన ఏ వ్యక్తిఅయినా చూడవ చ్చును. ప్రభుత్వరికార్డులను చూడడానికి ఆ ఆఫీసుకు సంబంధిం చిన పై అధికారికి ప్రభుత్వం నిర్ణయించిన దరఖాస్తుఫారంమీద ప్రభుత్వం నిర్ణయించిన స్టాంపుపైన దరఖాస్తుచేయాలి.

ప్రభుత్వరికార్డులను వెతకడానికి ప్రతిగంటకు 0-8-0 చొప్పున ఫీజు తీసుకోబడుతుంది. గంటలో భాగానికిగూడ 0-8-0 వసూలు చేయబడుతుంది.

దరఖాస్తు మంజూరిఅయితే మంజూరుఅయిన రెండురోజులలోపల ఆఫీసు పనిగంటల కాలంలో రికార్డులు చూచుకోవచ్చును. పెన్నుతో ఏవిధమైననోట్సు రికార్డులనుండి తీసుకోరాదు. పెన్సిల్‌తోమాత్రం నోట్సు తీసుకోవచ్చు.

పైనతెల్పినట్లుగానే గ్రామాధికారుల అధీనంలోవున్న గ్రామరికార్డులనుగూడ రైతులు చూచుకోవచ్చును. గ్రామరికార్డులు చూడడానికి దరఖాస్తు ఇవ్వడంగాని, ఫీజుచెల్లించడంగాని అవసరంలేదు. గ్రామస్థులు అడిగినప్పుడు ఉచితంగా పట్వారీ అవసరమైన సమాచారాన్ని ఇవ్వాల్సివుంది. లేదా రికార్డులను చూపెట్టాల్సివుంది.

18—1—50 తేదీన (అంటే 1950 కౌలుదారీచట్టం అమలులోకివచ్చేముందు) కౌలుదార్లు, వారుపండించే పంటలగూర్చి రిజిష్టరును ప్రత్యేకంగా పట్వారీలు తయారుచేయాలంటూ హైదరాబాదు ప్రభుత్వం ఒకప్రకటన గావించింది. ఆ ప్రకటనలో యిలావుంది:—

"హైదరాబాదుప్రభుత్వం రెవెన్యూడిపార్టుమెంటు.

నం. 10. తేది 18—1—50.

ప్రకటన.

1358 వ ఫసలీలో ప్యాసుచేయబడిన భూమిహక్కుల చట్టంక్రింద జారీచేయబడిన నెం. 31 నిబంధనను పురస్కరించుకొని ఏ గ్రామములోనైతే భూములరిజిష్టర్లు తయారుగావించబడ ప్రకటింపబడ్డాయో అట్టిగ్రామాలన్నింటిలో కౌలుదార్లు

వాళ్ళు పండించే పంటలగూర్చి రిజిష్టర్లను తయారుచేయాలని యిందుమూలంగా వుత్తర్వులు జారీగావిస్తున్నాను.

అట్టి రిజిష్టర్లు తయారుచేయడానికి అవసరమైన "ఫారం" యిందుతో జతపర్చడమైనది.

(సం.) భుజంగరావు,
రెవెన్యూ కార్యదర్శికిగాను ..."

పైన తెల్పిన యీ ప్రభుత్వప్రకటన ఫలితంగా యిది వరకే లాండు రికార్డులు తయారు అయివున్న గ్రామాల్లో కౌలు దార్లగూర్చిగూడ ప్రత్యేకంగా రిజిస్టర్లు తయారుచేయాల్సి వుంది. దీన్ని ఉపయోగించుకొని కౌలుదార్లందరి పేర్లను గ్రామ రికార్డులలో నమోదు చేయించడానికి అవకాశం ఏర్పడింది.

ఇవి 1358వ ఫసలీ భూమిహక్కుల రికార్డు చట్టంలోని ముఖ్యాంశాలు.

కాని ఈ చట్టాన్ని సంస్థానంలో కొలది ప్రాంతాలలో మాత్రమే అమలు జరిపారు. ఈ విషయాన్ని గూర్చి హైదరాబాదు వ్యవసాయ సంస్కరణల కమిటీ నివేదిక (1949) లో యిలా చెప్పబడీవుంది.

"1346వ ఫసలీకి చెందిన నెం. 1 చట్టంక్రింద హైదాబాదు సంస్థానంలో నేటివరకు భూమిపైవున్న సర్వహక్కుల గూర్చి హక్కులరికార్డును తయారుచేసే పద్ధతిని ప్రవేశపెట్ట బడింది. కాని అట్టిరికార్డులు తయారు గావించడంలో గాని వుంచడంలోగాని చాల స్వల్పమైన పనిమాత్రమే జరిగినట్లు

కన్పించుతుంది. మొత్తం 108 దివానీ తాలూకాలలో 19 తాలూకాలలో మాత్రమే యింతవరకు ఆ చట్టాన్ని అమలు జరపబడింది. ఈ తాలూకాలలో సహితం హిస్సా సర్వే (హిస్సాదారుల ప్రత్యేక హక్కులగూర్చి వేరువేరుగా బందోబస్తు చేయడం) యింకా పూర్తిగా లేదు. హిస్సా సర్వే పూర్తిఅయినచోట్లగూడ తరువాత భూమి మార్పిళ్లగూర్చి రిజిష్టర్లు లేవు.

ఈ విధంగా సమగ్రమైన భూమిహక్కుల రికార్డులు తయారుచేయడం, తయారు అయినచోట వాటిని సక్రమముగా వుంచడం యిటీవలవరకూ ఆచరణలోకి రాలేదు. ఇంకా యీ విషయంలో ఎంతోపని జరగాల్సివుంది. ఈ రికార్డులు తయారు అయ్యేవరకు రైతులు రైతువర్గాల్లో మెలుకవగా లేకపోతే వున్న కాస్త హక్కులుగూడా ఊడిపోతాయి. అందుచేత నేడు అమలులోవున్న చట్టాలద్వారా సంక్రమించిన కొలది హక్కులను సక్రమముగా నమోదు చేయించుకోవడంలో జాగ్రత్త పడాలి. ఇదివరకే యీ రికార్డులు తయారు అయినచోట్ల తమ కున్న హక్కులుసరిగా నమోదు అయినవో లేవో పరిశీలించి అవసరమైన ఆందోళన గావించాల్సివుంటుంది.

## (అ) జాగీరు ప్రాంతాలలో పట్టాదార్ల హక్కులు:—

1317వ ఫసలీల్యాండు రెవెన్యూచట్టంలో యివ్వబడిన పట్టాహక్కులు ఖాల్సాగ్రామాలకు మాత్రమే వర్తింపజేయ బడ్డాయని లోగడనే చెప్పాం. అయితే ఆ ల్యాండుచట్టంకు

1355లో ఒక సవరణ గావించబడింది. దానిప్రకారం జాగీరు గ్రామాలకుగూడ ఆ చట్టం వర్తింపజేయబడి పట్టాహక్కులు యివ్వబడ్డాయి. జాగీరులోని పట్టాదారులు ఎవరో నిర్వచిస్తూ ఆ సవరణలో యిలా చెప్పబడివుంది:—

'జాగీరు ప్రాంతాలలో జాగీరుదారుకు వేరుగా భూమి శిస్తు చెల్లించే బాధ్యత కలిగియున్న ప్రతివ్యక్తీ పట్టాదారుగా పరిగణింపబడుతాడు. జాగీరుదారు రికార్డులలో అట్టివ్యక్తులు భూమిశిస్తు చెల్లించేవారుగా నమోదు అయివున్నప్పటికీ లేక నమోదు కానప్పటికీ పై విధంగానే అంటే పట్టాదారుగానే పరిగణించాల్సివుంది. అంతేగాకుండా గతంలో జాగీరుదారుకు భూమిశిస్తు చెల్లిస్తూ 1348వ ఫసలీ ఆజూరు 1వ తేదీనగాని లేక ఆ తరువాతగాని జాగీరుభూమినుండి ఎవరైనా బేదఖలు చేయబడితే అట్టివారుగూడ పట్టాదారులుగానే గుర్తింపబడుతారు. (1317ఫ. ల్యాండుచట్టంకు 1355ఫ. లో తేబడిన సవరణ)

జాగీరులలో పట్టాదార్ల హక్కులగూర్చి యింకా స్పష్ట పర్చుతూ 1356 ఫసలీలో హైదరాబాదు ప్రభుత్వం. కొన్ని నిబంధనలను ప్రచురించింది. వాటిలోని ప్రధానాంశాలు యివి.

1. ఈ నిబంధనలు అమలులోకి వచ్చినప్పటినుండి జాగీరుభూములను కలిగివుండి జాగీరుదారులకు భూమిశిస్తు చెల్లించే వారంతా పట్టాదారులుగా బందోబస్తుఅయిన జాగీర్లలోనూ, బందోబస్తుకాని జాగీరులలోనూగూడ పరిగణింపబడుతారు. జాగీరుదారు జాగీరు రైతులమధ్య వ్రాతపూర్వకంగాని లేక

మూజువాణిగాగాని పైన తెల్పినవిషయానికి విరుద్ధంగా జాగీరు రికార్డులలో ఏమి వ్రాయబడివున్నప్పటికీ లేక ఒప్పందం జరిగినప్పటికీ పైన తెల్పిన సాక్ష్యం రద్దుకాదు. ఖాల్సా ప్రాంతాలలోని పట్టాదారులకుండే హక్కు బాధ్యతలే జాగీరురైతులకు గూడ వుంటాయి.

(ఖాల్సాకాని గ్రామాలలో పట్టాదారులకుండే హక్కుల గూర్చిన నిబంధనలు- రెండవ నిబంధన)

2. జాగీరుదారు స్వయంగా సాగుచేస్తున్న జాగీరు భూములకు తప్ప జాగీరులోని మరియే యితరభూములకు జాగీరుదారు లేక అతని హిస్సాదారు లేక అతని యేబంధువుపేరగాని పట్టా యివ్వరాదు. ఈ నిబంధనకు వ్యతిరేకంగా యిప్పుడు గ్రామరికార్డులలో నమోదుఅయివున్న అట్టిపట్టాలన్నింటిని రద్దుగావించాలి. ఈ నిబంధనలు అమలులోకి వచ్చేనాటికి ఆ భూములు వాస్తవంగా యెవరికబ్జాలోవున్న అట్టివారిపేర కొత్తపట్టాలు యివ్వాలి.

3. 1348 ఫసలీ ఆజూరు 1వ తేదీవరకు జాగీరుభూమి చేసుకొంటూ జాగీరుదారుకు భూమిశిస్తు చెల్లించుతూవుండి 1348 ఫసలీ ఆజూరు 1వ తేదీనగాని ఆ తరువాతగాని జాగీరుదారుచేత బేదఖలు చేయబడినట్లు ఏ వ్యక్తిఅయిన తాలూకాదారుకు నిరూపించగల్గిన అట్టివ్యక్తికి బేదఖలు చేయబడ్డ భూమిని తిరిగి పట్టాపై యిప్పించాలి. అంతేగాకుండా అంతవరకు జాగీరుదారుకు పన్నులు చెల్లిస్తూ తర్వాత కౌలుదారులుగా మార్చివేయబడిన రైతులకు (అదేభూమిలో) గూడ

పట్టాహక్కులు యివ్వవలసి వుంటుంది. ముఖ్యంగా పైన తెల్పిన తేదీ తరువాత జాగీరు వుద్యోగులు భూస్వాములు రైతుల భూములను పట్టాచేయించుకుంటే వాటిని రద్దుగావించి రైతులకే పట్టాలిప్పించే ఆందోళన లేవదీయాలి.

4. జాగీరుదారుకు నేరుగా భూమిశిస్తు చెల్లిస్తూ చెల్లిస్తూ ఏ వ్యక్తి అయిన చనిపోతే, అతని న్యాయసమ్మతమైన వారసునిపేర పట్టా యివ్వాల్సి వుంటుంది.

5. దానా, దమన, క్రయ విక్రయాలకు, వారసత్వ హక్కులకు సంబంధించిన ఖాల్సా ప్రాంతంలోని పద్ధతులు, నిబంధనలు జాగీరు ప్రాంతాలకుగూడ వర్తించుతాయి.

6. జాగీరుప్రాంతాలలోని విడుదలపెట్టిన భూములు భూఖామందులు పరారు అయినందువలన పడావుగావున్న వారి భూములు, ఏ వారసుడు లేకుండా చనిపోయినప్పుడు అట్టివారి భూములు, జాగీరులలోని అనాక్రమితభూములు— ఈ భూములన్ని ఖాల్సాగ్రామాలలోవుండు లావణీ నిబంధనలప్రకారం సాగుకివ్వబడుతాయేగాని జాగీరుదారులు వాటిని తమ స్వంత కమతాలలో కల్పుకోరాదు.

జాగీరుప్రాంతాలలో పట్టాదారుల హక్కుల గూర్చి ప్రభుత్వం జారీగావించిన నిబంధనల సారాంశంఇది. 1356 ఫసలీ తీర్ 19వ తేదీన వెలువడిన హైదరాబాదుప్రభుత్వం గెజెట్ నెం. 32 లో యీ నిబంధనలు ప్రచురించబడ్డాయి. ఈ నిబంధనల పూర్తి పాఠాన్నిగూడ ఇచ్చట పొందుపర్చుతున్నాం. ఈ నిబంధనలనువివరిస్తూ హైదరాబాదు రెవెన్యూ డిపార్టుమెంటు

18–10–1949 వ తేదీన ఒక సర్క్యులరును అన్ని జిల్లాల సివిల్ పరిపాలకులకు జారీచేసింది.

జాగీరుప్రాంతాలలో ఇటీవలవరకు అంటే 1356 వ ఫసలీవరకు జాగీరురైతులకు పట్టాహక్కులు ఏమీలేవు. ఎన్నో సంవత్సరాలనుండి భూమి సాగుచేస్తూ కబ్జా కలిగివున్నప్పటికీ అట్టిరైతులనుగూడ జాగీరుదార్లు పట్టాదారులుగా గుర్తించ లేదు. ఆవిధంగా పట్టాలు ఇవ్వడంగాని, జాగీరు రికార్డులలో వాళ్ళ భూమిహక్కులను రికార్డు చేయించడంగాని జరగలేదు. జాగీరైతులు ఉత్త కౌలుదార్లుగా మాత్రమే పడిఉన్నారు. అందుచేత యీ క్రిందయివ్వబడిన "ఖాల్సాకాని గ్రామాలలో పట్టాదారు హక్కులను ఇవ్వడాన్నిగూర్చిన నిబంధనలు" అన్న ప్రభుత్వపుచట్టాన్ని ఆధారంగాగొని జాగీరుప్రాంతాలలోని రైతుల హక్కులకోసం ఆందోళనచేయాలి.

## (ఆ) ఖాల్సాకాని గ్రామాలలో పట్టాదారు హక్కులన్ను ఇవ్వటాన్ని గూర్చిన నిబంధనలు.

జాగీర్లు, పాయగాలు మున్నగువాటిలో, వాటి రద్దుకు పూర్వమే సాగుబడివార్లకు పట్టాహక్కులను కల్గిస్తూ ప్రభుత్వం ఆర్డర్లు జారీచేసింది. జాగీర్దార్లయొక్క, వారి బంధువులయొక్క స్వంత సేద్యలకు తప్ప మిగతా అన్నిభూములకు వాటి సాగుబడి దార్లకే పట్టా ఇవ్వాలనీ, 1938 తర్వాత బేదఖలుచేయుబడ్డరైతు లకుగూడా పట్టాలుఇచ్చి, వారికే భూమినిగూడా స్వాధీనం చేయాలనీ ఈరూల్సు తెలియజేస్తున్నవి. ఈ హక్కులనుగూర్చి

రైతుసంఘ కార్యకర్తలందరూ స్పష్టంగా తెలుసుకొనగలందు లకై ప్రభుత్వహుకూల్ను పూర్తిపాఠాన్ని యిచ్చట ఇస్తున్నాం. వీటిని ఉపయోగించుకొని రైతులకు, పట్టాహక్కులు కలుగు నట్లుగా కృషిచేయగోరుచున్నాము. ఇప్పుడు జాగీర్లు రద్దుఅయి నవి గాబట్టి పట్టాలుయిచ్చు హక్కు వున్నగునవన్నీ జాగీర్ల ఎడ్మినిస్ట్రేటరుకు సంక్రమించినవి కాబట్టి వారికి దరఖాస్తులు పెట్టుకోవాలి.

—♦ నిబంధనలు, ♦—

(సన్ 1356 తీర్ 19 తేదీగల జరీగా నెం. 32 లో ప్రకటింపబడినవి.)

ల్యాండు రెవెన్యూఆక్టు సెక్షను (72) సబ్ సెక్షను (2) క్లాజులు (డి) (యం) లద్వారా తమకుగల హక్కులను ఆధారం చేసుకొని ప్రభుత్వం యీక్రింది నిబంధనలను చేయుచున్నది. ఈ జరీదాలో ప్రకటింపబడిన తేదీనుండి యివి అమలులోకి వస్తాయి. 'జాగీరు', 'జాగీర్దారు', 'ఖామందు', 'పట్టాదారు', 'భూమి', 'శిస్తు', 'స్వంతసాగుచేయు' అని ఈ నిబంధనలలో వుండేపదాలకు ల్యాండు రెవెన్యూఆక్టులోగల అర్థమేవుంటుంది. 'తహశీల్దారీ—జాగీర్', 'తాలూక్దారీ—జాగీర్', 'ఉమ్రాయిపాయిగా', 'ఉమ్రాయి—ఉజ్జమ్' అన్నపదాలకు జాగీర్ల రెవెన్యూ రికవరీ రెగ్యులేషనులోగల అర్థాలే వుంటాయి.

(2) సెటిల్మెంటు జరిగినట్టి, జరగనట్టి జాగీర్లలో యీ నిబంధనలు అమలులోనికి వచ్చునాటికి జాగీరుభూములను కలిగివుండి, జాగీర్దారుకు శిస్తు చెల్లిస్తూవుండే వ్యక్తులందరూ, వారి

స్వాధీనంలోవున్న భూములకు, పట్టాదార్లుగా పరిగణింప బడ తారు. ఖాల్సాభూములలోవున్న పట్టాదార్ల కున్నటువంటి హక్కులన్నీ, విధులన్నీ వీరికీ వుంటాయి. ఇందుకు విరుద్ధంగా జాగీర్దారునకూ, వీరికీ జరిగిన మూజువాణీ లేక వ్రాతపూర్వక ఒడంబడికలుగాని, గ్రామరికార్డులలో నమోదు చేయబడ్డ ఎటు వంటి విషయాలుగానీ వున్నా అవి చెల్ల నేరవు.

(3) 10 వ నిబంధనలో చెప్పబడ్డ అధికార్లు 2 వ నిబంధ నలో చెప్పబడ్డ భూమందులను పట్టాదార్లుగా గ్రామరికార్డులలో చేర్చుటకు, ఆ విషయాన్ని యీ నిబంధనలు అమలులోకివచ్చిన 3 నెలలలోగా వ్రాతపూర్వకముగా ఆ భూమందులకు తెలియజే యుటకు బాధ్యులుగా వున్నారు.

(4) జాగీర్దారుగాని, వాని హిస్సాదారుగాని, బంధువు గాని, వారు స్వయంగా సాగు చేసే భూములకుతప్ప ఏ యితర జాగీరుభూమికి పట్టాదార్లుగా గ్రామరికార్డులలో నమోదు చేయబడరాదు. ఇందుకు భిన్నంగా గ్రామరికార్డులలో నమో దుఅయిన పట్టాలువుంటే వాటిని రద్దుచేసి భూమిని వాస్తవంగా సాగుచేసేవారి పేర పట్టాలను నమోదుచేయాలి.

(5) తాను జాగీరుభూమిని కలిగివుంటేవాడిననీ, జాగీర్దా రుకు సూటిగా శిస్తుచెల్లిస్తూ వుండేవాడిననీ, కాని సన్ 1348 ఆజూర్ 1 వ తేదీనగానీ, ఆ తరువాతగానీ, జాగీరుదారుచే బేదఖలు చేయబడ్డాడనీ ఎవరైనా చెప్పారంటే, తాలూకాదా రుకుగనుక ఆతనిహక్కునుగూర్చి నమ్మకంగా రుజువుచేయబడితే

ఆ భూమిపట్టా ఆ వ్యక్తి పేర గ్రాంటు చేయబడాలి. ఆతడా భూమిని స్వాధీనం పొందుటకు హక్కు కలిగివుంటాడు.

(6) జాగీరుభూమికి శిస్తును సూటిగా జాగీర్దారుకు చెల్లించే ఏ వ్యక్తి అయినా, చనిపోతే న్యాయసమ్మతమైన అతనివారసుడు ఆ భూమిలో చనిపోయినవ్యక్తికి వుండే హక్కులన్నీ పొందుతాడు. పట్టా ఆ వారసుని పేర నమోదు చేయబడుతుంది.

(7) జాగీర్లలో పట్టాలకు వారసత్వమూ, పట్టాదారుల వల్ల పట్టాలమార్పిడి ఖాల్సాప్రాంతాలలోని పద్ధతులప్రకారమే శాంక్షన్ చేయబడును.

(8) అనాక్రమితభూమి, ఖామందులచేత విడుదలపెట్టబడిన భూమీ, భూఖామందులు పారిపోవడంవల్లగానీ, వారసులు లేకుండా చనిపోవడంవల్లగాని, పడావుగా వదలిపెట్టబడిన భూములుగానీ ఖాల్సాప్రాంతంలోవున్న లావునీ నిబంధనలప్రకారం, లావునీకింద వినియోగింపబడును.

**9.** ఏ జాగీరులోనైనా సర్వే సెటిల్మెంటు ప్రారంభింపబడినప్పుడు పై నిబంధనలప్రకారం భూముల సరియైన వసూల్ బాకీలను, జాగీర్దారు వుద్యోగులు సర్వే ఆఫీసరుకు యివ్వాలి. వసూల్ బాకీలో ఏదయినా ఈ నిబంధనల ప్రకారం లేనట్లు కన్పించితే ఈ విషయాన్ని సర్వేవుద్యోగి సెటిల్మెంటు కమీషనర్ ద్వారా ప్రభుత్వపు రెవెన్యూ శాఖకు అవసరమయినచర్య తీసుకొనబడుటకై తెలియజేయాలి.

**10.** ఈ నిబంధనలకు సంబంధించినంతవరకూ సన్ 1355 జాగీర్ల రెవెన్యూ రికవరీ రెగ్యులేషన్ కింద తాశీల్దారీ జాగీర్,

తాలూక్దారీ జాగీరు, హోదాదాగల వుద్యోగులను నియమించే జాగీర్లలో పట్టా హక్కులకు సంబంధించిన అన్ని సమస్యలనూ విచారించుటకు తాలూక్దారీ జాగీరుకు అధికారం వున్నది. ఈ నిర్ణయంపై అప్పీలు పై రెగ్యులేషన్ ప్రకారం రెవెన్యూ వసూలు హక్కును చలాయించే అధికారం గనుక పొంది యున్న జాగీర్దారు చేసుకోవచ్చును అప్పీలు చేసుకుంటే. జాగీర్దారు నిర్ణయమూ చేసుకొనివచో తాలూక్దారీ జాగీర్ నియమూ అంత్య నిర్ణయముగా వుండగలవు. తాశీల్దారీ జాగీర్, తాలూక్దారీ జాగీర్, హోదాదాగల అధికారులు నియమింప బడని జాగీర్లలో పై రెగ్యులేషన్ ప్రకారం రెవెన్యూ వసూలు అధికారములు గల జాగీర్దారూ జాగీరులకు అధికారములు లేనిచో ఆ జాగీరు వున్న పరిపాలనా ప్రాంతపు దివానీ తాలుక్దారు అటువంటి విషయాలను నిర్ణయించుటకు అధికారులు. జాగీర్దారుయొక్క లేక దివానీ తాలూక్దారుయొక్క నిర్ణయమే అంత్య నిర్ణయం.

11. ప్రభుత్వం అప్పుడప్పుడు జారీచేసే వుత్తరువుల ప్రకారం జాగీర్దారు, జాగీరు వుద్యోగులూ భూమిశిస్తు మాఫీ చేయటాన్నీ వాయిదా వేయటాన్నీ చేసితీరాలి.

12. జాగీర్దార్ల రెవిన్యూ రికవరీ రెగ్యులేషన్ సెక్షన్ 10 ప్రకారం ఈ నిబంధనల క్రిందకువచ్చే అన్ని విషయాల్లోనూ రివిజన్ అధికారులు (పునఃవిచారించే అధికారులు) ప్రభుత్వపు రెవిన్యూశాఖకు (మాల్గుజారీ మహకమా) వున్నవి.

13. ఈ నిబంధనలక్రింద అధికారాలు చలాయించుటకు అధికారం పొందిన జాగీర్దార్లు జాగీరు వుద్యోగులూ, లాండు రెవెన్యూ ఆక్టు 172 వ సెక్షన్ (2)వ సబ్ సెక్షన్ (డి) క్లాజు క్రిందకువచ్చే రివిన్యూ వుద్యోగులుగా పరిగణించ బడుతారు.

14. ఏ జాగీరులోనైనా సరే యీ నిబంధనల ప్రకారం అమలు జరపకపోతే ఈ నిబంధనలో చెప్పబడిన మినహాయింపుల సందర్భాలలో తప్ప యితర సందర్భాలన్నిటిలోనూ ఈ నిబంధనలక్రింద చలాయించగలిగే అధికారాలన్నిటినీ ఉప సంహరించుతుంది. అట్టి జాగీరు పరిపాలనా ప్రాంతపు దివానీ తాలూక్దారు ప్రభుత్వం అప్పుడప్పుడూ జారీచేసే వుత్తరవులకు లోబడి ఆ అధికారాలను చలాయిస్తాడు. జాగీరులోని పరిస్థితులు గనుక కోరితే ప్రభుత్వం ఆ జాగీరును తన తఖ్వీ క్రిందకు తీసుకుంటుంది.

మినహాయింపు:— 'ఉమ్రాయి పాయిగా' ఉమ్రాయి ఉజ్జాంల సందర్భంలో ప్రభుత్వం తన సిఫార్సులతో నవాబుకు ఆ కేసును పంపుతుంది.

15. ఈ నిబంధనలకు అనుగుణ్యంగాలేని వెనుకటి ఉత్తర్వులన్నీ ఇందుతో రద్దుచేయబడుచున్నవి.

## (ఇ) జాగీర్ల రద్దుచట్టం.

1358 వ ఫసలీ (1948 సం.) లో జాగీర్లను రద్దు గావించి ఖాల్సాప్రాంతాలలో కలిపేందుకు అప్పటి మిలిటరీగవర్నరు

జనరల్ చౌదరి ఒక ఉత్తర్వును (రెగ్యులేషనును) గావించాడు. దానిలోని ముఖ్యాంశాలు యివి:—

(i) ఈ రెగ్యులేషను 1358 వ ఫసలీ హైదరాబాదు (జాగీర్లరద్దు) ఉత్తర్వు అని పిలువబడుతుంది. ఇది హైదరాబాదు సంస్థానంలోని అన్ని జాగీర్లకు వర్తించు తుంది. 1358 ఫసలీ మెహెర్ 15 వ తేదీ నుంచి యీ రెగ్యులేషను అమలులోకి వచ్చింది.

(ii) జాగీరు అంటే పాయెగా, సంస్థానం, జాగీరులోని భాగం, వక్షా పూర్తిగా గ్రామము, అగ్రహారం పూర్తిగా గ్రామము వుమ్లీ, మొఖాసా (ఏటన్నిటినీ ప్రభువుగాని లేక జాగీరుదారుగాని యీనాంగా యిచ్చివుండవచ్చు) అని అర్థం. అంటే, జాగీరు రద్దు రెగ్యులేషనుపైన తెల్పిన అన్ని ప్రాంతాలకు వర్తించుతున్నమాట. అంటే జాగీరులు రద్దుగావించబడి ఖాల్సా ప్రాంతాలలో కలిపి వేయబడునట్లుగానే పాయెగా, వక్షా, అగ్రహారాలు మున్నగునవి గూడ రద్దు గావించబడి ఖాల్సా ప్రాంతాలలో కలిపివేయ బడుతాయన్నమాట.

(iii) "జాగీరు పరిపాలకుడు" అంటే యీ రెగ్యులేషను అమలు జరిపేందుకు జాగీరు పరిపాలనకు ప్రభుత్వంచేత నియమింపబడే వుద్యోగి.

ఈ రెగ్యులేషను అమలు జరిపేందుకు ప్రభుత్వం జాగీరు పరిపాలకులను, అసిస్టెంటు జాగీరు పరిపాలకులను నియమించింది.

(iv) ఈ రెగ్యులేషను అమలులోకి వచ్చాక జాగీరుదార్ల హోదా రద్దుచేయబడింది. వెనుకటి జాగీరుదార్లుగాని వారి వారసులుగాని జాగీరుదార్లుగా యికముందు పిలవబడరాదు.

(v) ఒక ప్రాంతంలోని జాగీరుల పరిపాలనను ఆ ప్రాంతంలోని జాగీరుదారులనుండి ప్రభుత్వం నియమించే జాగీరు పరిపాలకులు ఒప్పగించుకొనేందుకు ప్రభుత్వం తేదీలను ఆయాప్రాంతాలకు వేరువేరుగా ప్రకటిస్తుంది. అలా ప్రకటించిన తేదీలలో జాగీరు పరిపాలకులు, జాగీరులను స్వాధీనం గావించుకొని అందులో శిస్తువసూలు మున్నగు కార్యకలాపాలను జాగీరుదారుతో నిమిత్తం లేకుండా సాగిస్తూ వుంటారు. వెనుకటి జాగీరుదారులనుగాని వాళ్ల వుద్యోగులనుగాని ప్రభుత్వం కొన్ని ప్రదేశాలలో జాగీరు పరిపాలకులుగా నియమించడంగూడ జరిగింది. అచ్చట జాగీరుదార్లు రైతులను మోసం గావించి అన్యాయాలు గావించడానికి దారితీసింది. ఈ విధంగా జాగీరులను ప్రభుత్వనియమిత జాగీరుపరిపాలకులు స్వాధీన పర్చుకున్న తరువాత అవి క్రమేణ ఆయాజిల్లాలలో కలిపివేయబడి ఆ జిల్లా రెవెన్యూ శాఖలద్వారా పరిపాలింపబడుతున్నాయి.

(vi) ఈ విధంగా రద్దుచేయబడిన జాగీరుదార్లు తమ ప్రాంతాలలో రైతులనుండి అంతకుముందు సాంప్రదాయంగా వసూలు గావిస్తూవచ్చిన అన్ని అక్రమ పన్నులను, సెస్సులను

వసూలు చేయరాదు. అన్నిరకాల అక్రమవసూళ్లను యీ రెగ్యులేషను నిషేధించింది.

కౌలుదార్లనుండి చట్టబద్ధంగా నిర్ణయించిన కౌలురేటు తప్ప పారితోషికాలను పెచ్చుకోవడంకూడ నిషేధించబడింది.

(vii) జాగీరు పరిపాలకుడు జాగీరులో భూమిశిస్తు, ఎక్సైజుపన్ను, జంగ్లాత్ పన్నులద్వారా వసూలు గావించే మొత్తంనుండి పరిపాలన ఖర్చులక్రింద ప్రభుత్వం యీ క్రింది విధంగా తీసుకొంటుంది:—

—25,000 రూపాయలు సాలీనావచ్చే ఆదాయంకంటే ఎక్కువ రాని జాగీర్లనుండి నూటికి 25 వంతులు.

—రు 25,000/—లకు మించి ఒకలక్షరూపాయలకు మించకుండా సాలీనా ఆదాయం వచ్చే జాగీర్లనుండి నూటికి 40 వంతులు.

—ఒక లక్షకుమించి అయిదులక్షలకు మించని ఆదాయము వచ్చే జాగీర్లనుండి నూటికి 50 వంతులు.

—అయిదులక్షలుగాని అంతకుమించిగాని ఆదాయంవచ్చే జాగీర్లనుండి నూటికి $58\frac{1}{3}$ వంతులు.

పైన తెల్పిన రేట్లప్రకారం ప్రభుత్వ ఖర్చుల క్రింద మినహాయించగా మిగిలే ఆదాయాన్ని జాగీరుదార్లకు ప్రభుత్వం అప్పగించేది. జాగీరుదార్లు పోషించాల్సినవాళ్లు ఎవరైనా వుంటే వాళ్లకు పోషణ ఖర్చులక్రిందా, జాగీరుదార్లకు హిస్సా

దార్లు వుంటే వాళ్లభాగంక్రింద (హిస్సాక్రింద) మినహాయించి తతిమ్మాది జాగీరుదార్లకు అప్పగించేది.

(viii) కోర్టు నిగరానీక్రిందవున్న (కోర్టుఆఫ్‌వార్డ్సు క్రింద) జాగీర్ల విషయంలో జాగీరు పరిపాలకులు నేరుగా ప్రభుత్వ అజమాయిషీక్రింద గాకుండా కోర్టు అజమాయిషీ క్రిందనే పనిజేయాల్సివుంది.

(ix) మశీదు లేక దేవాలయాలకు సంబంధించిన జాగీరుల సందర్భంలో వాటి సాలీనా ఆదాయంలోనుండి జాగీరు పరిపాలన ఖర్చులక్రింద నూటికి పదివంతులకంటే మించి మినహాయించుకోరాదని స్పష్టపర్చబడింది.

(x) జాగీరుదార్లకు సంబంధించిన స్వంత కమతం భూములకు (సేరీఖుద్‌ఖాస్తు) యీ రెగ్యులేషను వర్తించదు. (జాగీరు స్వంతకమతం భూములంటే ఏవో జాగీరుప్రాంతాలలోని పట్టాదార్ల హక్కులగూర్చిన నిబంధనలలో నిర్వచింపబడింది. ఈ నిర్వచనాన్నిగూర్చి యింతకుముందే తెల్పాం.)

అదేవిధంగా జాగీరుదారుకు చెందిన యితర వ్యక్తిగత ఆస్తులకుగూడ యీ రెగ్యులేషను వర్తించదు.

జాగీరు పరిపాలకుడు, జాగీరుదారునిగాని లేక అతని భాగస్థునిగాని స్వంతకమతం భూములు ఏవేవో నిర్ణయించి తేల్చుతాడు.

జాగీరు స్వంతకమతంలో ఏ పరిస్థితులలోగూడ జాగీరులోని జంగ్లాతు భూమిగాని లేక బంజరుభూమిగాని చేర్చబడరాదు.

(xi) జాగీరు రద్దుకుపూర్వం జాగీరు ఉద్యోగాలు గావించుకొంటూ వున్నవారికి సాధ్యమైనంతవరకు ప్రభుత్వ వుద్యోగాలు దొరికేట్లు చూడాలి. అలా ప్రభుత్వ వుద్యోగాలు లభించని జాగీరు వుద్యోగులకు కొంత జీవన భృతిగాని లేక యితరవిధాల మనోవృత్తిగాని యివ్వాల్సివుంటుంది.

(xii) ఈ రెగ్యులేషను ఉల్లంఘించే జాగీరుదార్లకు సంవత్సరంవరకూ ఖైదు విధించవచ్చు; లేదా జుర్మానా విధించవచ్చు లేదా రెండూ కూడ విధించవచ్చు.

1358 వ ఫసలీ (జాగీర్లరద్దు) రెగ్యులేషను లోని ప్రధానాంశాలు యివి. వీటిని ఆధారంగాగొని జాగీరు పరిపాలకులు జాగీర్లను స్వాధీనం గావించుకొని పరిపాలిస్తూ వచ్చారు. ఈ జాగీర్లరద్దు ప్రధానంగా జాగీరుదార్ల రక్షణకే వుద్దేశింపబడిందిగాని రైతులరక్షణకు కాదు. 1946-48 సంవత్సరాలమధ్య నైజాంనవాబును, అతని ఫ్యూడలువ్యవస్థకు మూలస్తంభాలైన జాగీర్లు సంస్థానాలు,పాయెగాలు,మక్తాలు మున్నగు దోపిడీవ్యవస్థలన్నిటికి వ్యతిరేకంగా తెలంగాణాప్రజానీకం విప్లవపోరాటాన్ని సాగించింది. ఈ పోరాటఫలితంగా సంస్థానంలోని దోపిడీవ్యవస్థఅంతా తుడుచుకుపెట్టుకుపోయే ప్రమాదం ఏర్పడింది. ఈ ఫ్యూడలు దోపిడీగాండ్రకుచెందిన 10 లక్షల ఎకరాలను విప్లవపంథాలో తెలంగాణారైతులు పంచుకున్నారు. వెట్టిచాకిరి, అక్రమపన్నుల వసూళ్ళను మొత్తంగా బందుగావించారు. గ్రామాలలో యీ ఫ్యూడలు దోపిడిగాండ్లకు ఒక్క-

చిల్లిగవ్వగూడ వసూలుచేయ్యేస్థితి పోయింది. ఈ పరిస్థితులలో నేరుగా కేంద్రప్రభుత్వం ఆధ్వర్యముక్రింద నెలకొల్పబడిన జనరల్ చౌదరి మిలిటరీప్రభుత్వం కూలిపోతున్న జాగీరుదారీ ముఠాలకు ప్రజలను దోపిడీవ్యవస్థ రక్షణకు పూనుకొంది. చిల్లిగవ్వ వసూలుచేయడానికి చేతగాని జాగీరుదార్లకు మిలిటరీ సహాయంతో భూమిశిస్తు మున్నగు జాగీరులలోని యితరశిస్తులను వసూలుచేసిపెట్టింది. ఇంతవరకుమినహా యీ జాగీర్లరద్దు రెగ్యులేషను రైతులకు ఒరగబెట్టిందేదీ లేదు. ఈ రెగ్యులేషను రాకముందే 1317 వ ఫసలీ ల్యాండు రెవెన్యూచట్టంకు 1356 వ ఫసలీలో ఒక ముఖ్యసవరణ చేయబడింది. ఆ సవరణ ప్రకారం జాగీరుగ్రామాలలో రైతులకు భూములలోవుండే హక్కులు నిర్దుష్టంగా నిర్వచించబడ్డాయి. (ఖాల్సాకాని గ్రామాలలో పట్టాదారుల హక్కులగూర్చిన నిబంధనలు అన్నవి ఆ సవసరణ ననుసరించే ప్రభుత్వం జారీగావించింది.) కాని జాగీరు పరిపాలకులు జాగీరుదార్లకు రైతులవద్ద నోళ్ళూడగొట్టి శిస్తు వసూలు గావించడానికి అధికశ్రద్ధ కన్పర్చారేగాని ఆనిబంధనలను అమలుజరిపి జాగీరురైతులకు పట్టాహక్కులు సంక్రమింపజేయడంలో శ్రద్ధబూనలేదు. అందుచేతనే హైదరాబాదు రెవెన్యూశాఖ సహితం 1949 అక్టోబరు 18 వ తేదీన జాగీరురైతుల విషయంలో పట్టాహక్కులు కలుగజేయడంలో జాగీరు పరిపాలకులు చూపుతున్న అశ్రద్ధను గూర్చి మందలించుతూ పైనతెల్పిన నిబంధనలను అమలుపర్చ

డంలో శ్రద్ధ తీసుకోవలసిందిగా జిల్లా అధికారులందరికీ ఒక సర్క్యూలరును (1949 సంవత్సరపు సర్క్యూలరు నెం. 2) జారీ గావించింది.

జాగీర్ల రద్దు చట్టం తర్వాత జాగీరురైతులు చెల్లించేశిస్తులను నూటికి 12½ వంతులు తగ్గింపులిస్తూ (1359 ఫసలీకి) 3–10–1949 తేదీన హైదరాబాదుప్రభుత్వం ఒక వుత్తర్వు జారీ చేసింది. ఇంతకుమినహా జాగీరు రద్దువలన అధికశిస్తులు చెల్లిస్తున్న రైతులకు శిస్తుభారంగూడ తగ్గలేదు.

ఇప్పటికీ ఇంకా అన్ని జాగీరుగ్రామాలు బందోబస్తు పూర్తిఅవడంగాని, అతరాబ్ ఖాల్సాగ్రామాలలో అమలునందున్న భూమిశిస్తురేట్లకు సమానంగానైనా తగ్గించడంగాని జరుగలేదు.

1359 వ ఫసలీలో జాగీర్లరద్దుగూర్చి మరొక రెగ్యులేషను జారీచేయబడింది. దానిప్రకారం జాగీర్లుఅన్నీ పూర్తిగా ఖాల్సాప్రాంతాలలో లీనంచేయబడ్డాయి. జాగీరుదార్లకు జాగీరుపరిపాలకులు సాలీనా పన్ను వసూలుచేసిపెడుతూ వుండడం గాక జాగీరు ఆదాయాన్ని పూర్తిగా ప్రభుత్వం స్వాధీనంచేసుకొని జాగీరుదార్లకు నష్టపరిహారం యిచ్చేందుకు నిర్ణయింపబడింది. ఈ రెగ్యులేషనుప్రకారం జాగీరుదార్లకుయిచ్చే నష్టపరిహారం యీ క్రిందివిధంగా నిర్ణయింపబడింది.

(i) ముందు జాగీరుదారుకు సాలీనావచ్చే ఆదాయం ఎంతో నిర్ణయిస్తారు.

1347–1356 ఫసలీలమధ్య పదిసంవత్సరాల కాలంలో ఏటేటా జాగీరుదారుకువచ్చిన మొత్తం ఎంత ఆదాయం వచ్చిందో తెలుసుకొని యీ పదిసంవత్సరాల మొత్తంమీద సగటునవచ్చిన సాలీనా ఆదాయాన్ని నిర్ణయిస్తారు. ఈ సగటు సాలీనా ఆదాయాన్ని జాగీరుదారు సాలీనా ఆదాయంగా లెక్క కడతారు.

ఈ మొత్తం ఆదాయంలోనుండి జాగీరుపరిపాలన సాలీనా సగటుఖర్చులకింద నూటికి 60 వంతులు మినహాయింప బడుతాయి. మిగిలిన మొత్తం సాలీనా సగటు నికరఆదాయంగా పరిగణింపబడుతుంది.

జమీయత్ జాగీరులసందర్భంలో ఖర్చులకింద నూటికి 20 వంతులుమాత్రం తగ్గించి తతిమ్మాదాన్ని సాలీనా నికరఆదాయంగా గుర్తించడం జరుగుతుంది.

ఈ విధంగా నిర్ణయించిన సాలీనా సగటు ఆదాయానికి యీ క్రింద తెల్పబడిన రేట్లప్రకారం నష్టపరిహారం యివ్వబడుతుంది.

(10) 

| సాలీనా నికర ఆదాయం | ఎన్నిరెట్లు | గరిష్ట నష్టపరిహారం |
|---|---|---|
| 1. రు2000/-లు అంతకు తక్కువ | 30 | — |
| 2. రు2000/-లకు మించి రు5000/-లకు మించకుండా వున్నప్పుడు | 25 | 60,000 |
| 3. రు 5000/- లకు మించి రు 25000/-లకు మించకుండా వున్నప్పుడు | 20 | 1,25,000 |
| 4. రు 25000/-లకు మించి రు 50000/-లకు మించకుండా వున్నప్పుడు. | 17½ | 5,00,000 |
| 5. రు 50,000/-లకు మించి రు ఒకలక్షరూపాయలకు మించనప్పుడు | 15 | 8,75,000 |
| 6. ఒకలక్ష రూపాయలకు మించి 2 లక్షలకు మించకుండా వున్నప్పుడు. | 12½ | 15,00,000 |
| 7. 2 లక్షల రూపాయలకు మించనప్పుడు. | 10 | 25,00,000 |

పైన తెల్పినప్రకారం ఏమొత్తం తక్కువ మొత్తంగా వుంటే ఆ మొత్తాన్ని నష్ట పరిహారంగా నిర్ణయించడం జరుగుతుంది.

హైవిధంగా ప్రతి జాగీరుదారుకు చెల్లించాల్సిన నష్ట పరిహారాన్ని ప్రభుత్వం తేల్చుతుంది. ఈ పరిహారాన్ని యీ క్రింది తెల్పిన వాయిదాల ప్రకారం చెల్లించుతుంది.

(i) ఒకలక్ష గాని అంతకు తక్కువ గాని నష్టపరిహారాన్ని ప్రభుత్వం జాగీరుదార్లకు యివ్వాల్సివచ్చిన సందర్భాలలో పది సమాన సాంవత్సరిక వాయిదాలలో ప్రభుత్వం చెల్లించుతుంది.

(ii) ఒక లక్ష రూపాయలుగాని అంతకు తక్కువ గాని సాలీనా మొత్తం ఆదాయం (నికర ఆదాయంకాదు) వచ్చే జాగీరుదార్ల విషయాలలో వాళ్లకు చెల్లించాల్సిన నష్టపరిహారం మొత్తాన్ని పది హేను సమాన సాంవత్సరిక వాయిదాలలో చెల్లించుతుంది.

(iii) ఒక లక్షకునుంచి సాలీనా మొత్తం ఆదాయం కల్గిన జాగీరుదార్లకు వాళ్లకు చెల్లించాల్సిన మొత్తం నష్ట పరిహారాన్ని ఇరవై సమానసాలీనా వాయిదాలలో చెల్లించు తుంది.

ఈ విధంగా మొత్తం జాగీరుదార్లకు, యితర ప్యూడలు దోపిడీగాండ్రకు ప్రభుత్వం నష్టపరిహారంక్రింద ప్రతి ఏటా ఒక కోటి 15లక్షల రూపాయల ముడుపు చెల్లించుకోవాలి. ఈ విధంగా జాగీరుదార్ల రద్దుఅన్న బూటకపు సంస్కరణద్వారా రైతులు చెల్లి చే పన్నులనుండి ప్రతిసంవత్సరం జాగీరుదార్లు మున్నగు ఫ్యూడలు దోపిడీగాండ్రకు హైదరాబాదు ప్రభుత్వం కోటిరూపాయలకు పై చిల్లర చెల్లించుతోంది. 1949 అక్టోబరు నుండి యీ ముడుపు చెల్లించడం ప్రారంభమైంది.

## (అ) 1950 వ సంవత్సరపు హైదరాబాదు కౌలుదార్ల మరియు వ్యవసాయభూముల చట్టం — దానిలోని ప్రధాన హంశాలు.

1317 వ ఫసలీ ల్యాండు రెవెన్యూ చట్టం 1354 వ ఫసలీ ఆసామీ సిక్మీ చట్టం, 1356 వ ఫసలీ జాగీర్దారి రైతుల హక్కుల చట్టం, 1358 వ ఫసలీ భూములహక్కుల రికార్డు చట్టం— యీ చట్టాలవలన ఫ్యూడలు భూసంబంధాలు తొలగడంగాని, కౌలుదార్లకు పూర్తిగా రక్షణ ఏర్పడడంగాని, జాగీర్దారి రైతులు విముక్తి పొందడంగాని జరగలేదు. హద్దూపద్దూ లేకుండా జరిగే ఫ్యూడలు దోపిడీకి కొన్ని హద్దులుమాత్రం రైతుల వత్తిడి, పోరాటాల ఫలితంగా ఏర్పడ్డాయి; కొన్ని స్వల్పమైనహక్కులు భూఖామందులకు వచ్చాయి. వాటినిగూడ ఆచరణలో నైజాంప్రభుత్వం లంచగొండి ఉద్యోగులు, భూస్వాములు అయిన పటేలు పట్వారీలు, రైతులుఅనుభవించకుండా చాలవరకు వమ్ముగావించారు. అందుచేత పైనతెల్పిన భూమిచట్టాలు గావించబడ్డా, సంస్థానం రైతాంగం స్థితిగతులు బాగుపడలేదు; భూమిసంబంధాలలో రైతులకు అనుకూలంగా ప్రధానమార్పులు కలగలేదు. అందుచేత సంస్థానంలో ప్రధానంగా తెలంగాణాఅంతటా రైతులు నైజాం ఫ్యూడలు ప్రభుత్వానికి జాగీర్దార్లు, దేశముఖులు, మున్నగు ఫ్యూడలు భూస్వాములకు వ్యతిరేకంగా దున్నేవానికే భూమిహక్కును సాధించేందుకు పెద్దయెత్తున గత ఆరుఏండ్లుగా విప్లవపోరాటాన్ని సాగించాల్సివచ్చింది. ఈ పోరాటంద్వారా

నైజాంసంస్థానంలోని ఫ్యూడలువ్యవస్థ అంతా కదిలిపోయింది. విప్లవపంథాలో 10 లక్షల ఎకరాలను దున్నేరైతులకు పంచి పెట్టడం జరిగింది.

కాని కూలిపోయిన నైజాం ఫ్యూడలువ్యవస్థను విప్లవ రైతాంగం తాపులనుండి రక్షించేందుకు సంస్థానంలో కాంగ్రెసు సైన్యాలు వచ్చిపడ్డాయి. విప్లవరైతాంగం నైజాంనవాబుకు, ఫ్యూడలు భూస్వాములకు వ్యతిరేకంగా సాధించిన విజయాలను స్థిరపర్చడానికిబదులు వాటిపై అతిదారుణంగా కాంగ్రెసు ప్రభుత్వం దాడిగావించింది. రైతాంగం పంచుకున్న భూములను భూస్వాములకు తిరిగి యిప్పించింది. సాగుభూములనుండి రైతులను అనేక సాకులతో బేదఖలుచేయడానికి అవకాశాన్ని కలుగజేసింది. అయినా రైతాంగం తలఒగ్గకపోవుటవలన రైతాంగంలో కొంతభాగాన్నైనా తనవైపుకు త్రిప్పుకొనే వుద్దేశ్యంతోనూ, వారిలోవారికి తగాదాలుపెట్టి రైతాంగపోరాట ఐక్యతను విచ్ఛిన్నం గావించేందుకు 1950 వ సంవత్సరంలో ఒకచట్టాన్ని హైదరాబాదుప్రభుత్వం గొనివచ్చింది. దానిపేరే "1950 సంవత్సరపు కౌలుదార్ల మరియు వ్యవసాయ భూములచట్టం" అంటారు. 1951 లో ఈ చట్టాన్ని రెండుదఫాలు సవరించారు. ఈ సవరించినచట్టమే నేడు హైదరాబాదు సంస్థానంలో అమలులోవుంది. ఈ చట్టం అమలులోకి రావడం ఫలితంగా అంతకుముందున్న 1354 వ ఫసలీ ఆసామీ సిక్మీస్ చట్టం, హైదరాబాదు సంస్థానపు వ్యవసాయభూముల అన్యాక్రాంతాల నివారణచట్టం రద్దుఅయిపోయాయి. అయితే. ఆ

చట్టాలద్వారా రైతులకు లభించినహక్కులు, సౌకర్యాలును నేడు అమలులోవున్న కౌలుదార్లచట్టానికి విరుద్ధంగా లేనంత వరకు భంగపర్చడానికి వీలులేదు నేడు వ్యవసాయభూములకు కౌలుదార్లకు సంబంధించినంతవరకు యీ చట్టమే అమలులో వుంది. అందుచేత దీనిలోని ప్రధానాంశాలను తీసికొని జాగ్రత్తగా పరిశీలించుదాం.

ఈ చట్టంలో గత చట్టాలలో లేని కొన్ని కొత్త విషయాలు చేర్చబడ్డాయి. ముఖ్యంగా చట్టం నిర్వచనాలకూర్చిన సెక్షను పరిశీలిస్తే యీ విషయం బోధపడుతుంది. ఈ కొత్త విషయాలన్ని 1949 లో ప్రకటించబడిన హైదరాబాదు వ్యవసాయసంస్కరణాల కమిటీ నివేదికలో గావించబడిన సిఫార్సులను పురస్కరించుకొని అదనంగా చేర్చబడ్డాయి. వాటినిగూర్చి క్లుప్తంగా ముందు తెలుసుకుందాం.

(i) 'వ్యవసాయం' అంటే లోగడ ఆసామీ సిక్మీ చట్టంలోవున్న నిర్వచనంకు "గడ్డిపెంచడం" అన్నదాన్నిగూడ యీ చట్టంలో జేర్చబడింది. దీనఫలితంగా భూస్వాముల 'కంచెలు' గూడ వ్యవసాయభూములుగా పరిగణింపబడడానికి అవకాశం ఏర్పడింది. ఈ చట్టాన్ని 'కంచెలు' కుగూడ వర్తింపజేయడానికి అవకాశం కల్గిందన్నమాట.

(ii) అదేవిధంగా 'వ్యవసాయభూములు' అన్న నిర్వచనంలో మరో రెండుహంశాలనుగూడ అదనంగా జేర్చడం జరిగింది. అవియేమంటే (1) పడావుభూములు; (2) వ్యవసాయదారులు, వ్యవసాయకూలీలు, లేక వృత్తిపనివారల్లు స్వాధీనంలో

వున్న నివేశనస్థలాలు, గృహాలు— వీటినిగూడ వ్యవసాయభూములుగా పరిగణించడంవలన, భూస్వాములు పడావుగావుంచిన భూములు, వ్యవసాయకూలీలుగాని లేక గుత్తదారులుగాని ఆక్రమించుకొనివున్న భూస్వాములకుచెందిన నివేశనస్థలాలు గృహాలు, యీ చట్టముక్రిందకు వస్తాయి.

(iii) 'స్వంతంగా వ్యవసాయంచేయడం' అన్న నిర్వచనంలో ఒక ముఖ్యమార్పు చేయబడింది. 1354 ఆసామీ సిక్మీస్ చట్టప్రకారం పాలేళ్ళను పెట్టుకొని వ్యవసాయం చేయడం స్వంతవ్యవసాయంగా పరిగణించబడింది. ఈ అవకాశాన్ని తీసుకొని భూస్వాములు చాలమంది పాలు పద్ధతిపై కౌలుకుగావించేవారినందరినీ జీతగాండ్రుగా రికార్డులలో నమోదుచేయించుకొని ఆసామీ సిక్మీసు చట్టాన్ని ఆ మేరకు అమలుజరగకుండా చేశారు. ఈ విషయాన్ని 1949 వ్యవసాయ సంస్కరణలకమిటీ ఎత్తిచూపి ఈ లోపాన్ని ముందు అమలుజరుపబోయే కౌలుదార్లశాసనంలో తొలగించాలని తన సిఫార్సులతో సూచించింది. దీన్ని ఆధారంగాగొని ప్రస్తుత కౌలుదార్లశాసనంలో "నగదురూపంలోగాని, లేక ధాన్యరూపంలోగాని జీతముఇచ్చి పెట్టుకొనే జీతగాండ్రు" అని నిర్వచనాన్ని స్పష్టపర్చడం జరిగింది. దీనిఫలితంగా పాలుపద్ధతిపై వున్న కౌలుదార్లను జీతగాండ్రుగా, భూస్వాములు చూపెట్టి కౌలుభూములను స్వంతకమతాలుగా రికార్డు చేయించుకోడానికి గతంలోవలె అవకాశం లేదు.

వీటితో రైతులకు నష్టదాయకమైన కొన్ని మార్పిళ్లు గూడ జరిగాయి. వాటినిగూర్చి ఆయాసందర్భాలలో చర్చించడం జరుగుతుంది.

చట్టంలో ముఖ్య ఏర్పాట్లను పరిశీలిద్దాం ముందు కౌలుదార్లు రక్షిత కౌలుదార్లగూర్చి ఆలోచిద్దాం.

కౌలుదార్లు:— ఆసామీ సిక్మీఅంటే ఎవరో యింతకు ముందు ఒక నిర్వచనంవుంది. 1358 ఫసలీ భూమిహక్కుల రికార్డుచట్టం ప్రథమ పర్యాయంగా ఆ నిర్వచనాన్ని గావించింది. ఆ చట్టంప్రకారం ఆసామి సిక్మీఅంటే యివ్వబడిన నిర్వచనం ఏమిటో లోగడ తెల్పాం. ఇప్పుడు అమలులోవున్న 1950 కౌలుదారీ శాసనంక్రింద కౌలుదారుఅంటే ఎవరో చూద్దాం.

'ఒకవ్యక్తి మరోకవ్యక్తికి చెందిన భూమిని చట్టబద్ధంగా సాగుచేస్తూంటే అట్టివ్యక్తి కౌలుదారుగా పరిగణించ బడుతాడు. అయితే అట్టివ్యక్తి సాగుచేసేభూమి దాని భూఖామందు స్వంత సేద్యంక్రింద వుండదు. అట్టివ్యక్తి భూఖామందు కుటుంబంలో ఒక సభ్యుడుగా గాని లేక భూస్వామి స్వంత తనిఖీక్రిందనో లేక అతని కుటుంబంలోని మరియే యితరసభ్యుని పర్యవేక్షణక్రిందనో ఆ భూమిని నగదురూపంలోగాని లేక లేక ధాన్యంరూపంలోగాని జీతం తీసుకుని సాగుజేసే జీతగానిగా గాని లేక కూలిపనిచేసే కూలిగాగాని లేక స్వాధీనపు తనఖాదారుగాగాని సాగుచేస్తూవుండే వ్యక్తిగా వుండరాదు అంతే గాకుండా ఈ చట్టం అమలులోకి వచ్చినతరువాత ఒక

సంవత్సరకాలంలో భూస్వామి పెట్టకున్న దరఖాస్తుపై ఆ ప్రాంతపు తహశీలుదారు అట్టివ్యక్తిని కౌలుదారు కాదని ప్రకటించి వుండి, ఆ ప్రకటన అప్పీలులో మార్చబడకుండా అమలులో వున్నప్పుడుగాని లేక తహశీలుదారు అట్టివ్యక్తిని కౌలుదారు కాదని ప్రకటించ నిరాకరించినప్పుడు అప్పీలులో తహశీలుదారు తీర్పును త్రోసిపుచ్చినప్పుడు గాని అట్టి వ్యక్తి కౌలుదారుగా పరిగణింపబడడానికి వీలులేదు. (1950 కౌలుదార్లీ మరియు వ్యవసాయదారులచట్టం సెక్షను 5)

1951 జూన్ నెలలో ఈ నిర్వచనానికి యింకో భాగాన్ని చేర్చడం జరిగింది. 1951 కౌలుదార్లు మరియు వ్యవసాయభూముల (రెండవ సవరణ) చట్టం అమలులోకి వచ్చే నాటికి (అంటే 1951 జూన్ 30వ తేదినాటికి) ఒక ఉపకౌలుదారు (సబ్ టెనెంటు) మరొకరికి చెందిన భూమిని సాగుచేస్తూ వుంటే అతన్నిగూడ కౌలుదారువలెనే చట్టసమ్మతంగా సాగు చేస్తున్నట్లుగా పరిగణించాల్సి వుంటుంది. సబ్ టెనెంట్సు వుండరాదని యింతకుముందు ఏదైనాచట్టం అమలులో వున్నప్పటికీ అట్టి చట్టం ఈ సందర్భంలో వర్తించదు.

ఆసామీ సిక్మిస్ చట్టంప్రకారం వ్రాతపూర్వకంగాగాని మూజువాణీగా గాని జరిగిన ఒడంబడికద్వారా భూమిని కౌలుకు తీసుకున్నవారు అందరూ ఆసామీ సిక్మీలు అన్న పూర్వపు నిర్వచనంకంటె యీ చట్టంలో యిచ్చిన నిర్వచనం స్పష్టంగావుంది. అయితే ఈ నిర్వచనంప్రకారం స్వాధీనపు తనఖాపొందినవారు.

కౌలుదార్లుగా గుర్తింపబడరు. ఆసామీ సిక్మీస్ చట్టంప్రకారం స్వాధీనపు తనఖా పొందినవారుగూడ కౌలుదార్ల క్రిందకు వస్తారు. మరొకమార్పు ఏమంటే సబ్ టెనెంటుగూడ యీ చట్టంప్రకారం కౌలుదారుగా గుర్తింపబడుతారు. కాని ఆసామిసిక్మీస్ చట్టంలో అదిలేదు. ఇంకోమార్పు ఏమంటే తనక్రింద కౌలుదారు అవునాకాదా అన్న విషయాల్ని తేల్చ డానికి భూస్వామికి యీచట్టంప్రకారం చట్టం అమలులోకి వచ్చినప్పటినుండి ఒక సంవత్సరం గడవు యివ్వబడింది. ఈ సం వత్సరం లోపలనే కౌలుదారుకాదని దరఖాస్తు పెట్టుకోవాలి. ఆ గడవుదాటితే కౌలుదారు కాదని భూస్వామి అభ్యంతరం పెట్టడానికి అవకాశంలేదు. దీని అర్థం 1951 జూన్ 30వ తేదీ లోపల కౌలుదారు కాదని భూస్వామి అభ్యంతర పెట్టకపోతే అతనిభూమిని సాగుచేస్తూ కౌలుదారు నిర్వచనంక్రిందికి వచ్చే వారు అందరూ కవులుదార్లుగా పరిగణింపబడుతారు. అంటే యిప్పటికీ కౌలుదార్లుగా వున్నవారందరూ కౌలుదార్లుగా గుర్తింపబడవలసి వుందన్నమాట. వీరు కౌలుదారుకాదని భూ స్వామి అభ్యంతరం పెట్టడానికి వీలులేదు. వీరిని చట్టం అమలు లోకి వచ్చినప్పటినుండి 10 ఏండ్లవరకూ కబ్జానుండి తొలగించ రాదు.

ఇక భూఖామందులు తమ భూములను కౌలుకు యిచ్చు కోవడంగూర్చి పరిశీలిద్దాం. నేటిచట్టం 6వ సెక్షనుప్రకారం చట్టం అమలులోకి వచ్చాక మూడు ఏండ్లవరకుమాత్రమే కౌళ్లకు యిచ్చుకోవడం అనుమతింపబడింది. ఆ తరువాత అసలు

కౌలుకు యివ్వరాదు. (కొన్ని మినహాయింపులు మాత్రం వున్నాయి. వాటిగూర్చి తరువాత తెల్పుతాం) ఈ విషయాన్ని గూర్చి చట్టంలో యిలా చెప్పబడివుంది.

ఈ చట్టం అమలులోనికి వచ్చినప్పటినుండి మూడు సం॥లు పూర్తిఅయిన తరువాత సెక్షన్ 7లో వివరించినప్రకారం తప్ప ఏ భూమిని ఎంతకాలం వరకైనాగాని కౌలుకు యివ్వరాదు; ఏ భూమిమీద కౌలు పద్ధతి వుండరాదు. (సెక్షన్ 6)

పైన తెల్పిన మినహాయింపులకు సంబంధించి, దే సెక్షన్ 7 దానిప్రకారం యీ క్రింది పేర్కొనబడినవారు మాత్రమే కౌళ్లకివ్వుకోవచ్చు.

(1) మైనరుగాని లేక స్త్రీగాని,
(2) శారీరక లేక మానసిక దౌర్బల్యంవలన శాశ్వతంగా స్వంత సాగు చేసుకోజాలని వారు,
(3) భారతదేశపు భూసైన్యం, నావికా, విమానదళాలలో పని జేస్తున్నవారు.
(4) ఏదైన తగినకారణ ఫలితంగా తాత్కాలికంగా భూమిని సాగుచేసుకోడానికి అవకాశంలేని వాళ్లు.

వీరు తాలూకావారు (జిల్లాకలెక్టరు) అనుమతితో ఆయన నిర్ణయించిన కాలంవరకూ తమభూములను కౌలుకివ్వుకోవచ్చును.

అయితే ఒకరికంటే మించిగాని అంతకన్నా ఎక్కువమంది గాని జాయింటుగా భూమిని కల్గివున్న సందర్భంలో వారిలో ఎవరైనాఒకరు పైనతెల్పిన ఏ మినహాయింపు క్రిందకు రాని

ట్లయిన అట్టివారికి పైన తెల్పిన మినహాయింపులు వర్తించవు. అంతేగాకుండా పైనతెల్పిన మినహాయింపుక్రింద కౌలుకిచ్చు కున్న భూఖామందు తాలూకాదారు నిర్ణయించిన కౌలు కాలం ముగియకనుందే చచ్చిపోయినట్లయిన, అతని వారసునికి పైన తెల్పిన మినహాయింపులు వర్తించక పోయినట్లయిన ఆ వారసుడు కౌలుకిచ్చుకోడానికి వీలులేదు. స్వయంగా సాగు చేయాలి. (సెక్షన్ 7)

మూడు సంవత్సరాలలోపల యివ్వబడ్డ కౌళ్లు కాలంగూడ పది సంవత్సరాలకు తక్కువ వుండరాదు. భూఖామందుకు కౌలుదారుకు మధ్య పదియేండ్ల కాలానికి ఎక్కువ వుండాలనిగాని లేక తక్కువవుండాలనిగాని ఏదైనా షరతు వున్నప్పటికీ అది చెల్లనేరదు. కాబట్టి చట్టం అమలు వచ్చాక మూడుయేండ్ల లోపల యివ్వబడే ప్రతికౌలు 10ఏండ్ల కాలంకు తక్కువ వుండరాదన్నమాట అంటే చట్టం అమలుకు వచ్చాక నూతనంగా కౌలుకు తీసుకున్నవారిని ఎవరినీ 10ఏండ్ల లోపల బేదఖలీ చేయగూడదన్నమాట.

అయితే యిందుకు ఒక ముఖ్యమైన మినహాయింపువుంది. కౌళ్లకు యిచ్చుకోవడానికి అవకాశమున్నవారినిగూర్చి పైన తెల్పాం. అందులో నాలుగో మినహాయింపు క్రిందకువచ్చే భూఖామందులు తాలూకాదారు అనుమతితో తాలూకా దారు నిర్ణయించిన కాలంకు లోబడి పదేళ్లకు తక్కువకాలం కౌలుకిచ్చుకోవచ్చును. దీనివలన పెద్ద భూస్వాములందరూ తాలూకాదారునిపై తమ పలుకుబడి ప్రయోగించి తక్కువ

కాలంకు కౌలుకిచ్చుకోవడం తరుచు కౌలుదార్లను మార్చుతూ వుండడం జరిగేప్రమాదంవుంది. అలా జరిగిన సందర్భాలుగూడ అనేకం వున్నాయి. అవి జరగకుండా ఆందోళన గావించాలి.

పైనతెల్పిన ప్రకారంగాక చట్టానికి విరుద్ధంగా అంటే సెక్షన్ 6 కు విరుద్ధంగా ఇవ్వబడేకౌళ్లను ప్రభుత్వం గుర్తించదు. సెక్షన్ 7, 8 ప్రకారం ఇవ్వబడే కౌళ్ళుఅన్నీ రిజిష్టర్డు పత్రాలమీద వ్రాసుకోవాల్సి వుంటుంది.

## ——♦ రక్షిత కౌలుదార్లు. ♦——

ఈ చట్టంప్రకారం రక్షితకౌలుదార్లుగా యీ క్రింద పేర్కొనబడినవారు పరిగణింపబడుతారు:—

**1.** **1342–1352** ఫసలీల (**1932–1942** సం.) మధ్యకాలంలో ఆరుఏండ్లకు తక్కువగాకుండా కబ్జాకాలం వున్నవారు.

**2.** **1947** జనవరి **1** వ తేదీనుండి వెనుకకు లెక్కించినప్పుడు వరుసగా ఆరుసంవత్సరాలకు తక్కువలేకుండా కబ్జావున్నవారు. అంటే **1941** వ సంవత్సరం జనవరి **1** వ తేదీనుండి **1947** జనవరి **1** తేదీవరకు వరుసగా కౌలుకు చేస్తున్నవారు.

**3.** **1943** అక్టోబరు **6** వ తేదీ తరువాత యీ చట్టం అమలులోకి వచ్చేనాటికి మధ్యకాలంలో ఆరుసంవత్సరాలుకు తక్కువగాకుండా కబ్జావున్నవారు. అంటే **1943** అక్టోబరు **6** వ తేదీనుండి **1950** జూన్ **30** వ తేదీ మధ్యకాలంలో వరుసగా ఆరుఏండ్లు కబ్జావున్నవారు.

పైనతెల్పినవాటి సారాంశం ఏమంటే, నేడు కబ్జావున్నా, లేకపోయినా చట్టంఅములులోకి రాకపూర్వం ఒక సంవత్సరంవరకూ అంటే 1949జూన్ 30వ తేదీవరకు కౌలుభూములుగావున్న భూములపైననే కౌలుదార్లకు "రక్షితకౌలుదారుహక్కు" లభిస్తుంది. అంతకుముందుగాని, ఆ తరువాత గాని స్వంతకమతంవే రుతో వ్యవహరింపబడుతూవుండే భూములపై రక్షితకౌలుదారు హక్కు లభించదన్నమాట. ఇక వివరాల్లోకిపోయి పరిశీలిద్దాం.

(i) రక్షితకౌలుదారుగా పరిగణించడానికి ఆరుసంవత్సరాల కబ్జాకాలాన్ని ఎంచడానికి 1354 ఫసలీ ఆసామీ సిక్మీస్ చట్టంలో ఏ వివరణఅయితే ఇవ్వబడిందో అదేవివరణ ఈ చట్టంలో గూడ ఇవ్వబడింది. చట్టంలో 6 సంవత్సరాల కబ్జాకాలాన్ని ఎంచడానికి నిర్ణయించిన మూడురకాల కాలాలలో ఏ ఒకకాలం యొక్క అంత్యతేదీనాడైనా భూఖామందునుండి నేరుగా కౌలుకుచేస్తూవుండడంగాకుండా వారసుడుగా కౌలుకుచేస్తున్నట్లయిన ఏ వారసునినుండి కౌలుపొలాన్ని అలా పొందాడో ఆ వారసుని కబ్జాకాలాన్నిగూడ లెక్కలోకి తీసుకోవాలి. అదేవిధంగా తను కౌలుదారుగా ఏ భూస్వామిక్రింద వున్నాడో అదే భూస్వామి తాలూకు మరియితర ఏభూమినైనా పైనతెల్పిన కౌలుకాలంలో కౌలుకు చేసివుంటే ఆ కౌలుకాలాన్నిగూడ లెక్కలోకితీసుకోవాలి. ఆవిధంగా లెక్కలోకితీసుకొనే అతనికి 6 ఏండ్లకు తక్కువ లేకుండా వరసగా కబ్జాకాలం వుందా లేదా అని నిర్ధారణ చేయాలి.

(ii) ఒకరికంటే ఎక్కువమంది ఒకేభూమికి రక్షితకౌలుదార్లమంటూ వాదనలు తీసుకొచ్చినప్పుడు ఎవరిని రక్షితకౌలుదార్లుగా పరిగణించాలి అన్నప్రశ్న వుదయిస్తుంది. అలాంటిసందర్భంలో ఈ క్రింది క్రమప్రకారం పరిశీలించాలని చట్టంలో చెప్పబడింది:—

1342–1352 ఫసలీల మధ్యకాలంలో వరుసగా 6 సంవత్సరాలు కబ్జా వుందా లేదా అన్నవిషయాన్ని ముందు పరిశీలించాలి. అలావున్నట్లయితే అట్టివారికి ప్రాధాన్యతయిచ్చి రక్షిత కౌలుదార్లుగా పరిగణించాలి. ఇలాంటివారు ఎవరూ లేకపోతే 1947 వ సంవత్సరం జనవరి 1 వ తేదీకి వెనుకనుంచి వరుసగా 6 సంవత్సరాలు కబ్జావున్నవారు ఎవరైనా వున్నారా లేదా అని చూచి వాళ్లను రక్షితకౌలుదార్లుగా ఎంచాలి. ఈ విధంగా ఎవరు రక్షితకౌలుదార్లు అని తేల్చేందుకు చట్టం అమలులోకి వచ్చాక ఒక సంవత్సరంలోపల భూఖామందు తహశీలుదారుకు దరఖాస్తు చేయవచ్చు. అదేవిధంగా భూఖామందు తహశీలుదారుకు కౌలుదారు రక్షితకౌలుదారు కాడనికూడ ప్రకటించమనికోరుతూ, పైన తెల్పిన నియమితకాలంలో దరఖాస్తు చేసుకోవాలి.

(iii) పైనతెల్పినవిధంగా, ఏదోరకంగా 6 సంవత్సరాలు వరుసగా కబ్జావున్నప్పటికీ యీ దిగువ పేర్కొన్న కారణాల ఫలితంగా ఈచట్టం అమలులోకివచ్చే సమయానికిగనుక భూమి నుండి బేదఖలి చేయబడివుంటే అలాంటివాళ్లను రక్షితకౌలుదారుగా పరిగణించడానికి వీలుండదు.

1. కోర్టు డిక్రీవలననో లేక అలాంటిదే మరో ప్రభుత్వ డిక్రీవలననో బేదఖలీ చేయబడివున్నప్పుడు లేదా,

2. ఈచట్టం అమలులోకి రావడానికి కనీసం ఒక సంవత్సరంముందు భూఖామందు చేత స్వంతసాగు చేసుకొనే వుద్దేశ్యంతో బేదఖలుచేయబడి, అట్టిభూమిని భూఖామందు స్వయంగాసాగుచేస్తున్నప్పుడు (అంటే 1949 జూన్ 10 వ తేదీనాటికే కౌలుదారును బేదఖలీగావించి భూఖామందు స్వంతసాగు చేస్తున్నప్పుడు అనిఅర్థం.) లేదా,

3. అట్టిభూమిపై భూఖామందు ఏదైనా శాశ్వితకట్టడాన్ని కటినప్పుడు లేదా,

4. అట్టిభూమిని భూఖామందు శాశ్వితంగా వ్యవసాయేతర కార్యాలకు మళ్ళించినప్పుడు,

5. భూఖామందు కౌలుదారునుంచి అతని హక్కులను వదులుకున్నట్లు దస్తావేజు వ్రాయించుకొని వున్నట్లయిన, కౌలుదారు రక్షితకౌలుదారుహక్కును పోగొట్టుకుంటాడు. ఇట్టిసందర్భాలలో, భూస్వామి అప్పుకునేసందర్భంలో 2 సంవత్సరాల గడువుగూడ కౌలుదారుకు దొరకదు.

ఈ సందర్భాలలో కౌలుదార్లను రక్షితకౌలుదార్లుగా పరిగణించడానికి వీలుండదు.

రక్షితకౌలుదారుగా పరిగణింపబడడానికి అన్ని అవకాశాలు వున్న కౌలుదారు, చట్టం అమలుకు వచ్చేనాటికి, కబ్జాలో లేకుండా వున్నప్పుడు, తనకు లోగడ కబ్జావున్న భూమిని తిరిగి పొందడానికి అవకాశంవుంది. అట్టిభూమిని సాగుచేసేందుకు

తాను ఇష్టపడుతున్నానని భూఖామందుకు చట్టం అమలులోకి వచ్చాక ఆరునెలలలోపల వ్రాతపూర్వకంగా యిందుకుగాను నోటీసు ఇవ్వాల్సివుంది. 1951 మార్చి 31 వ తేదీలోపల భూఖామందు అందుకు ఎలాంటిఅభ్యంతరం పెట్టకపోతే ఆ తేదీనాటికి భూఖామందునుండి అట్టిభూమిని కౌలుదారు, తహశీలుదారుకు దరఖాస్తుచేసి తిరిగి స్వాధీనపర్చుకోడానికి కౌలుదారు అర్హత కల్గివున్నాడు.

చట్టం అమలులోకివచ్చాక ఒక సంవత్సరంలోపుగా భూఖామందుగాని లేక రక్షితకౌలుదారుగాని లేక మరోవ్యక్తి గాని తనకు హక్కువున్నదని దరఖాస్తుచేసి వుండకపోతే, చట్టం అమలుతేదీనాటికి కబ్జాలోవున్న కౌలుదారే అతనికి ఆరుసంవత్సరాల కబ్జావున్నా- లేకపోయినా రక్షితకౌలుదారు అవుతాడు.

(IV) చట్టంప్రకారం రక్షితకౌలుదారును బేదఖలీ గావించేందుకు భూఖామందుకున్న హక్కులు:—

చట్టం 44 వ శెక్షనుప్రకారం స్వంతంగా సాగుచేసుకొనే వుద్దేశ్యంతో భూఖామందు యీ చట్టం అమలులోకివచ్చాక ఎప్పుడైనాగాని రక్షితకవులుదారును బేదఖలీ చేయవచ్చును. అయితే తాను స్వయంగా సాగుచేసుకోదలిచాననీ, అందుచేత భూమి ఖాళీ చేయమనేముందుగా ఒకసంవత్సరం వ్యవధితో తహశీలుదారుద్వారా కబ్జాపైవున్న కవులుదారుకు నోటీసు ఇవ్వాల్సివుంటుంది. అలా నోటీసు యివ్వకుండా తహశీలుదారు

అనుమతిలేకుండా తానే స్వయంగా యే భూస్వామి బేదఖలీ చేయడానికి పూనుకోవడానికి వీలులేదు.

ఆసామీ సిక్మీస్ చట్టంలో స్వయంగా సాగుచేయడం అంటే ఏవిధంగా నిర్వచింపబడిందో యీ చట్టంలోగూడ అదే విధంగా నిర్వచింపబడింది. ('పాలేరు' అన్న నిర్వచనంలోవున్న భేదంతప్ప—యీ భేదం ఏమిటో లోగడే తెల్పబడింది.)

అయితే 50 ఎకరాల తరి మరియు 250 ఎకరాల చెలక భూమికి మించిన స్వంతసాగుభూమి వున్న భూఖామందు అలా బేదఖలీకి పూనుకోడానికి అర్హతకల్గియుండడు. అంతకులోపు ఆస్థివున్నవారు మాత్రమే స్వంతసాగు చేసుకొనే వుద్దేశ్యంతో కౌలుదార్లను బేదఖలీ చేయడానికి అర్హులు అయితే యిచ్చట గూడ బేదఖలీ చేయగా సంక్రమించే భూమీ అంతకుముందు స్వంత సాగుచేస్తున్న భూమి మొత్తంకలిపి పైన తెల్పిన పరిమితి కంటే మించరాదు. అంతకు మించిన భూమిని కౌలుదారు కబ్జాలోనే వుంచాలి. ఉదాహరణకు ఒక భూఖామందుకు కౌలు భూములతోపాటు 40 ఎకరాలు తరి 200 ఎకరాల చెలక స్వంత కమతం భూమి వుందనుకోండి ఆ స్వంతకమతం భూమికాకుండా యింకా 20 ఎకరాల తరి 100 ఎకరాలు చెలకభూమి కౌలు కివ్వబడిన భూమి అతనికి వుందనుకోండి. ఈ చట్టంవచ్చాక ఆ భూఖామందు కౌలుభూమినిగూడ స్వంతసాగుక్రిందకు మార్చ దలచినప్పుడు 10 ఎకరాల తరి 50 ఎకరాల చెలకభూమి వరకూ తన కౌలుదార్లను బేదఖలీ చేయవచ్చుతప్ప మొత్తం కౌలు భూమి అంతనుండి కౌలుదార్లను వెళ్లగొట్టడానికి వీలులేదు.

ఈ విధంగా బేదఖలీచేయగా సంక్రమించినభూమిని భూఖామందు తిరిగి కవులు కివ్వరాదు. (తానే స్వయంగా సాగుచేయాలి. అంతేగాకుండా స్వయంగా సాగుచేసుకొంటున్న భూమిమాత్రం కవులుకివ్వకోవచ్చు.) బేదఖలీ గావించిన ఒక సంవత్సరం లోపల అట్టిభూమిని స్వంత సాగుబడికిందకు తేవాలి. అలా తేలేకపోతే మరల బేదఖలీచేయబడిన రక్షిత కౌలుదారు ఆ భూమిని తహశీలుదారుకు దరఖాస్తు గావించి పునరాక్రమించుకోవచ్చు. ఒకవేళ అలా స్వంత సాగుకిందకు భూఖామందు తెచ్చినప్పటికీ స్వంత సాగులోకి తెచ్చినప్పటి నుండి పది సంవత్సరాలలో ఎప్పుడైనా స్వంతసాగు మాని మరల కౌలుకిస్తేగాని లేక పడావుగా పెట్టుతేగాని కవులుదారు ఆ భూమిని తిరిగి ఆక్రమించుకోవచ్చు. భూఖామందు స్వంత సాగుకింద లేకుండా పడావుగా వున్నకాలానికి భూఖామందు నుండి రక్షిత కౌలుదారు నష్టపరిహారాన్ని యిప్పించమని దరఖాస్తు పెట్టుకోవచ్చును.

స్వంతసాగు చేసుకొనే వుద్దేశ్యంతో నేగాకుండా భూఖామందు రక్షితకౌలుదారును సకాలంలో కౌలు చెల్లించలేదనే సాకుతోకూడ బేదఖలీ చేయవచ్చు. 1317 ఫసలీ ల్యాండు రెవెన్యూచట్టం ప్రకారం శిస్తుచెల్లింపుకోసం నిర్ణయించిన వాయిదాలప్రకారం ఆఖరివాయిదా గడువు (అంటే ఖారీఫ్, ఆబీపంటలకు ప్రతిసంవత్సరం జనవరి 21 వ తేదీ, రబ్బీపంటకు ఏప్రియల్ 21 వ తేదీ, తాబీపంటకు జూన్ 30 వ తేదీ) తరువాత 15 రోజుల లోపలగూడ ఆ సంవత్సరం కౌలుమొత్తాన్ని చెల్లిం

చకపోయినపక్షంలో తహశీలుదారుకు బేదఖలీ గావించేందుకు అనుమతికోసం భూఖామందు దరఖాస్తు పెట్టుకోవచ్చును. భూఖామందునుండి అట్టిదరఖాస్తురాగానే కవులుబకాయి చెల్లించమని తహశీలుదారు కవులుదారుకు వుత్తర్వుచేస్తాడు. కవులుదారుగనుక ఆ వుత్తర్వుయిచ్చిన 15 రోజులలోపల కవులుబకాయి చెల్లించితే బేదఖలీవుండదు. లేకపోతే కవులుదారు బేదఖలీ చేయబడుతాడు.

ఈ చట్టంలో కవులుదార్లు, రక్షితకవులుదార్ల కబ్జాహక్కులగూర్చి పైన చెప్పినదాని సారాంశం ఏమిటి? ఈ విషయాన్ని పరిశీలించేందుకు 1354 వ ఫసలీ ఆసామీ సిక్మీసుచట్టం క్రింద సంక్రమించే హక్కులనుగూర్చికూడ దృష్టిలో వుంచుకోవాలి. ఎందుచేతనంటే యీచట్టం ఆసామీ సిక్మీస్ చట్టాన్ని రద్దుగావిస్తున్నప్పటికీ ఆసామీ సిక్మీసు చట్టంప్రకారం కవులుదార్లకు యీచట్టంలోవున్న ఏర్పాట్లకు విరుద్ధంగాకుండా ఇంతకుముందే ఏర్పడివున్నహక్కులు ఇప్పుడుగూడ నిల్చేవుంటాయి. ఈ విషయంగూర్చి 1950 సంవత్సరపు కవులుదారీచట్టం సెక్షన్ 33 లో స్పష్టంగా చెప్పబడివుంది. అందుచేత ఆసామీ సిక్మీసు చట్టంక్రింద కవులుదార్లకు యింతకుముందు సంక్రమించివున్న హక్కులుగూడ దృష్టిలో వుంచుకోవాలి.

ఆసామీ సిక్మీసు చట్టంప్రకారం 1342—'52 ఫసలీల మధ్యకాలంలో 6 సంవత్సరాలకు తక్కువ లేకుండా కబ్జావున్న వాళ్లు రక్షితకవులుదార్లుగా పరిగణింపబడ్డారు. ఆ ఏర్పాటు ఇప్పటిచట్టంలోగూడ వుంది. అందుచేత నేటి చట్టంప్రకారం

రక్షితకౌలుదారు ఎవరు అన్న నిర్వచనం ఆసామీ సిక్మీసు చట్టంలోని నిర్వచనానికి తీసికట్టుగా వుండజాలదు. ఇంకా అద నంగా కొన్ని తరగతులవాళ్ళని అంటే 1943 నుండి చట్టం అమ లులోకి వచ్చేనాటి మధ్యకాలంలో ఆరుసంవత్సరాలకు తక్కువలే కుండా వరుసగా కౌలుకుచేస్తున్నవారుగూడ రక్షితకౌలుదా ర్లుగా పరిగణింపబడ్డారు. అయితే యిచ్చట ఒకవిషయాన్ని గ్రహించాలి. 1354 వ ఫసలీ ఆసామీ సిక్మీసు చట్టంప్రకారం ఆ చట్టం అమలులోకివచ్చాక యివ్వబడిన కౌళ్ళన్నీ 10 సంవత్సరాల కాలానికి తక్కువ వుండరాదు అని చెప్పబడివుంది. అంటే 1944 సంవత్సరం మార్చి 18 తేదీతో ప్రారంభమై 1950 జూన్ 30 వ తేదీతో అంతమయ్యేకాలంలో స్వంతసాగు చేసుకొనే వుద్దేశ్యంతోతప్ప ఇతరసాకులపై భూఖామందు కౌలుదారుని బేదఖలీ చేయడాన్ని చట్టం నిషేధించింది. కాని ఆచరణలో యిలా స్వంతసేద్యం చేద్దామనే సదుద్దేశ్యంతో బేదఖలీకి పూను కున్న భూఖామందులు చాలఅరుదు. తమకు భూమిపై హక్కు పోతుందనే ఆదుర్దాకొలదీ దీర్ఘకాలపు కౌలుదార్లను సాధ్యమై నంతవరకు తొలగించుతూవుండడం ఏక్సాలా లేక స్వల్పకాలం కౌలుమీద తిరిగి కౌళ్లకివ్వడమే చాలవరకు జరిగింది. పోలీసు యాక్షన్ అయ్యాక 1949 లోనూ, 1950 సంవత్సరం ప్రారం భంలోనూ బాగా బేదఖలీలు ప్రారంభమయ్యాయి. ఇలా బేద ఖలీలుఅన్నీ చట్టవ్యతిరేకం. అందుచేత 1945 సంవత్సరం మార్చి 18 తేదీతరువాత కౌలుదార్లుగావున్నవారు స్వంతసేద్యం పేరు తోతప్ప మరేవిధంగా బేదఖలీగావించబడ్డా చట్టవ్యతిరేకమే.

స్వంత సేవ్యం పేరుతో బేదఖలీ గావించబడినప్పటికి ఆ బేదఖలీ భూమిని ఒకసంవత్సరంలో స్వంతసాగు చేయకపోతేగాని లేక చేసినా 10 ఏండ్లలో అంటే 1954 మార్చిలోపల ఎప్పుడైనా మరల స్వంతసాగు విడిచిపెట్టి కౌలుకు ఇవ్వడంగాని, లేక పడావుగా వుంచడంగాని వుంచరాదు. అలా చేసినట్లయిన ఆభూమిపై భూఖామందుకుగాని, మధ్యగాప్రవేశించిన కవులుదారుకుగాని కబ్జావుండదు. బేదఖలీ చేయబడిన కౌలుదారుకే కబ్జా హక్కు వుంటుంది.

ఇక ఇప్పటి చట్టంప్రకారం కౌలుదార్ల హక్కులను ఎలా నిర్ధారణ చేసుకోవాలో చూద్దాం.

(1) చట్టంప్రకారం రక్షితకౌలుదారుగా పరిగణింపబడడానికి మూడురకాల యోగ్యతలు పేర్కొనబడ్డాయి. అంటే 1342 వ ఫసలీనుండి చట్టం అమలులోకి వచ్చేప్పటికి (1950 జూన్ 30 వ తేదీకి) వున్న మధ్యకాలంలో చట్టంలో తెల్పిన క్రమముప్రకారం ఎవరికి 6 ఏండ్లకుగాని, అంతకుమించిగాని కబ్జా వుందో ముందు పరిశీలించాలి. అలా 6 ఏండ్లకు తక్కువగాని కబ్జాదార్లలిస్టు తయారయ్యాక యెవరికి చట్టంప్రకారం ముందు ప్రాధాన్యత వుండాలో తరువాత తేల్చాలి.

ఆ తరువాత కౌలుదార్లకున్న కబ్జాకాలం గూర్చిగాని, మరేవిషయం గూర్చిగాని భూఖామందు 1951 మార్చి 1 వ తేదీలోపల తహశీలుదారుకు అభ్యంతరాలుతెల్పుతూ ఏమైనా దరఖాస్తుపెట్టాడా? లేదా? అని చూడాలి.

పైనతెల్పిన గడువులో అభ్యంతరం పెట్టకపోయినట్లయిన అట్టికౌలుదారు నిరభ్యంతరంగా రక్షితకౌలుదారుగా గుర్తింపబడాలి. అతనికి రక్షితకౌలుదారుసర్టిఫికేటు యివ్వాలి. ఆ కౌలుదారుకే కబ్జాకూడా వుంటేసరే. లేకపోతే అతను లోగా వివరించినట్లు తిరిగి భూమిని కబ్జా జేసుకోడానికి ప్రయత్నించుకోవాలి. ఇక పైనతెల్పిన గడువులోపలనే భూఖామందును తహశీలుదారు ముందు అభ్యంతరంపెడితే దానికి తహశీలుదారు ఏమినిర్ణయం యిస్తాడో చూడాలి. ఆ నిర్ణయం అక్రమముగావుంటే తాలూకాదారుకి, తాలూకాదారినిర్ణయం అన్యాయమనితోస్తే ఆ పైన రెవెన్యూబోర్డుకు అప్పీలు గావించుకోవచ్చు. కాబట్టి పైన తెల్పినదానిప్రకారం 1951 మార్చి 1 వ తేదీనాటికి భూఖామందునుండి కౌలుభూమినిగూర్చి, కౌలకాలాన్నిగూర్చి యే అభ్యంతరంలేకుండా చట్టంలో రక్షితకౌలుదార్లకుండాల్సిన యోగ్యతలలో యేదోఒక యోగ్యతవున్న కౌలుదారు నేడు కబ్జాలోవున్నా లేకపోయినా రక్షితకౌలుదారుగా పరిగణింపబడుతాడు. అట్టి రక్షిత కౌలుదారీహక్కు పత్రాలు అట్టివారికి యింతవరకూ రాకపోతే డిప్టీకలెక్టరుకు దరఖాస్తుచేసి తెప్పించుకోవచ్చును.

(2) రక్షితకౌలుదార్లను స్వంతంగా సాగుచేసుకొనేపేరుతో బేదఖలీ చేయడానికి భూఖామందుకు యీచట్టం 44 వ శెక్షన్ప్రకారం హక్కువుందని లోగా తెలుసుకున్నాం. అయితే గత యసెంబ్లీ సమావేశంలో హైదరాబాదు ప్రధానమంత్రి 44 వ శెక్షనుప్రకారం భూస్వాములు బేదఖలీ గావిం

చేందుకు తహశీలుదారుకు పెట్టుకొనే దరఖాస్తులన్నింటి విచారణ నిలుపుచేయాలనీ, బేదఖలీలకు పోలీసుఅధికార్లు వద్దకు పోరాదనీ, జిల్లా అధికారులు చర్య తీసుకోవాలని వారికి ఉత్తర్వులు పంపినట్లుగా ప్రకటించాడు. ఆ తరువాత 1952 మార్చి 31 వ తేదీ తరువాత బేదఖల్లన్నీ నిషేధిస్తూ ఆర్డినెన్సుగూడ ప్రకటింపబడింది అయినా వీటిని ఖాతరుచేయకుండా భూస్వాములు, లంచగొండిపోలీసు, రెవెన్యూ ఉద్యోగస్థుల తోడ్పాటుతో బేదఖల్లను సాగించుతూనే వచ్చారు. అట్టి బేదఖల్లన్నీ చట్టవ్యతిరేకం.

పైనతెల్పినవిషయం అలావుంచి ఇలా బేదఖలీలద్వారా భూఖామందులు స్వాధీనపర్చుకున్న భూములను భూస్వామి స్వయంగా సాగుచేస్తున్నాడా లేక పడావుగావుంచాడా లేక మరల ఇంకొకరికి కౌలుకిచ్చాడా చూడాలి. స్వయంగా బేదఖలీ తేదీనుండి సంవత్సరంలోపల సాగుచేయక పడావుగావుంచితే దానిని కబ్జా తీసుకోడానికి బేదఖలీ చేయబడ్డ కౌలుదారుకు హక్కువుంటుంది. దాన్ని పురస్కరించుకొని కౌలుదారు చేత కబ్జా పెట్టించవచ్చు.

(3) పైనతెల్పినవిధంగా రక్షితకౌలుదారుగా పరిగణింపబడడానికి యే యోగ్యతా లేకపోయినప్పటికీ కౌలుదారు నేటి వరకూ కబ్జా కలిగివుంటే అతడు రక్షితకౌలుదారుగానే పరిగణింపబడుతాడు. అంటే నేటివరకు కబ్జాలోవున్న కౌలుదార్లను (వారు చట్టానికిపూర్వం,కబ్జా కలిగివున్నా, చట్టంతర్వాత కౌలుదారులుఅయినా) ఎవరినీ బేదఖలీచేయడం చట్టసమ్మతంగాదు.

(ఇటీవల ప్రచురింపబడిన హైదరాబాదు కౌలుదారీ ఆర్డినెన్సు ప్రకారంగూడ అన్నిరకాల బేదఖలీలు రద్దుగావించబడ్డాయి. ఈ ఆర్డినెన్సు ప్రకటనగూర్చి మరొకచోట వివరించబడింది.)

(4) నేటిచట్టం అమలులోకివచ్చాక అంటే 1950 జూన్ 30 వ తేదీనుంచి యివ్వబడిన కవుళ్లు 10 సంవత్సరాలకు తక్కువకాలం వుండరాదు. కాబట్టి చట్టం అమలులోకి వచ్చినతర్వాత కౌలు కుతీసుకున్న కౌలుదార్లుగూడ దాదాపు రక్షితకౌలుదార్లే (కబ్జాకు సంబంధించినంతవరకు) అవుతారు. (అయితే ఈచట్టం ప్రకారం రక్షితకౌలుదార్లు ఎవరైనా అట్టిభూములు కబ్జా తమకేవుండాలని అభ్యంతర పెడితేతప్ప.)

(5) 1953 జూన్ 10 వ తేదీనుండి యీ చట్టం ప్రకారం అనుమతించ బడినవారు తప్ప (మైనర్లు, దిక్కులేనిస్త్రీలు, సైనికులు, నావికులు, వైమానికులు, వ్యవసాయంచేసుకోలేని శాశ్వితఅశక్తులు, తగినకారణాలతో కౌలుకివ్వడానికి తాలూకాదారుచే అనుమతింప బడినవారు తప్ప యింకెవరూ కౌళ్ళకు యివ్వరాదు.

(6) చట్టంలో గమనించాల్సిన మరొకవిషయంవుంది. అదేమంటే చట్టం 51 వ సెక్షనుప్రకారం భూఖామందులోటువలనగాని, లేక కౌలుదారు లోటువలనగాని, ఏభూమియైనా చట్టానికి పూర్వంగాని, తర్వాతగాని వరుసగా రెండుసంవత్సరాలు సాగుచేయబడకుండా పడావుగాపడివుండడంగాని లేకపశువులకంచెలక్రింద పడివుండడంగానిజరిగి తేఅట్టిభూమిని సాగులోకితెస్తే అధికాహారోత్పత్తి జరుగుతుందని ప్రభుత్వంవుద్దేశింపబడితే అట్టి

భూమిని ప్రభుత్వం వశం చేసుకొని సాగులోకి తీసుక రావచ్చును. ఈ సెక్షనుప్రకారం జమిందార్లు భూస్వాములు కౌలుదార్లను పెద్దమొత్తున బేదఖలీ గావించి పడావుగానో లేక కంచెలుగానో వుంచిన అశేష భూఖండాలన్నిటినీ సాగులోకి తీసుకరావలసినదిగా ప్రభుత్వంపై ఆందోళన లేపడానికి అవకాశం వుంది. పడావుగావున్న భూములను మొత్తంగా సాగులోకి తెప్పించడానికి ఆందోళన చేయాలి. కంచెలుక్రిందవున్న భూములను ఆ భూస్వామి పశువుల మేతకోసం సరిపడ భూములను మినహాయించి తతిమా భూములను సాగుకు యివ్వమని దరఖాస్తు చేయాలి. ప్రభుత్వ బంచరాయి భూములకు యెలా దరఖాస్తు చేయించుతున్నామో అలాగే భూస్వాముల స్వాధీనంలోవున్న పెద్ద పెద్ద కంచెలను సాగులోకి తీసుకురావడానికి దరఖాస్తులు పైన తెలిపిన సెక్షను ఆధారంగా గొని పెట్టించాలి,

(7) సెక్షను 33 ప్రకారం 12 సంవత్సరాలకు మించిన కబ్జాగల కౌలుదారులు శాశ్వత కబ్జాహక్కుగల సిక్మిదారులు అవుతారు. ఇలాంటివారిని స్వంత కమతం పెట్టాలనే సాకుతో 44వ సెక్షను ప్రకారం తొలగించడానికీ వీలుండదు; భూఖామందు అట్టి భూమిని అమ్మడానికిగూడ వీలులేదు. సిక్మిదారు పట్టాకావాలని దరఖాస్తు చేయవచ్చు.

భూస్వాములకు కౌలుదారులకు లోగడ తగాదాలు వచ్చినప్పుడు వాటిలో కొన్ని కౌలుదారులకు శాశ్వత కౌల్లకు యివ్వబడి పరిష్కరింపబడ్డాయి. (యిలాంటి భూములను 'దవామీ' కౌల్లు అంటారు.) ఇలాంటి కౌల్లన్నీ యిప్పటికీ

చెల్లుబడి అవుతాయి. ఈ భూములనుంచి బేదఖలీ చేయడానికి గాని, వాటిని అమ్ముకోడానికిగాని భూస్వాములకు హక్కు లేదు.

మూడో విషయమేమంటే కొన్ని తగాదాల సందర్భములో 10-20 సంవత్సరాల వరకే కౌల్లు నిర్ణయించడం, కోర్టు డిక్రీలుద్వారా గాని, లేక పంచాయితీలద్వారాగాని పరిష్కరించడం జరిగింది. అలాంటి సందర్భాలలో ఆ గడువువరకు బేదఖలీలు చేయబడకుండా చూడాల్సి వుంటుంది.

## —♦ 1950 కౌలుదారీచట్టం ఏ తరగతి భూములకు వర్తింపుతుంది? ♦—

1354వ ఫసలీ ఆసామి సిక్మిసు చట్టం వర్తించే భూములలో కొన్నింటిని యీ చట్టంక్రింద మినహాయించడం జరిగింది. 1950 కౌలుదారీ చట్టంప్రకారం యీ క్రిందపేర్కొన్న తరగతుల భూములను మినహాయించడం జరిగింది :—

1. ప్రభుత్వం, (హైదరాబాద్ మండల, స్థానిక ప్రభుత్వాలు) లేక సహకార సంస్థలు; యివి కౌలుకు తీసుకున్న లేక కౌలుకు యిచ్చిన భూములు; దానం పొందిన లేక దానం యిచ్చిన భూములు; యక్వైర్ గావించిన భూములు..

2. ఏదైనా పారిశ్రామిక లేక వ్యాపార సంస్థ కౌలుపై తీసుకున్న భూములు;

3. వృత్తియీనాము భూములు, దేవాదాయ యీనాములు, లేక ధర్మాదాయ యీనాములు. లేదా

4. పట్టణ పారిశ్రామిక లేదా వ్యవసాయేతర అభి వృద్ధి కోసం రిజర్వు చేయబడినట్లుగా గెజెట్‌లో ప్రభుత్వం అప్పుడప్పుడు ప్రకటించుచూవుండే ప్రాంతం —

పైన తెల్పిన వీటి విషయంలో యీ చట్టం వర్తించదు.

1354వ ఫసలీ ఆసామి సిక్మీసు చట్టం ప్రకారం గావింప బడిన మినహాయింపులకంటే పైన తెల్పిన మినహాయింపులు అధికంగా వున్నాయి. ఆసామి సిక్మీసు చట్టంప్రకారం మినహా యింపబడిన భూములు ప్రభుత్వం; సహకార సంస్థలు కౌలుకు తీసుకున్న భూములుగాని కౌలుకిచ్చిన భూములుగాని అదే విధంగా ఏదైనా పారిశ్రామిక లేక వ్యాపార సంస్థ కౌలుకు తీసుకున్న భూములు లేదా కవులుకు యిచ్చిన భూములు, వృత్తి యీనాముల విషయంలో మినహాయింపనేదే లేదు. ఈ మినహాయింపుల గూర్చి వివరిస్తూ యిటీవల ప్రభుత్వం ఒక ప్రకటన గావించింది. (25-4-1952 వ తేదీన) అందులో యీ విధంగా చెప్పబడి వుంది:—

“ 1354-ఫసలీ అసామీ సిక్మీసు చట్టం సెక్షను 25 ప్ర కారం గూడ కొన్ని తరగతుల భూములకు ఆ చట్టాన్ని వర్తింప జేయకుండా మినహాయింపు చేయబడింది. అయితే 1950 కవులుదారీ చట్టం ప్రకారం మినహాయింపబడిన తరగతులన్నీ ఆ చట్టంక్రింద మినహాయింప బడలేదు. ఆ చట్టంక్రింద యీ క్రింది రెండు తరగల భూములు మాత్రమే మినహాయింప బడ్డాయి: (1) ప్రభుత్వం, సహకార సంస్థలు చేత కౌలుకు యివ్వబడిన భూములు; అవి కవులుకు తీసుకున్న భూములు.

(2) వ్యాపార లేక పారిశ్రామిక సంస్థల తాలూకు భూములు కాని 1950 కవులుదారీ చట్టంప్రకారం యీ దిగువ తెల్పడడిన మూడుతరగతుల భూములు గూడ మినహా యింపబడ్డాయి. (1) వృత్తి యీనాములు, (2) దేవాదాయ, ధర్మాదాయ యీనాములు, (3) ప్రభుత్వం, పట్టణ, పారిశ్రామిక లేక మరి యేయితర వ్యవసాయేతర ప్రయోజనాలను పెంపొందించేందుకు రిజర్వ్ గావించుతూ గెజెట్‌లో ప్రకటింపబడే భూములు ఆసామీ సిక్మిసు చట్టం ప్రకారం మినహాయింప బడలేదు.

1950 కవులుదారీ చట్టంకు 1951వ సంవత్సరం మార్చి 31వ తేదీన గావించిన సవరణ ఫలితంగానూ, 1950 కవులుదారీ చట్టం 33వ సెక్షనుప్రకారమున్నూ ఆసామీ సిక్మిసు చట్టం అమలులో వున్నప్పుడు కవుళ్లను సంబంధించినంత వరకుఏర్పడిన హక్కులు ఆసామీ సిక్మిసు చట్టం రద్దు అయినప్పటికి యథా ప్రకారంగానే అమిలులో వుంటాయి."

ఈ ప్రకటన చాల ముఖ్యమైన ప్రకటన. దీని ప్రకారం యీ చట్టంక్రింద మినహాయింపబడిన దేవాదాయం, ధర్మాదాయం యీనాము భూములకు చెందిన కౌలుదారులు, వృత్తి యీనాం భూములకు చెందిన కవులుదార్లకుగూడ 1950 కవులుదారీ చట్టం వర్తించుతుందన్న మాట. (చట్టంలో ఈ భూములు మినహాయింప బడినప్పటికి) ఈ ప్రకటనను మన వర్కర్సు వుపయోగించు కోవాలి. అదే విధంగా యిప్పుడు ప్రకటించిన ఆర్డినెన్సుగూడ వర్తించుతుంది.

ఆయితే యిచ్చట ఒక విషయాన్ని గమనించాలి. వృత్తి యీనాం భూములు నాధారంగా వుంటాయి. అందు చేత యీ భూములకు యీనాందారులకు పట్టాలివ్వాలని మనం లోగడనుంచీ ఆందోళన గావిస్తున్నాం. కాని యిప్పుడు పైన తెల్పిన ప్రకారం యీ రకపు యీనాం భూములపై వున్న కవులుదార్లకుగూడా కవులుదారీ చట్టం వర్తింపుతుంది. దీని ప్రకారం యీ భూములపై కబ్జాకల్గివున్న కవులుదార్లు తొలగ మని అనవచ్చు. ఇలాంటి సందర్భములలో మనం జాగ్రత్తగా వ్యవహరించాలి. పేదలుగావున్న వృత్తి యీనాందారులకు వారి క్రిందవున్న కవులుదారులకు మధ్య తగాదా లేకుండా యీ సమస్యను పరిష్కరించాలి. స్వంతంగా వ్యవసాయం చేసుకునే వృత్తి యీనాందారులకు పట్టాలిప్పించడానికి మనం సాధారణంగా ప్రయత్నించాలి. కొన్ని ప్రత్యేక సందర్భా లలో మాత్రం కవులుదార్ల కబ్జాకోసం పోరాడవచ్చు.

కాబట్టి 1950వ సంవత్సరం కౌలుదారీచట్టం (1) ప్రభు త్వం (2) పారిశ్రామిక లేక వ్యాపార సంస్థలు, (3) సహకార సంస్థలకు సంబంధించిన భూములకుతప్ప తదితర ఖాల్సా యీనాం, జాగీరు మున్నగు అన్నితరగతుల భూములకు వర్తింపుతుంది. —

## —♦ 1952వ సంవత్సరపు బేదఖలీల వ్యతిరేక ఆర్డినెన్సు ♦—

1952 ఆగస్టు 28వ తేదీన హైదరాబాదు ప్రభుత్వం భూస్వాములు కౌలుదార్లను బేదఖలీ చేయడాన్ని నిషేధిస్తూ

ఒక ఆర్డినెన్సును (శాసనసభ సమావేశంలో లేనప్పుడు ప్రభుత్వం జారీగావించే చట్టాలను ఆర్డినెన్సులు అంటారు) ప్రకటించింది. దానిలోని ముఖ్యవిషయాలు యీ క్రిందివిధంగా వున్నాయి:—

(1) ఈ ఆర్డినెన్సు 1950 సంవత్సరపు కౌలుదారుల చట్టం వర్తించే భూములన్నింటికీ వర్తించుతుంది. 1952 ఆగష్టు 28 వ తేదీనుండి అమలులోకి వచ్చింది.

(2) 1952 మార్చి 21 వ తేదీ తర్వాత భూస్వాముల చేత గావించబడిన బేదఖలీలుఅన్నీ అక్రమముగా పరిగణించి రద్దుగావించబడ్డాయి. పైన తెల్పిన తేదీ తరువాత బేదఖలీచేయ బడిన రక్షితకౌలుదార్లందరికీ వారివారి కబ్జాభూములను యీ సంవత్సరం పంటతోసహా జిల్లాకలెక్టర్లు తిరిగి దఖలుపర్చవలసి వుంది.

(3) ఈ ఆర్డినెన్సు అమలుకు వచ్చినప్పటినుండి అంటే 1952 ఆగష్టు 28 వ తేదీనుండి కోర్టులుఏవీ కౌలుదార్లను బేద ఖలీ చేయడానికి భూస్వాములు పెట్టుకొనే దరఖాస్తులను తీసు కోవడంగాని, వాటిపై విచారణ జరపడంగాని చేయరాదు. ప్రస్తుతం కోర్టులో ఫైసలుగాకుండా నిల్చివున్న దరఖాస్తులవిచా రణను తక్షణమే ఆపివేయాలి.

(4) ఎవరైనా భూస్వాములు యీ ఆర్డినెన్సుకు వ్యతిరే కంగా చట్టవ్యతిరేక చర్యలకు పూనుకుంటే, అంటే కవులుదా ర్లను బేదఖలీ చేసి మరొకరికి కవులుకుఇవ్వడంగాని లేక తామే వాటిని స్వంతంగా వ్యవసాయం చేయడానికి పూనుకోవడం గాని లేక పడావుగా పెట్టడంగానిచేస్తే అట్టివారికి ఆరుమాసాల

వరకు శిక్షవిధించవచ్చు లేదా 200 రూపాయలవరకూ జరిమానా విధించవచ్చు. లేదా శిక్షా, జరిమానా రెండూగూడ విధించవచ్చు.

(5) 1952 మార్చి 21 వ తేదీ తరువాత భూస్వాములు రక్షితకౌలుదార్ల కబ్జాలోవున్న భూములను ఇతరులకు అమ్మివుంటే అట్టి అమ్మకాలన్నీ రద్దుగావించబడ్డాయి. అయితే రక్షితకౌలుదార్లే కొనుక్కొనివున్నట్లయిన అట్టివిక్రియాలు చెల్లుతాయి. అదేవిధంగా భూస్వాములుగావించే స్వంతకమతం భూముల అమ్మకాలుగూడ చెల్లుతాయి. వాటికి యీ ఆర్డినెన్సు వర్తించదు.

ఈ ఆర్డినెన్సులోని ముఖ్యాంశాలుయివి. దీన్ని అమలు జరిపేందుకు ప్రభుత్వం 1952 సెప్టెంబరు 8 వ తేదీన కొన్ని నిబంధనలను (రూల్సు) జారీగావించింది. ఆర్డినెన్సుప్రకారం తమకబ్జానుండి తొలగింపబడిన రక్షితకౌలుదార్లు జిల్లాకలెక్టరుకు తిరిగి తమ భూములను స్వాధీనపర్చమని కోరుతూ దరఖాస్తులు యెలాచేసుకోవాలి, ఆ దరఖాస్తులపై జిల్లాకలెక్టరు యేచర్యగైకొనాలి మున్నగు వివరాలు ఆ నిబంధనలలో తెల్పబడ్డాయి. భూస్వామి స్వాధీనపర్చుకున్న భూమిని తిరిగి తమకు స్వాధీనపర్చమని బేదఖలీచేయబడ్డ రక్షితకౌలుదారు తహశీలులో దరఖాస్తు యిచ్చుకోవాలి. ఆ దరఖాస్తు తహశీలుకచ్చేరీలో నమోదుఅయ్యాక తహశీలుదారు కౌలుదారు దరఖాస్తుగూర్చి భూస్వామికి ఒక నోటీసుద్వారా తెల్పుతాడు. నోటీసుఅందిన 10 రోజులలోపల భూస్వామి సమాధానం చెప్పుకోవాల్సివుంది.

అంతకన్నా ఎక్కువవ్యవధిని భూస్వామికి యివ్వనవసరంలేదు. తహశీలుదారుకు భూస్వామి అక్రమంగా బేదఖలీ గావించినట్లు రుజువైనట్లయిన భూస్వామినుండి కౌలుదారుకు తిరిగి భూమిని దఖలుచేయాలి. భూస్వామి పంట వేసుకున్నప్పటికీ ఆ పంటను గూడ కౌలుదారుకు యిప్పించాలి. (అయితే వ్యవసాయఖర్చులక్రింద భూస్వామికయిన ఖర్చులు కౌలుదారునుండి యిప్పించవచ్చు కౌలుదారే పంటవేసుకుంటే ఆఖర్చులుగూడ ఇప్పించనవసరంలేదు, ఒకవేళ తహశీలుదారు అన్యాయమైనతీర్పుఇస్తే డివిజన్‌కచ్చేరిలో మురాఫా (అప్పీలు) చేసుకోవచ్చును. డిప్యూటీకలెక్టరు నిర్ణయంపై జిల్లాకలెక్టరుకు, జిల్లాకలెక్టరు నిర్ణయంపై రెవెన్యూబోర్డుకు వరసక్రమములో మురాఫా చేసుకోవాలి. రెవెన్యూబోర్డు తీర్పుపై ప్రభుత్వానికి అంటే రెవెన్యూశాఖమంత్రికి మురాఫా చేసుకోవచ్చు. ప్రభుత్వానిది అంత్యనిర్ణయం.

ఈ ఆర్డినెన్సును అమలుజరిపేబాధ్యత ప్రధానంగా జిల్లాకలెక్టర్లపైవుంది. అయితే ఆర్డినెన్సుక్రింద జిల్లాకలెక్టర్లకు ఇవ్వబడిన అన్నిఅధికారాలను తహశీలుదారు, డిప్యూటీకలెక్టర్లు కూడ తమతమ ప్రాంతాలలో చెలాయించవచ్చునని ప్రభుత్వం 1952 ఆగష్టు 30 వ తేదీన ఒకప్రకటన గావించింది.

ఈ ఆర్డినెన్సుక్రింద కౌలుదార్లుపెట్టుకొనే దరఖాస్తులకు, చేసుకొనే అప్పీళ్లకు కోర్టు స్టాంపు బిళ్లలుగాని, రెవెన్యూస్టాంపు బిళ్ళలుగాని అతికించనవసరంలేదు. ప్రభుత్వం అచ్చువేసిన ఫారాలపై దరఖాస్తులు యిచ్చుకోవచ్చును.

ఈ ఆర్డినెన్సు ప్రకారం రక్షిత కౌలుదార్లకు భూస్వాములు అక్రమ బేదఖీలవలన కల్గిన అన్యాయం పూర్తిగా తొలగదు. 1952 మార్చి 21వ తేదీ తరువాత గావించబడిన బేదఖలీలను మాత్రమే యీ ఆర్డినెన్సు నిషేధించుతోంది తప్ప పోలీసు ఆక్షను అయినతరువాత జరుపబడిన అక్రమ, అన్యాయ బేదఖలీలవలన కల్గిన హానిని తొలగించుటలేదు. అందుచేత యీఆర్డినెన్సుగూడ కౌలుదార్లకు చాలా పరిమితమైన రక్షణనే యిస్తోంది. అయినా యీ ఆర్డినెన్సులోవున్న కొలదిపాటి హక్కులనుగూడ కౌలుదారులు పొందకుండా భూస్వాములు, జమీందార్లు ప్రభుత్వ లంచగొండి పోలీసు, రెవెన్యూ వుద్యోగులను కట్టుకొని కుట్రపన్నుతారు. ఈ కుట్రను సాగకుండా రైతు వర్కర్లు మెలుకవతో ప్రవర్తించాలి. ఆర్డినెన్సులో యివ్వబడిన కొలది హక్కులు అయినా అచరణలో అమలుజరిగేందుకు రైతులను సమీకరించాలి. ఆర్డినెన్సు పూర్తి ప్రయోజనాలను రైతులు పొందేట్లు కృషి చేయాలి.

—♦ 1950 కౌలుదారీ చట్టంలోని యితర ముఖ్యాంశాలు ♦—

1950 కౌలుదారీచట్టం అమలులోకి రావడంతో అంతకు ముందున్న 1354వ ఫసలీ అసామీసిక్మీసు చట్టం, వ్యవసాయ భూముల అన్యాక్రాంతాల నివారణచట్టం రద్దు అయిపోయాయి. అందుచేత 1950వ కౌలుదారీచట్టం కేవలం కౌలుదార్లకు సంబంధించినదే కాదు. వ్యవసాయ భూములకు సంబంధించిన యితర హంశాలకుగూడ యీచట్టంవర్తించుతుంది. వ్యవసాయ భూములకు సంబంధించినంత వరకు యీ చట్టమే నేడు ముఖ్య

మైనది. (1317వ ఫసలీ ల్యాండు రివెన్యూ చట్టంగాక) అందుచేత యీ చట్టంలో యితర ముఖ్య విషయాలుగూడ తెలుసుకోవడం అవసరం.—

—♦ కౌలు నిర్ణయంగూర్చి ♦—

1. 1354వ ఫసలీ ఆసామీ సిక్మీసు చట్టంలో ప్రభుత్వం గరిష్ఠ కౌలు రేట్లు నిర్ణయించ వచ్చునని చెప్పబడిందేగాని యింతకంటె కౌలు రేటు అధికంగా వుండరాదని నిర్దిష్టంగా తేల్చలేదు. 1950 కౌలుదారీ చట్టంతో ప్రథమ పర్యాయంగా గరిష్ఠ కౌలు రేట్లుగూర్చి నిర్ణయించడం జరిగింది. చట్టం ప్రకారం ఈ క్రింది యివ్వబడిన రేట్లు గరిష్ఠ రేట్లుగా వుంటాయి. ఈ రేట్లకంటే అధికమైన రేట్లను కౌలుదార్లనుండి భూస్వాములు వసూలు చేయరాదు.

(అ) భావులక్రిందతప్ప తతిమా అన్నిరకాల తరిభూముల విషయంలో పండిన పంటలో మూడోవంతు కంటే ఎక్కువ కౌలు రేటును భూస్వామి తీసుకోరాదు.

(ఆ) భావులక్రింద తరి, తోట భూములకు, ఖుష్కీభూములకు పండిన పంటలో నాలుగోవంతు కంటే కౌలు రేటు అధికంగా వుండరాదు.

పైనతెల్పిన రేట్లకువిరుద్ధంగా భూఖామందులకు, కౌలుదార్లకు మధ్య యింతకుముందు ఏ ఒడంబడిక జరిగివున్నా అది రద్దు అవుతుంది. అదే విధంగా పైన తెల్పిన రేట్లకు విరుద్ధంగా యివ్వబడిన కోర్టు డిక్రీలు గాని లేక రెవెన్యూ డిక్రీలు గాని చెల్లనేరవు. (సెక్షను 11.)

2. పాలు పద్ధతిపైవున్న కౌలు రేట్లను ధనరూపంలో మార్చడానికి ప్రభుత్వానికి అధికారం వుంటుంది. ముందు గెజిట్‌లో ఫలానా ప్రాంతంలో ఆవిధంగా మారుస్తామని ప్రభుత్వం ప్రకటన చేస్తుంది. పాలు పద్ధతిపై వున్న కౌలు రేట్లను ధనరూపంలోకి మార్చేందుకు ఏపద్ధతిని అనుసరించాలో ఆ ప్రకటనలో తెల్పబడుతుంది. అలా ధనరూపంలోకి రేట్లు ఏ పరిస్థితులలోను చట్టంలో అనుమతి పబడి గరిష్ఠ కౌలురేట్లను మించి వుండరాదు. శాశ్వితంగా ధనరూపంలో కౌలురేట్లు ప్రభుత్వం నిర్ణయించేముందు తాత్కాలికంగా ఈ చట్టం క్రింద ఏర్పరచబడే 'త్రైసభ్యుల సంఘం' (అంటే ట్రిబ్యునల్) నిర్ణయించుతుంది. అలా నిర్ణయించిన రేట్లు ఐదు సంవత్సరాలు అమలులో వుంటాయి. కౌలుదార్లకు పంటలు తగ్గుతూ వున్నప్పుడు గాని లేక మరేవిధంగా నైనా నష్టం వస్తున్నప్పుడు గాని ట్రిబ్యునల్ నిర్ణయించిన రేట్లు తగ్గించబడాలని ట్రిబ్యునల్ కు దరఖాస్తు చేసుకుంటే అట్టి దరఖాస్తును విచారించి ఆ సంఘం రేట్లను తగ్గించవచ్చును.

ఈ విధంగా ప్రభుత్వంగాని లేదా ట్రిబ్యునల్ గాని విధించిన రేట్లకంటే భూఖామందులు అధికంగా వసూలు చేయరాదు.

3. ఇలా నిర్ణయించబడిన కౌలు రేట్లుతప్ప మరి ఇతర సెస్సులుగాని, పన్నులుగాని వసూలు చేయరాదు. ఏ విధమైన అదనపు చాకిరీ కౌలుదార్ల చేత చేయించుకోరాదు.

4. కౌలుకిచ్చిన భూఖామందుకు ప్రభుత్వం రిమిషను యివ్వడంగాని లేక శిస్తు వసూలు నాపుదలచేయడంగాని జరిగితే అలాంటి సంవత్సరాలలో ఏ విధంగా పై సౌకర్యాన్ని భూఖామందు పొందుతాడో అదే విధంగా కౌలురేటును పూర్తిగా మాఫీ చేయడమో లేక కొంత తగ్గించడమో జరగాలి. ప్రభుత్వం ఆర్డరు రాకముందే కౌలుదారు కౌలు పూర్తిగా గాని లేదా కొంతభాగంగాని చెల్లించితే ప్రభుత్వం యిచ్చే రిమిషను మేరకు భూఖామందు కౌలుదారుకు తిరిగి చెల్లించాలి.

ఈ చట్టంక్రింద నిర్ణయింపబడిన గరిష్ఠ కవులు రేట్లు మొత్తంగా చూస్తే నేడు అమలులోవున్న రేట్లకంటే తక్కువ అయిన వేమీగావు. పాలుపద్ధతి వున్నచోట్ల కొంత తగ్గింపు జరిగితే జరగవచ్చు గాని తతిమాచోట్ల కౌలుదార్లకు పెద్దగా సౌకర్యం జరగదు. ముఖ్యంగా ఖుష్కీ భూముల విషయంలో చట్టం నిర్ణయించిన రేట్లు యిప్పుడు అమలులోవున్న గరిష్ట రేట్లకంటె గూడ అధికమవుతాయి. అదే విధంగా భావుల క్రింద తరిభూముల విషయంలో గూడ చట్టం నిర్దేశించే గరిష్ట రేట్లవలన కవులుదార్లకే నష్టం కల్గుతుంది. అందుచేత ఈ రేట్లు భూఖామందులకే లాభకరం. అయినా చట్టంలో నిర్దేశించిన గరిష్ట రేట్లకంటే అధికంగా రేట్లు వున్నచోట్ల చట్టంలోని రేట్ల అమలుకోసం ప్రయత్నించాలి.

## —♦ భూముల క్రయవిక్రయాలు ♦—

హైదరాబాదు సంస్థానంలో క్రయవిక్రయాలను గూర్చి 1950 కవ్వులుదారీ చట్టానికి ముందు ఒక చట్టం వుండేది. దాని పేరు 1349వ ఫసలీ వ్యవసాయ భూముల అన్యాక్రాంతాల నివారణ చట్టం. వ్యవసాయదారుల చేతులలోనుండి వ్యవసాయేతరుల చేతుల్లోకి భూమి పోకుండా వుండే వుద్దేశ్యంతో ఈ చట్టం తీసుకరాబడిందని చట్టం వుద్దేశాలు, లక్ష్యాల భాగంలో చెప్పబడింది.

ఈ చట్టం ప్రకారం వ్యవసాయ తరగతికి చెందిన ప్రజలెవరో ప్రభుత్వం తన గెజెట్ ప్రకటనలద్వారా దఫాల వారిగా తెల్పుతూ వుంటుంది. ఈ చట్టం ప్రకారం 500 రూపాయలుగాని అంతకు తక్కువగాని భూమిశిస్తు చెల్లించే వారిని వ్యవసాయ తరగతికి చెందినట్లుగా యెంచబడింది. అంతకు మించి భూమిశిస్తు చెల్లించేవారు వ్యవసాయ దారులు కారని చట్టం నిర్వచించింది.

ఈ చట్టం ప్రకారం భూములు ఎలా అమ్మబడాలో తదితర అన్యాక్రాంతాలు ఎలా జరగాలో నిర్ణయించబడింది.

కొన్ని సందర్భాలలో తప్ప సాధారణంగా తాలూకా దారుని అనుమతిలేకుండా భూముల శాశ్వత క్రయవిక్రయాలు జరగరాదు. వ్యవసాయేతరులు అంటే రు 500 లకు పైబడి రకం చెల్లించువారు భూములు కొనడాన్ని తాలూకాదారు అనుమతించరాదు. అమ్మేవారికి అమ్మినభూమి పోగా ఇంకా కనీసం రు 50'లు భూమిశిస్తు చెల్లే భూమి తప్పనిసరిగా

వుండాలి. అంతకు తగ్గినచో తాలూకాదారు అట్టి అమ్మ కాలను ఆటంక పర్చుటకు అధికారం కలిగివుంటాడు. అయితే అట్టి అభ్యంతరం వలన అమ్మకునేవారికి నష్టం వాటిల్లుతోందని తాలూకాదారు భావిస్తే అట్టి అమ్మకాన్ని గూర్చి తనపై అధికారికి తెల్పి అంత్య వుత్తర్వులు పొందాల్సి వుంటుంది.

ఈ క్రింది తెల్పిన అమ్మకాలకు తాలూకాదారు అనుమతి అవసరం లేదు.

1. అమ్మే అతను వ్యవహారేతరుడు అంటే రు 500 లకు పైగా రకం చెల్లించేవాడు అయినప్పుడు.

2. అమ్మేవాడూ కొనేవాడూ వ్యవసాయదారులే అయి వుంటే తాలూకాదారు అనుమతి అవసరం లేదు. అమ్మే వానికి అమ్మగా మిగిలేభూమి విస్తీర్ణం రు 50 లు గాని అంతకు మించిగాని శిస్తు చెల్లిదిగా వుండాలి. అయితే అమ్మే అతను తన కుటుంబములోని వారిలో ఏవరికో వీలునామావ్రాయడము గాని, లేక దానం చేయడంగాని జరిగిన సందర్భంలో పైన తెల్పిన పరిమితి దృష్టిలో పెట్టుకో నవసరం లేదు.

వ్యవసాయ తరగతికి చెందినవారు తమ భూములను తనఖా పెట్టుకోవచ్చు. యితరుల భూములను తనఖా పెట్టించుకోవచ్చు. అయితే అట్టి తనఖాలు అస్వాధీనపు తనఖాలుగా వుండరాదు; స్వాధీనపు తనఖాలుగా వుండాలి. (20 ఏండ్ల కాలానికి మించని విధంగా) 20 సంవత్సరాలు పూర్తిఅయ్యాక వడ్డీ అసలుఫాయిదాలు పూర్తిగా తీరివున్నా లేకపోయినా

భూమిని తనఖాపెట్టిన వారికి తనఖా పెట్టించుకున్నవారు స్వాధీన పర్చాలి.

తనఖా పెట్టినవారే తనఖా పెట్టించుకున్న వారి అంగీకారంతో భూమిని సాగు చేస్తుంటే తనఖా కాలం అంతా అతనికి ఆసామీ సిక్మికివుండే హక్కులకు మించి హక్కులు వుండవు. ఆ కాలంలో తనఖా పెట్టించుకున్నవారే భూమి శిస్తు చెల్లించుకోవాల్సి వుంటుంది.

ఈ చట్టానికి విరుద్ధంగా ఏ వ్యవసాయదారుడైనా తనఖాపెట్టితేగాని లేక పెట్టించుకుంటేగాని అట్టి తనఖాను రద్దు చేయించి మరల చట్టంప్రకారం తనఖాపత్రం వ్రాయించడానికి తాలూకాదారుకు అధికారం వుంది.

1950 సంవత్సరపు కౌలుదారీ చట్టంప్రకారం పైన తెల్పిన '1349వ ఫసలీ వ్యవసాయ భూముల అన్యాక్రాంతం నివారణ చట్టం' రద్దు గావింపబడింది. భూముల క్రయవిక్రయాల గూర్చి క్రొత్త నిబంధనలు గావించబడ్డాయి. వాటి సారాంశం యిది:

1. లోగడ చట్టంలో చెప్పబడినట్లుగా ఏ రకపు వ్యవసాయ భూముల శాశ్వత అన్యాక్రాంతం తాలూకాదారు అనుమతితో తప్ప జరగరాదు. పట్టాభూమి లేక కబ్జాహక్కు, అమ్మకం, మారకం, దానం, దఖలు (వీల్‌నామా తప్ప) మున్నగు శాశ్వత అన్యాక్రాంతాలు తాలూకాదారు అనుమతి లేనిదే జరగరాదు. (సెక్షను 47.)

2. వ్యవసాయ భూముల అన్యాక్రాంతం చేయగోరు వారు ముందుగా తాలూకాదారుకు దరఖాస్తు చేసుకోవాలి. అన్యాక్రాంతాల విషయంలో తాలూకాదారులు యీ క్రింది పద్ధతుల ననుసరించాలి :—

(అ) 10 ఎకరాల తరి మరియు 50 ఎకరాల చెల్కా భూమిగాని అంతకు తక్కువ భూమిగాని కల్గిన వ్యవసాయ దారులు ఎవరికీ తమ భూములను అమ్ముకోడానికి తాలూకా దారు అనుమతి యివ్వరాదు.

అయితే వ్యవసాయేతరులుగావించే అమ్మకాలలో ఈ నిబంధన పాటించ నవసరం లేదు. అంతేగాకుండా యికముందు వ్యవసాయ వృత్తిని విడనాడ దలచుకున్నవారి సందర్భంలో గూడ పాటించ నవసరం లేదు.

(ఆ) 50 ఎకరాల తరి మరియు 250 చెల్కా భూమి గాని అంతకు మించిగాని భూమి వున్నవారు ఎవరూ భూములు అదనంగా కొనడానికి అనుమతి యివ్వరాదు. అంతకులోపు భూమివున్న వ్యవసాయ దారులకు ఆ పరిమితి మేరకు కొను క్కోడానికి అనుమతించవచ్చును.

అయితే యిలాకొన్నవారి సందర్భంలో ఒకవిషయాన్ని పరిశీలించాలి. వీరి క్రింద ఎవరైనా రక్షితకౌలుదార్లు వున్నారా? వుంటే వారి కబ్జాక్రింద ఎంత విస్తీర్ణం భూమి వుందీ? అన్న విషయాన్ని పరిశీలించాలి. ఆ విధంగా రక్షిత కౌలుదార్ల కబ్జాక్రింద వున్న భూమి విస్తీర్ణాన్ని పైన తెల్పిన లెక్కలోనుంచి మినహాయించాలి. ఉదాహరణకు. ఒక

భూస్వామికి 60 ఎకరాల తరి, 400 ఎకరాల చెల్కా భూమి వుందనుకోండి. ఆ భూస్వామి 20 ఎకరాల తరి, 200 ఎకరాల చెల్కా కౌలుకిచ్చాడనుకోండి. ఆభూమిచేస్తున్న కౌలుదార్లంతా యీ చట్టంక్రింద రక్షితకౌలుదార్లుగా పరిగణింపబడ్డారనుకోండి. ఈ పరిస్థితిలో ఆ భూస్వామి యింకా కొంత భూమి కొనుక్కోడానికి తాలూకాదారుకు దరఖాస్తు చేసినప్పుడు తాలూకాదారు ఆ భూస్వామిని యింకా 10 ఎకరాల తరి మరియు 50 ఎకరాల చెల్కా భూమిని కొనుక్కోడానికి అనుమతించవచ్చు. అంతకుమించి ఆ భూస్వామి యీ చట్టం ప్రకారం భూమిని కొనడానికి వీలులేదు.

3. లోగడ చట్టంలోమాదిరిగానే తనఖాలన్నీ స్వాధీనపు తనఖాలుగా వుండాలి. అస్వాధీపు తనఖాలు అనుమతింపబడవు. సెక్షను (47. 48.)

వ్యవసాయేతరులు భూములను కొనదలచితే వారు వ్యవసాయంస్వయంగా చేసేపక్షంలోనే తాలూకాదారు అనుమతించాలి. అదే విధంగా వాళ్లు తనఖా పెట్టించుకునేప్పుడు అట్టి చర్య సదుద్దేశ్యంతో కూడుకొని వుందా లేదా అనేది గూడ తాలూకాదారు పరిశీలించాల్సి వుంటుంది.

రక్షిత కౌలుదార్ల విషయంలో పైనతెల్పిన నిరోధాలు అంతగా లేవు. రక్షిత కౌలుదార్లు తనఖాబెట్టివున్న భూమిని కొనుక్కోవాలంటే తాలూకాదారు అనుమతి అవసరం లేదు. అయితే పైన తెల్పబడిన పరిమితికి (అంటే 50 ఎకరాల తరి

మరియు 250 ఎకరాల చెల్కా(భూమి) లోబడి కొనాల్సి వుంటుంది.

రక్షిత కౌలుదార్ల కబ్జాలోవున్న భూమిని ఏ భూఖామందు అయినా అమ్మదల్చుకుంటే ముందు ప్రాధాన్యత రక్షిత కౌలుదారుకే యివ్వాలి. రక్షిత కౌలుదారు తన కబ్జాలో వున్నభూమిని అంతాగాని లేక కొంతగాని కొనుక్కోదలచా నంటే భూఖామందు రెండు సంవత్సరాల వరకు మరి యెవరికీ అమ్మకుండా ఆగాలి. ఈలోగా, గడువులోపల రక్షిత కౌలు దారు కొనుక్కోక పోయినప్పుడే మరెవరికైనా భూఖామందు అమ్ముకోవాలి.

## —♦ చట్టాన్ని అమలుజరిపే అధికారులు. ♦—

ఈ చట్టాన్ని అమలుజరిపేందుకు ప్రభుత్వం గెజిట్ ప్రకటనద్వారా "వ్యవసాయ భూముల ట్రైబ్యునల్సు" అన్న సంఘాలను ఏ ప్రాంతానికైనా ఏర్పరచవచ్చు. ఈ సంఘాలలో ముగ్గురుగాని అంతకంటేఎక్కువగాని సభ్యులువుంటారు. అందులో ఒకరు అధ్యక్షుడుగా నియమింపబడుతాడు. సభ్యులలో కనీసం ఒకరైనా కోర్టు మున్సిఫ్ హోదాకు తక్కువలేని న్యాయశాఖ వుద్యోగిగాని, మూడుసంవత్సరాలకు తక్కువకాని సర్వీసువున్న వారుగాని లేక అట్టి హోదాకలిగిన తహశీలు దారుకు తక్కువకాని హోదాకల్గిన రెవెన్యూ వుద్యోగిగాని తప్పనిసరిగా వుండాలి.

అలా ట్రైబ్యునల్సు ఏర్పరచని ప్రాంతాలలో నాయబ్ తాలూకాదారుగాని లేదా ప్రభుత్వం అందుకోసం నియమించే ప్రత్యేక వుద్యోగిగాని ట్రైబ్యునల్సు పని చూస్తారు.

భూఖామందులు, కౌలుదార్లు, రక్షితకౌలుదార్ల మధ్య వచ్చే సకల తగాయిదాలు యీ ట్రైబ్యునల్సు విచారించి తీర్పులు యిస్తూ వుంటాయి.

ఈ తీర్పులుగూర్చి తాలూకాదారుకు అప్పీలు చేసుకోవచ్చు. తాలూకాదారుతీర్పు యిష్టంలేకపోతే రెవెన్యూ బోర్డుకూ, దానితీర్పు అంగీకారంలేకపోతే ప్రభుత్వానికీ అప్పీలు చేసుకోవచ్చు. ప్రభుత్వం రెవెన్యూబోర్డు తీర్పులనుగూడ మార్చవచ్చు.

ఆయా స్థాయీలలో యివ్వబడే తీర్పులు, వాటిపై గావించబడే అప్పీళ్లనుగూర్చి ఏ సివిల్ కోర్టులు తిరిగి ఆలోచించడానికి చట్టంప్రకారం అవకాశంలేదు. ట్రైబ్యునల్ లేదా తహశీల్ దారు లేదా తాలూకాదారు లేదా రెవెన్యూబోర్డు లేదా ప్రభుత్వం- ఈ వరసలో యివ్వబడే తీర్పులు అంత్యనిర్ణయాలు అవుతాయి.

న్యాయమైన కౌలురేట్లు నిర్ణయించడం విషయంలో అంత్య నిర్ణయము తాలూకాదారుదే: ఆ నిర్ణయాన్ని తిరగదోడడానికి ఎవరికీ అధికారంలేదు.

ఏ తీర్పుపైన అయినా అప్పీలు తీర్పు యివ్వబడిన తేదీలగాయతు రెండు నెలలలోపల చేసుకోవాల్సి వుంటుంది. (సెక్షన్సు. 87, 90, 93)

ఈ చట్టం ప్రకారం రక్షిత కౌలుదార్ల విషయంలో గుర్తింపబడిన హక్కులును చట్టం అనుమతించినంత వరకు వంశ పారంపర్యం అనుభవించవచ్చును. (సెక్షను 40.)

ఒకే గ్రామంలో వున్న రక్షిత కౌలుదార్లు తమలో తాము తమతమ కబ్జాలో వున్న భూములను ఒకరిమధ్య యింకొకరు మార్పిడి గావించుకొనేందుకు ఒక ఒడంబడికకు వచ్చి తహశీలుదారు అనుమతితో మార్పిడి చేసుకోవచ్చు. (సెక్షను. 39.)

రక్షిత కౌలుదారు తన కబ్జాలోవున్న భూమిని స్వయంగా సాగు చేయాలేగాని తిరిగి కవులుకు యివ్వరాదు. అదే విధంగా చేల ఖండాలను విడగొట్టరాదు.

—♦ హైదరాబాదు కాంగ్రెసు ప్రభుత్వం భూమి పంపకంగూర్చి తలపెట్టిన నూతనపథకం. ♦—

1950వ సంవత్సరపు కౌలుదార్ల చట్టంగాని, 1952వ సంవత్సరపు బేదఖలీల నిషేధపు ఆర్డినెన్సుగాని కౌలుదార్లకు రక్షణ కలుగజేయలేదు. ఇందుకు ఉదాహరణ ఆర్డినెన్సు అమలులోకి వచ్చాకగూడ భూస్వాములు రక్షిత కవులుదార్లనుసహితం బేదఖలీ గావిస్తూనే వున్నారు; ఈ సంవత్సరం పంటలను సాగుచేసిన రైతులకు దక్కనీయకుండా దోపిడీ చేసుకుపోతున్నారు. ఈ చట్టాలవలన రక్షిత కవులు దార్లకైనా బేదఖలీ గావించబడకుండా రక్షణ దొరుకుతుందేమోనన్న ఆశలు అడియాశలౌతున్నాయి. కాబట్టి 1950

సంవత్సరపు కవులుదారీ చట్టం ఆచరణలో కవులుదార్లకు పెద్దగా ఒరగబెట్టలేదన్నది నగ్నసత్యం. దీన్ని తెలుసుకున్న హైదరాబాదు కాంగ్రెసు ప్రభుత్వం రైతులోవున్న అసంతృప్తిని ఏదోవిధంగా చల్లార్చేందుకు భూమిపంపకంపేరుతో ఒక క్రొత్త పథకంతో తయారవుతోంది. గత అసెంబ్లీ సమావేశకాలంలో నే ఆ పథకాన్ని ఒక బిల్లురూపంగా గొనివస్తున్నామని ముందుగానే పుకార్లు లేపింది. మరల ఈ మాసాంతంలో 3 వ అసెంబ్లీ సమావేశంలో భూమి పంపకంపై తాము తయారుగావించిన నూతన పథకాన్ని ఒక బిల్లురూపంలో ప్రవేశపెడుతామని ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు పలు పర్యాయాలు పత్రికలలో ప్రకటించారు, ఈ పథకంలోని యీ క్రింది సూచనలతో కూడుకొని వుందని తెలుస్తోంది.

— ♦కాంగ్రెసు పథకంలోని ముఖ్యాంశాలు:♦ —

1. సంవత్సరానికి రు 2000/—ల నుండి రు 3600/—ల వరకూ, అంతకులోపు నికరాదాయం వచ్చే భూఖామందుల భూమిని ప్రభుత్వం పుచ్చుకోదు. అంతకుమించి నికరాదాయం వచ్చే భూఖామందుల భూమిని ప్రభుత్వం నష్టపరిహారమిచ్చి తీసుకొంటుంది. ప్రభుత్వం అంచనాల ప్రకారం సాలీనా రు 3600/-లు నికరాదాయం రావాలంటే దాదాపు 480 మణుగుల వడ్లుగాని, తత్తుల్యమైన యితర ధాన్యాలు, పంట సరుకులు పండాల్సి వుంటుంది. ఇంత ఫలసాయం రెండు పంటలు పండే 16 ఎకరాలు తరి భూమిలోగాని లేదా ఒకేపంట

పండే 24 ఎకరాల తరి భూమిలోగాని వస్తుందని ప్రభుత్వం అంచనా (మంచినీటి వసతులు కల్గిన తరిభూమి, భావులకింద సాగు అయ్యే పొలాలకు వున్న తేడాను పై అంచనాలో చేర్చ లేదు. మంచినీటి వసతులు కల్గిన తరిభూములు అనే ప్రభుత్వం వుద్దేశ్యం.)

ఎంత ఖుష్కీభూమిలో పైన తెల్పిన సాలీనా నికరా దాయం లభిస్తుందో యింకా ప్రభుత్వం లెక్కలు కట్టలేదు. సాధారణాంగా 5 యెకరాల చెల్కాభూమి ఒకపంట పండే ఒక ఎకరం తరిభూమికీ సమానం అని ప్రభుత్వ అంచనా.

ఈ అంచనాబట్టి సాలీనా రు 3600లు నికరాదాయం 120 ఎకరాల చెల్కాభూమి వున్న భూఖామందుకు వస్తుందని తేలుతుంది.

కాబట్టి కాంగ్రెసు ప్రభుత్వం నూతన పథకం ప్రకారం ఒక భూఖామందుకు రెండు పంటలు పండే తరిభూమి 16 ఎకరాలు లేక ఒక పంటపండే తరిభూమి 24 ఎకరాలు లేక 120 ఎకరాల చెల్కాభూమి కంటె అధికంగా వుండరాదు; ఆ హద్దును మించివున్న భూమిని నష్టపరిహారం యిచ్చి ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది.

2. పైన తెల్పిన మేరకు భూమిని వదలడమనేది స్వయంగా వ్యవసాయాన్ని చేయించుకొనే భూస్వాముల విషయంలో మాత్రమే. తమ భూమిని అంతాగాని లేక అత్యధిక భాగాన్ని గాని కౌలుకిచ్చిన భూస్వాముల విషయంలో యింత మొత్తంభూమిని అట్టి పెట్టరు. కౌళ్లకిచ్చే భూస్వాములకు

పైన తెల్పిన గరిష్ఠ ప్రమాణంలో నూటికి 40వంతులు మాత్రమే అట్టి పెడతారు. అంటే సాలీనా రు 1440లు నికరాదాయం వచ్చే తరిభూమిగాని లేక చెల్కాభూమిగాని అట్టిపెట్టుతారు. కేవలం రెండు పంటలుపండే తరిభూమి అయితే 6 ఎకరాల 16 గుంటలు, ఒక పంటపండే తరిభూమి అయితే 10 ఎకరాలు, చెల్కాభూమి అయితే 50 యెకరాలు—యింతకంటే మించి అట్టిపెట్టరు. కౌల్లకిచ్చే భూస్వాములుకున్న భూముల లో పైనతెల్పిన మేరకు వదిలి మిగతా భూమిని ప్రభుత్వం నష్టపరిహారంపై స్వాధీనం గావించుకుంటుంది.

3. ప్రభుత్వం యీ విధంగా భూస్వాములవద్ద తీసుకున్న భూమిని రైతులకు అమ్ముతుంది. ధర ఆ భూములలో పండే పంట విలువకు రెండు లేక మూడు రెట్లుకట్టి రైతులవద్ద తీసుకుని భూస్వాములకు చెల్లిస్తుంది. ధర పండినపంట విలువకు రెండురెట్లు వుండాలా లేక మూడురెట్లు వుండాలా అనేది యింకా ప్రభుత్వానికి చర్చనీయాంశంగా వుంది.

రైతులనుండి వసూలుచేసే భూమి ధరనుండి నూటికి 5 నుండి 10 వంతులవరకు మినహాయించి తతిమా మొత్తాన్ని భూస్వాములకు నష్టపరిహారం క్రింద చెల్లిస్తుంది. ఇలా మిగిల్చిన నిధిని రైతుల వ్యవసాయాభి వృద్ధికోసం వినియోగిస్తుందట!

4. ప్రభుత్వం అనుమతించిన భూమి గరిష్ట ప్రమాణం లో పదవవంతు కనిష్ట ప్రమాణంగా నిర్ణయించబడుతుంది. అంటే ఒక పంటపండే తరిభూమి 2 ఎకరాల 20 గుంటలు, రెండు పంటలు పండే తరిభూమి ఒక యెకరం 24 గుంటలు,

చెల్కా-భూమి అయితే 12 ఎకరాల 20 గుంటలు కనిష్టపరిమా ణంగా వుంటుందన్నమాట. ఈ హద్దులలోబడి భూమి విభ జింపబడడాన్ని ప్రభుత్వం నిషేధించుతుంది.

భూమిపంపకంగూర్చి బూర్గుల మంత్రివర్గం తలపోస్తున్న పథకంఇదేగాతెలుస్తోంది.ఇది భావరూపాన్నివీడి ఎంతవరకు ఆచ రణలోకివస్తుందో తెలియకముందే దీన్నిగూర్చి విమర్శింపబూన డం సరికాదు. అందుచేత యీ పథకం బిల్లురూపం ధరించి శాసనసభముందు నిల్చినప్పుడు నిర్దుష్టమైన విమర్శ చేయడానికి పూనుకుంటాం. "తెలంగాణ రైతు సమస్యలు" రెండోభాగంలో సమగ్రంగా వ్యవసాయ కార్యక్రమాన్ని వివ రించుతాం. ఆ సందర్భంలో భూమి పంపకంపై కాంగ్రెసు ప్రభుత్వం, యితర పార్టీల, పక్షాల పథకాల గూర్చిన మా విమర్శ, సూచనలు గావింగుతాం.

—♦ పట్టాభూములపైవున్న యితర హక్కులు. ♦—

హైదరాబాదు సంస్థానంలో 1317వ ఫసలీకి పూర్వం చెట్లపై సాగుచేసుకునే రైతులకు హక్కు వుండేదికాదు. 1317 ఫసలీ ల్యాండు రెవెన్యూచట్టం ప్యాసుగాబడ్డ తరువాతనే పట్టా దారు పట్టాభూములలో చెట్లపైహక్కు వచ్చింది. ప్రభు త్వం ప్రత్యేకంగా హక్కు రిజర్వుచేసుకున్న శాటి, ఈత, విప్ప చెట్లపై తప్ప తతిమా అన్నిచెట్ల పంటను, కలపను పూర్తిగా అనుభవించడానికి పట్టాదారులకు ప్రభువు పర్యాయంగా

ల్యాండు రివెన్యూ చట్టంప్రకారం హక్కు ఏర్పడింది. (1317 ఫసలీ ల్యాండు రివెన్యూ చట్టం సెక్షను. 28 29.)

ఈత, తాడి, విప్ప చెట్లపై హక్కునుమాత్రం ప్రభుత్వం అట్టిపెట్టుకొంది. ఆ చెట్లను పట్టా రైతులు నరకడంగాని, గీతగీయడంగాని చేయరాదు. విప్ప చెట్లపువ్వు అమ్ముకోరాదు; ఆపువ్వును సారా చేసుకోరాదు. ఈత, తాటిచెట్ల కమ్మలను, ఆకులను మాత్రం పట్టా రైతు అనుభవించవచ్చు. (సెక్షను. 34) అయితే తాలూకాదారు అనుమతితో తన పొలంలో ఈత, తాడిచెట్లను నూతనంగా నాటుకోడానికి పట్టాదారుకు అవకాశం యివ్వబడింది. అలా పెంచుకున్న చెట్లపై గీతహక్కుతప్ప తతిమ్మా అన్నివిధాల అనుభవించే హక్కు పట్టాదారుకు యివ్వబడింది. (సెక్షను. 35.)

తాటి, ఈతచెట్లను ప్రభుత్వం గీతకు యిచ్చినప్పుడు మామ్లాపట్టినముస్తాజరు పట్టాదారుకు 'మాలిఖానా' అనబడే మొదళ్లపన్ను చెల్లించేవాడు. ముస్తాజరు యిష్టం వచ్చినంత మేరకుమాత్రమే ఈ మొత్తాన్ని ఇవ్వడం జరిగేదితప్ప ప్రభుత్వం యింత అని నిర్ణయించడం జరిగెదికాదు.

అదే విధంగా విప్పచెట్లగూర్చిగూడ. పట్టా భూములలో వున్న విప్పచెట్లు ప్రభుత్వానికి చెందివుండేవి. ప్రభుత్వమే వాటిపువ్వును హర్రాజు పెట్టుకొనేది. పట్టాదారు అలా హర్రాజు చేయబడిన విప్పచెట్ల పువ్వును ఏరుకోడానికి వీలు లేదిగాదు. చివరకు చెట్టుపడి క్రింద రాలిన పువ్వును ఏరుకొని సారా చేసుకోడానికికూడ వీలు లేదిగాదు. (సెక్షను 38)

ఈ విధంగా 1317వ ఫసలీ ల్యాండు రెవెన్యూ చట్టం ప్రకారం పట్టాభూములలోని చెట్లపై పట్టాదారులకు పరిమిత మైన హక్కుమాత్రమే సంక్రమించింది. ఇటీవలనే సంపూర్ణ హక్కు లభించడం జరిగింది.

1950జులై 28వ తేదీన హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ ఒక ఉత్తర్వు (నెం. 33) గావించింది. దాని ప్రకారం ఈత, తాడి, విప్పచెట్లపై ప్రభుత్వం అట్టిపెట్టుకున్న హక్కును వదులుకొని పట్టాదారులకు యిచ్చివేసింది. అయితే పట్టాదారులకు ఈత, తాడి, చెట్లను తామే స్వయంగా గీచు కోడానికి హక్కుమాత్రం యింకా యివ్వలేదు. అదే విధంగా విప్పపువ్వునుగాని లేదా విప్ప పలకునుగానివుపయోగించిసారా తయారు చేసుకొడానికి అధికారం ఇవ్వలేదు. గీతహక్కు, విప్పసారా చేసేహక్కును ప్రభుత్వం ప్రతిసంవత్సరం హర్రాజు చేస్తుంది. ఆ హక్కును హర్రాజుపొందిన కంట్రాక్టర్లు తామే స్వయంగా గాని లేక యితరులద్వారాగాని ఈత, తాడిచెట్లను గీయించడం లేక విప్పపువ్వు వేంచి సారా చేయించడం చేస్తుంటారు.

పట్టాదారులకు చెందిన తాటి, యీతచెట్లను హర్రాజు పద్ధతిపై ప్రభుత్వం ముస్తాజరుకు గీతకుయిస్తుందని పైన తెల్పాం. అలాగీతకుఇచ్చే చెట్లను వాటిపై పట్టాదార్లకువున్న యాజమాన్య పుహక్కును పురస్కరించుకొని పట్టాదార్లు మొదళ్ళపన్నును (హఖే మాలికానా) ముస్తాజర్లనుండి డిమాండు చేయవచ్చును. అయితే యీమొదళ్ళపన్ను మొత్తంచెట్లుధరలో నూటికి 25

వంతులకు మించరాదని ప్రభుత్వం నిర్ణయించింది. అంటే ముస్తాజర్లనుండి పట్టాదార్లు తాము గీతకిచ్చే చెల్లకు ఆ మేరకు మొదళ్ళపన్ను వసూలు చేయడానికి హక్కుకల్గి వుంటారన్న మాట. కాని ముస్తాజర్లు మొదళ్ళపన్నుక్రింద యెన్నడూ చెట్టుధరలో నాలుగోవంతు పట్టాదార్లకు చెల్లించినపాపాన పోలేదు. పైగా ఇచ్చేపన్ను అయినా సరిగా చెల్లించక నానాయాతనలుపెట్టుతుంటారు. ముస్తాజర్లు, పట్టాదార్లమధ్య ఈ మొదళ్ళపన్ను చెల్లింపు పైఅనేక ఘర్షణలుదారితీస్తూ వుండటం తరుచు జరుగుతోంది. అందుచేత మొదళ్ళపన్నును ముస్తాజర్లనుండిప్రభుత్వమే నేరుగా వసూలుచేసి రైతులకు చెల్లించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. (రెవెన్యూశాఖ ఉత్తర్వు 2-5-1952 దీనిప్రకారం మొదళ్ళపన్ను క్రింద చెట్టుధరలో నాలుగోవంతు ముస్తాజర్లు తహశీలుఖజానా (తాలూకా ట్రెజరీ) లో డిపాజిటుచేయాలి. ఆలాడిపాజిట్ చేసిన మొదళ్ళపన్ను మొత్తాన్ని అందుకు సంబంధించిన పట్టాదార్లకు కౌలుదార్లకుమధ్య వారివారిహక్కులనుబట్టి తహశీలుదారు పంపిణీచేస్తారు. ప్రభుత్వం యీవిధంగా మొదళ్ళపన్ను వసూలుచేసినందుకు వసూలు ఖర్చులక్రింద పట్టాదారులకు చెల్లించాల్సిన మొదళ్ళపన్నునుండి నూటికి 3 1/8 వంతులు అంటే రూపాయికి మూడుపైసలు అర్ధణా) చొప్పున మినహాయించుకొంటుంది. తతిమ్మా మొత్తాన్ని పట్టాదారులకు చెల్లిస్తుంది.

పైనతెల్పిన పద్ధతి 1952 సంవత్సరం అక్టోబరు 1 వ తేదీ నుండి అమలులోకివచ్చింది. దీనితో ముస్తాజర్లనుండి మొదళ్ళ

పన్ను పట్టాదార్లు వసూలు గావించుకోనాల్సిన లోగా పద్ధతి రద్దు అయింది.

పట్టాదార్లకు ఇష్టంలేకపోతే అసలు ఈత, తాడి చెట్లను గీతకు పట్టాదార్లు ఇవ్వ నిరాకరించవచ్చు. అయితే హర్రాజు అయిన సంవత్సరంమాత్రం తప్పక గీతను అంగీకరించాలి. ఆ మరుసంవత్సరం పట్టాదారుకు ఇష్టంలేకపోతే గీతను యిగాసుని ఎక్సైజుడిపార్టుమెంటుకు హర్రాజు తేదీకు ముందే తెల్పుకొని గీత నుండి మినహాయింపు చేయించుకోవచ్చు. అదేవిధంగా విప్ప చెట్లనుగూడ కంట్రాక్టర్లకు ఇవ్వకుండా మినహాయింపు చేయించుకోవచ్చు.

తమ భూములను శుభ్రపర్చుకోడానికి లేక అభివృద్ధిగావించుకోడానికి పట్టాదారులు ఈత, తాడి లేక విప్పచెట్లను నరికి వేయవచ్చును. వాటి కలపను స్వేచ్ఛగా అనుభవించవచ్చు.

ఈవిధంగా పట్టాభూములలోని చెట్లపై పూర్తిహక్కును మొత్తో ఆందోళనమీాద హైదరాబాదుప్రభుత్వం యిటీవలనే పట్టాదారులకు సంక్రమింపజేసింది.

పట్టాభూములలోగాని లేక మరిఏవిధంగానైనా ఆక్రమిత భూములలోగానివున్న చెట్లుతప్ప తతిమ్మా భూములలో అంటే నదులు, వాగులు, చెరువులు, కుంటలు, చెరువుతోట్లలోనూ, రోడ్లప్రక్కనూ వున్న చెట్లపై ప్రభుత్వానిదేహక్కు. ఈ చెట్ల ఫలసాయాన్ని ప్రభుత్వం ప్రతిసంవత్సరం హర్రాజు పెడుతుంది; లేదా చెట్టునే మొత్తం అమ్మివేస్తుంది.

పట్టాదారులకు నదులు లేక వాగులు లేక చెరువులు ప్రక్కనే భూములున్నట్లయిన వాటిగట్లపై చెట్లు నాటుకోడానికి తాలూకాదారుకు దరఖాస్తు చేసుకోవచ్చు. అట్టి దరఖాస్తులపై చెట్లునాటడానికి అనుమతిపొందిన పట్టాదారులు చెట్లు పెంచుకొని వాటి ఫలసాయాన్ని అనుభవించవచ్చును.

సైర్ మైసురా భూములలోవున్న చెట్ల ఫలసాయాన్ని ఆ భూమి గ్రామప్రజలు అనుభవించవచ్చు. ప్రభుత్వం రిజర్వుగా వుంచుకొన్న చెట్ల ఫలసాయం, విప్ప, ఈత తాటి, టేకు వగైరా చెట్ల విషయంలోతప్ప.

జంగ్లాతు గ్రామాలలో రిజర్వుకు వెలుపలవున్న పట్టాభూములలోవున్న జంగ్లాతు శాఖకు చెందిన టేకుచెట్లపైగూడ పట్టాదారులకు అధికారంవుంది. అదేవిధంగా తమ పట్టాభూములలో పెరిగే తునికి ఆకుపైగూడ హక్కువుంది. అయితే టేకుకలపను పట్టాభూమిలోనుండి యింటికి తీసుకుపోవాల్సివచ్చినప్పుడుగాని, లేక తునికిఆకు తుంచుకొనిపోవాలంటేగాని వాటికి జంగ్లాతు శాఖవాళ్ల ప్రత్యేక పర్మిట్లు వుండాలి. ముందుగానే ఆ పర్మిట్లు తెప్పించుకోవాలి. (ఈ విషయాన్ని తెల్పుతూ 1952 ఆగష్టు 9 వ తేదీన ఒక ప్రభుత్వప్రకటన వెలువడింది.)

## —♦ కౌలుదార్లకు చెట్లపైఉన్నహక్కులు. ♦—

1317 ఫసలీ ల్యాండు రెవెన్యూ చట్టంద్వారా యితర విషయములలో కౌలుదార్లకు ఏవిధమైనహక్కులు సంక్రమించనట్లే చెట్లపైగూడ ఏవిధమైన హక్కులు ఏర్పడలేదు.

1354 వ ఫసలీ ఆసామీ శిక్మీ చట్టంప్రకారం ప్రథమపర్యాయంగా రక్షితకౌలుదార్లకుగా చట్టం అమలులోకివచ్చాక కొత్తగా ఆసామి శిక్మీగా వున్న వారికి చెట్లపైకొంతవరకు హక్కులు లభించాయి. ఆసామి సిక్మీ చట్టం 19 వ శెక్షను ప్రకారం ఆచట్టానికిపూర్వము రక్షితఆసామిసిక్మి తనకబ్జాకాలంలో భూఖామందుఅనుమతితో ఏవైనచెట్లునాటివున్న గాని లేక చట్టంఅమలులోకివచ్చినతరువాత భూఖామందు అనుమతిలేకుండా స్వతంత్రించి నాటినగాని, అట్టిచెట్లఫలసాయాన్ని ఆరక్షితకౌలుదారు తనకబ్జాకాలం వరకు అనుభవించడానికి హక్కుకలిగివుండెను. కబ్జాకాలం పూర్తి అయ్యాక ఆ చెట్లు ఖరీదుక్రింద తహశీలుదారుగాని, లేక తాలూకాదారుగాని, నిర్ణయించిన నష్టపరిహారాన్ని కౌలుదారుకు భూఖామందు చెల్లించవలసి వుండెను.

పైవిధంగా చట్టంతరువాత ఆసామీశిక్మీగా వున్నవారికికూడ తమకబ్జాలో వున్నభూమిపై హక్కు వుండెను. (సెక్షను 19).

నేడుఅమలులోవున్న కౌలుదారీచట్టంప్రకారంకూడ కౌలుదార్లకు తమకబ్జాభూమిలోవున్న చెట్లపైహక్కులు లోగడవలెనే వుంచబడ్డాయి. 1950 కౌలుదారీ చట్టం క్రింద మరొక హక్కు అదనంగా ఇవ్వబడింది. కౌలుదారుచేస్తున్న భూమిలో ప్రకృతిసిద్ధమైన చెట్లు ఏవైనా పెరిగివున్నా (వాటంతట అవే మొలచి పెరిగినచెట్లు) అట్టిచెట్లఫలసాయంలో రెండువంతులు కౌలుదారుకు ఒకవంతు భూఖామందుకు చెందాలని చట్టంలో చెప్పబడివుంది. (1950 కౌల్దారీచట్టం. శెక్షను 24).

ఈ విషయంలో ఏమైనా భూస్వామందుకు, కౌలుదారుకుమధ్య తగాదా వస్తే తహశీలుదారు ద్వారా పరిష్కారం చేసుకోవాల్సివుంది.

కౌలుదార్లు తమ ఇష్టకాలంలో చెల్లనాటుకోవచ్చును. అవి పెరిగాక వాటిఫలసాయాన్ని కలపక స్వేచ్ఛగా అనుభవించవచ్చును. కౌలుకాలం అంతమయినప్పుడు ఆచెట్లను కౌలుదారు కొట్టుకుపోవచ్చును. లేదా తహశీలుదారు నిర్ణయించిన నష్టపరిహారాన్ని భూస్వామందునుండి పొందవచ్చును. (శెక్షను. 23.)

### —♦ నదులు, వాగులు, చెరువులోతట్టులలో మట్టి, రాళ్లు, ఇసుక, మొరుసు మున్నగువాటిని వుపయోగించడానికి వున్న హక్కులు. ♦—

(i) నదులు, వాగులు లేక చెరువులోతట్టులనుండి లేదా ప్రభుత్వంకు చెందియున్న అనాక్రమిత బంజరుభూములనుండి ఇసుకగాని, మట్టిగాని, మొరుముగాని, రాళ్ళుగాని, గృహోపయోగం, వ్యవసాయ కార్యాలనిమిత్తం ఉచితంగా తెచ్చుకోవడానికి చట్టరీత్యా నేరంకాదు. (అలా తీసుకువెళ్లరాదని ప్రభుత్వం నిషేధిస్తూ ప్రత్యేకంగా ప్రకటన చేసివుంటేతప్ప.)

పెంకులు, లేదా ఇటుకలు తయారుగావించడమే వృత్తిగాగల కుమ్మరివారుగాని, (కుమ్మరులు వగైరా) లేక అలాంటి వృత్తిగల మరెవరైనాగాని తమ కర్మాగారానికిగాని లేక

వ్యాపార కేంద్రానికిగాని అనేకచోటులలోవున్న ప్రదేశంనుండి తమ సరుకులను ఉపయోగించేమట్టిని వుచితంగా తెచ్చుకోవచ్చు. అయితే అలాంటిచర్యలు యితరులకు నష్టదాయకములుగా వుండరాదు లేదా యితరులభవనాలకు ప్రమాదకరంగా పరిణమించరాదు. లేదా గ్రామపౌరుల సాధారణప్రయోజనాలకు భంగకరంగా వుండరాదు.

అటాకు గ్రామమున్న వృత్తిదారులు మట్టి తెచ్చుకొనేందుకు తహశీలుదారు గ్రామంలో కొన్ని ప్లాటులను ప్రత్యేకించవచ్చును. అలాంటప్పుడు ఆ ప్లాటులలోతప్ప, ఆ వృత్తిదారులు యితరచోట్ల మట్టి తెచ్చుకోవడం చట్టవ్యతిరేకమౌతుంది.

ఏ యింటికైనా 5 గజాలదూరంలో ఎవరైనా గొయ్యిపెట్టి తవ్వడం చట్టవ్యతిరేకమౌతుంది.

(iii) పట్టాదారుల భూములలో గృహనిర్మాణ కార్యాలకు, వ్యవసాయపనులకు (భావులు కట్టుకోడానికి, కొట్టాలు నిర్మించుకోడానికి వగైరా) తమ పట్టాభూములలోవున్న కొండరాతిని ప్రభుత్వానికు ఎట్టిపన్నూ చెల్లించనవసరం లేకుండానే కొట్టించుకొని వుపయోగించుకోవచ్చు.

పట్టాభూములలో ఏవైనా బొగ్గుగనులుగాని, రాతిగనులుగాని లేక నూనెగనులుగాని పడితే వాటిపై ప్రభుత్వానికే అధికారం వుంటుంది.

—♦ పట్టా నారియు కౌలుభూములు కానట్టి ప్రభుత్వ అనాక్రమితభూములు (పోరంబోకు, బంచరాయి. జంగ్లాతు, ఖార్జికాతా వగైరా భూములు.) ♦—

పట్టాదారుల స్వంతసాగుక్రిందగాని లేక కౌలుదార్ల కబ్జాక్రిందగాని ఆక్రమితభూమిగా వున్నదిపోను యింకా పోరంబోకు, బంచరాయి, జంగ్లాతు, ఖార్జికాతాలక్రిందవున్న అనాక్రమితభూములు చాలావున్నాయి. జంగ్లాతుక్రిందవున్న భూమిపోను, యిలాఅనాక్రమిత భూమిగావున్నది దాదాపు సంస్థానం మొత్తంమీద మొత్తంభూవిస్తీర్ణంలో నూటికి 24 వంతుల వరకూవుంది. ఇందులో సాగులాయకు, సాగుబేలాయకు భూమి గూడవుంది. తక్షణంసాగుకు వినియోగపడని భూమి తీసివేసినా, సాగుకు లాయకుగా వున్న భూమి కనీసం నూటికి 10 వంతులకు తక్కువవుండదు. ఈ భూమినంతా వ్యవసాయకూలీలకు, తదితర భూములులేని పేదప్రజలకు ఖాస్తుకు, పట్టాలపైనా యిప్పించేందుకు ఆందోళన గావించాలి. సాగుకు లాయకుఅయిన పోరంబోకు, బంచరాయి, ఖార్జికాతా వగైరా భూములను సాగులోకి తెప్పించడానికి, (పట్టాలపైగాని, లేక కౌలుకుగాని) ప్రభుత్వనిబంధనలు ఏవివున్నాయో పరిశీలిద్దాం.

పట్టాదారులు స్వంతసాగుక్రిందగాని లేదా కౌలుదార్ల కబ్జాక్రిందగాని వున్నభూములు మినహా తదితర అనాక్రమిత భూములన్నిటిపై యాజమాన్యం ప్రభుత్వానిదే. ఈ అనాక్రమితభూమిని ఖాస్తుచేసుకొనేందుకు తహశీలుదారుకు దరఖాస్తు చేయాల్సివుంటుంది. అలాదరఖాస్తు లేకుండా ప్రభుత్వ స్వాధీ

నంలోవున్న ఏ అనాక్రమిత భూమి పైనైనా ఎవరైనా ఆక్రమించితే ప్రభుత్వ కానూనుప్రకారం అట్టి ఆక్రమణ చట్టసమ్మతంగాదు. అలా ఎవరైనా ఆక్రమించినప్పుడు తహశీలుదారు యీక్రిందిపద్ధతులు అనుసరిస్తాడు.

(అ) ప్రభుత్వ అనుమతి లేకుండా ఆక్రమింపబడిన భూమి పైబందోబస్తు జరిగి శిస్తునిర్ణయింపు అయివుంటే ఆశిస్తు మొత్తాన్ని ఆక్రమణదారునుండి ప్రభుత్వం వసూలు చేస్తుంది. అలాబందోబస్తు గాకుండానూ, శిస్తునిర్ణయం జరుగకుండాను వుంటే ఆ గ్రామములోగాని, ప్రక్కనున్న యితర గ్రామాలలో గాని, ఆతరగతి భూమికి ఎంతశిస్తురేటువుంటే ఆ రేటుప్రకారం ఆక్రమితదారునుండి శిస్తువసూలు చేయబడుతుంది.

ఈవిధంగా మామూలు శిస్తువసూలు చేయబడడమే కాకుండా తహశీలుదారుఅనుమతి లేకుండా ఆక్రమణ గావించినందుకు విధించే తావాన్ పెనాల్టీగూడ వసూలుచేయబడుతుంది. తహశీలుదారుశిస్తురేటుకు పదిరెట్లవఱకు తావాన్ విధించవచ్చు. తహశీలుదారు తావాన్ విధించుతూ జారీచేసిన ఉత్తర్వుపై తాలూకాదారుకు అప్పీలుగావించుకోవచ్చు. తాలూకాదారు నిర్ణయమే అంత్యనిర్ణయం.

(ఆ) పైవిధంగా అనుమతిలేకుండా సాగుచేసినందుకు ఆక్రమణదారునిపై తావాన్ విధించకుండా అసలు భూమినుండి వెళ్లగొట్టేందుకు గూడ తహశీలుదారుకు అధికారం వుంటుంది. అయితే విత్తనం వేయకముందే యీవిధంగా బేదఖలీ చేయాలితప్ప

ఒకదఫా విత్తనం వేసాక అట్టిభూమిని తిరుగదున్నించరాదు; పైరుపంటకువచ్చాక పంటనుజప్తుచేసి స్వాధీనపర్చుకోవచ్చు.

అయితే ఆక్రిమణదారుని స్వాధీనంలో ఆక్రమణ తేదీ లగాయతు ఆక్రిమిత భూమి రెండేళ్లకు తక్కువ లేకుండా వున్నప్పుడు ఆక్రిమణ దారుని బేదఖలీ గావించరాదు. తావాన్ మాత్రం ప్రతిసంవత్సరం విధించుతూ వుండవచ్చును.

ప్రభుత్వ అనాక్రిమిత భూముల క్రిందకు యీ క్రింద పేర్కొన్నబడిన భూములు వస్తాయి:—

(అ) పోరంబోకు, బంచరాయి (గైరాన్) భూములు.
(ఆ) గ్రామకంఠాలు (గైవుటూన్)
(ఇ) ఖార్జిఖాతాభూములు (విడుదల పెట్టినభూములు)
(ఈ) చెరువులోతట్టుభూములు (సికింతలాబ్)
(ఉ) నదీలంకలు.
(ఊ) ప్రభుత్వం క్రింద వున్న యితర భూములు.

పైన తెల్పబడిన తరగతి భూములగూర్చి ఒక్కొక దాన్ని తీసుకుని తెల్పేముందు యీ భూములను ఖాస్తుకివ్వడంలో ప్రభుత్వం సాధారంగా అనుసరిస్తున్న విధానం గూర్చి తెలుసుకోవడం అవసరం.

ఇటీవల వరకు ప్రభుత్వం యీ భూములను పట్టాపై శాశ్వత కౌలుకు యివ్వడంకంటే ఏక్‌సాలా కౌలుకు యిచ్చే విధానాన్ని అవలంబించుతూ వచ్చింది. కాని యీ ఏక్‌సాలా కౌలు పద్ధతిని ప్రభుత్వం (ఒక్కసికింతలాబ్ విషయంలోతప్ప)

రద్దుగావించింది. హైదరాబాద్ ప్రభుత్వం రెవెన్యూశాఖ ది 29-10-49 వ తేదీన జారీచేసిన ఉత్తర్వు (జి. ఓ. నెం. 10.) ప్రకారం ఏక్‌సాలా కౌలు పద్ధతి రద్దు గా విం చ బ డిం ది. ఆ ఉత్తర్వులో యీ క్రింది విధంగా చెప్పబడివుంది:—

"యికముందు ప్రభుత్వ అనాక్రమిత భూములను ఏ పరిస్థితులలోనూ ఏక్‌సాలా ఖాస్తు చేసుకొనేందుకు అనుమతించరాదని ప్రభుత్వం యిందుమూలంగా ఆదేశిస్తోంది. ఈ ఉత్తర్వుకు పూర్వం ఏక్‌సాలా ఖాస్తుగురించి యివ్వబడిన వుత్తర్వులన్ని యీ ఉత్తర్వుతో రద్దు గావించబడుతున్నాయి. భూముల లావునీ దరఖాస్తులన్నింటిపై ప్రభుత్వం జారీ చేసిన లావునీ నిబంధనల ప్రకారం యికముందు చర్యతీసుకోవాలని రెవెన్యూ ఉద్యోగులందరినీ యిందుమూలంగా ఆదేశిస్తున్నాం."

"అయితే యీ వుత్తర్వు సికింతలాజ్ భూ ము ల ఏక్‌సాలా ఖాస్తుకు మాత్రం వర్తించదు. అంతేగాకుండా ఏ వారసులు లేకుండా పడివున్నట్టీ, పరాసు అయిన వారికి చెందినట్టీ పట్టాభూములు గూడ ఏక్‌సాలా ఖాస్తుకు యివ్వబడుతాయి."

(హైదరాబాదు ప్రభుత్వం. రె వె న్యూ శా ఖ. ది 29-10-1949 తేదీ ఉత్తర్వునుండి.)

కాబట్టి పోరంబోకు, గైరాన్, ఖార్జు కాతా వగైరా ప్రభుత్వ అనాక్రమిత భూములు (పైన తెల్పిన మినహాయింపులుతప్ప) నేడు పట్టా పైనే ఖాస్తుకు యి వ్వ బ డు తా యి; ఏక్‌సాలా ఖాస్తుకు యివ్వడానికి వీలులేదు.

గైరాన్ (బంచరాయి) భూముల విషయంలో మరొక ప్రభుత్వ నిబంధన వుంది; ఏ గ్రామములోనైనా ఆ గ్రామము లోని సాగుభూమి మొత్తంలో గైరాన్ భూమి నూటికి 10 వంతులకు మించి వున్నప్పుడే గైరాన్ భూమిని పట్టాపై ఖాస్తుకివ్వాలిగాని అంతకుతక్కువవుంటేమంజూరిచేయరాదు. ఈ నిబంధనకులోబడే గైరాన్ భూములను నేడు ఖాస్తుకు యివ్వడ జరుగుతోంది.

—♦ పరంబోకు, గైరాన్, ఖారిజ్ కాతా భూములు ♦—

పైన తెల్పిన నిబంధనలకు లోబడి ప్రభుత్వం స్వాధీనం లోవున్న భూములు ప్రభుత్వలావునీ నిబంధనల ప్రకారం ఖాస్తుకు యివ్వబడుతూ వున్నాయి. ఇటీవల కొన్ని ప్రత్యేక లావునీ నిబంధనలు కూడ జారీచేయబడ్డాయి. (వీటి పూర్తి పాఠాన్ని మరొక చోటయిచ్చాం.) ఈ లావునీ నిబంధనలను అనుసరించే నేడు బంచరాయి, పరంబోకు, ఖారిజ్ కాతా భూములు ఖాస్తుకు యివ్వబడుతున్నాయి. ఆ నిబంధనల సారాంశం ఏమిటో చూద్దాం.

1952 ఫిబ్రవరి 23 వ తేదీన హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ ఒక సర్క్యులరును జారీచేసింది. దానిలో యీ విధంగావుంది:—

ఇకముందు సికింతబాబ్ భూములు తప్ప తతిమా ప్రభుత్వ భూములు తాత్కాలికంగా ఏక్‌సాలా ఖాస్తుకు యివ్వబడవు.

ఖారిజ్ కాతా భూములు, తదితరసాగు లాయకు బంజరుభూములు యికముందు లావునీ నిబంధనల ప్రకారం పట్టాలపై మాత్రమే ఖాస్తుచేసుకోడానికి మంజూరు చేయబడాలి.

ఈ వుత్తరువుకు పూర్వం ఏక్‌సాలా ఖాస్తుపై హరిజనులు తదితర వెనుకబడ్డ తరగతులకు చెందిన వారిలో ఎవరికైనా ప్రభుత్వ భూములు మంజూరి చేయబడివుంటే అట్టి భూముల నుండి ఖాస్తుదారులను బేదఖలీ చేయరాదు. ఒక్కసంవత్సరం ఖాస్తు గావించిన వారికిగూడ యీ సౌకర్యాన్ని యివ్వాలి అంటే హరిజనులు అయితే ఒకసంవత్సరం మాత్రమే కబ్జా వున్నప్పటికీ అట్టివారిని బేదఖలీ చేయరాదన్నమాట.

ఏక్‌సాలా ఖాస్తుకు తీసుకున్నవారు పైన తెల్పినవిధంగా హరిజనులు కాకుండ తదితర వెనుకబడ్డ తరగతులకు చెందినవారు అయితే ఆ ఖాస్తు చేస్తున్న భూములకు యింకా యితర దరఖాస్తు దారులు వున్నప్పుడు లావునీ నిబంధనల ప్రకారం ఆ భూములను హరాజు పెట్టవలసి వుంటుంది. హరాజులో ఎవరు అధికంగా పాడుకుంటే వారికి అట్టిభూములను ఖాస్తుకివ్వవలయును.

(ఉ) హరిజనులు మున్నగు వెనుకబడిన కులాలకు చెందినవారి కబ్జాలో వున్నభూములకు పట్టాలు మంజూరిచేయడానికి తక్షణ చర్యలు గైకొనాలి. అలా పట్టాలు మంజూరి గావించేటప్పుడు ఒక ప్రత్యేక జాగ్రత్తను గైకొనాల్సి వుంటుంది: అదివరకే అధికంగా భూములు కల్గివున్నవారికి యింకా భూములు మంజూరి కాకుండా చూడాల్సి వుంటుంది.

(ఊ) పట్టాలుమంజూరి గావించేటప్పుడు తీసుకోవలసిన మరోజాగ్రత్త ఏమంటే మంజూరిగా బడ్డవారు యింతకు ముందే తమ స్వాధీనంలోవున్న భూములను సక్రమముగా సాగు చేయగల్గుతున్నారా లేదా అని చూడాల్సి వుంటుంది.

పైన తెల్పిన సర్క్యులరుతోపాటు ది 9-1-1952 తేదీన రెవెన్యూశాఖ మరొక వుత్తర్వును జారీగావించింది. దానిలో రెవెన్యూ వుద్యోగుల అనుమతి లేకుండా ఖాస్తుగావించబడిన ప్రభుత్వ భూముల సాగుగూర్చి సూచనలు యివ్వబడ్డాయి. వాటిసారాంశం యిది:—

(అ) సాధారణంగా ప్రభుత్వంఅనుమతిలేకుండా ప్రభుత్వ భూములను ఆక్రమించరాదు. అయితే షెడ్యూల్డు తరగతులు, వెనుకబడ్డ తరగతులు లేక భూములులేని తదితర ప్రజలు ప్రభుత్వ భూములను ప్రభుత్వ అనుమతిలేకుండా ఆక్రమించి సాగును పూనుకొని సాగు అనంతరం వాటిని పట్టా పై మంజూరిచేయమని దరఖాస్తు చేసుకున్నప్పుడు తాలూకాదారు (జిల్లా కలెక్టరు) అట్టి భూములను స్వంత బాధ్యతతో మంజూరి చేయవచ్చు. భూముల అమ్మకంగూర్చి హర్రాజు పెట్టకుండానే ఖాస్తుదారులకు పట్టాలు మంజూరి చేయవచ్చు.

(ఆ) షెడ్యూల్డు తరగతులుకాని యితరులు అలాఅనుమతిలేకుండా అక్రమణ గావించివుంటే అట్టిఆక్రమణదారులకు కనీసప్రమాణంభూమి కంటే 10 ఎకరాలతరి మరియు 50 ఎకరాలచెల్కా భూమికంటె ఎక్కువ లేకుండా వున్న వారిలో 6 సంవత్సరాలకు తక్కువ కబ్జా లేనివారిని బేదఖలీ చేయ

నవసరం లేదు. అయితే వారివద్ద భూమిశిస్తు రేటుకు 16 రేట్లు చొప్పున మొత్తం భూమికి ఖరీదు తీసుకుని ఆ భూములకు పట్టా మంజూరి చేయవచ్చు.

పైన తెల్పిన ప్రమాణానికి అంటే 10 ఎకరాల తరి మరియు 50 ఎకరాల చెల్కా-భూమి కంటె అధికంగా భూమి కల్గిన భూఖామందులను మాత్రం తక్షణమే అట్టి భూముల నుండి బేదఖలీగావించాల్సి వుంటుంది. ఆవిధంగా బేదఖలీచేయ బడ్డభూములను హరిజనులకు తదితర భూమిలేని ప్రజలకు లావుని నిబంధనల ప్రకారం ఖాస్తుకివ్వాలి.

అయితే పైన తెల్పిన ప్రమాణం కంటే ఎక్కువ కల్గిన భూఖామందుల సాగుభూముల ప్రక్కను ఏవైనా బంచరాయి, లేక పరంబోకు భూముల ముక్కలు వుంటే వాటిని మాత్రం పైన తెల్పిన విధంగా ఖరీదు కట్టి వారికి పట్టాకు యివ్వవచ్చును. అయితే యీసౌకర్యం 50 ఎకరాలతరి మరియు 250 ఎకరాల చెల్కా-భూమికిమించి భూమికల్గిన పెద్దభూస్వాములకు ఏపరిస్థితుల లోనూవర్తింపజేయరాదు.

పైన తెల్పిన సౌకర్యాన్ని ప్రత్యేక సందర్భాలలోనే అంటే వ్యవసాయాన్ని చేసుకోడానికి ప్రక్కనున్న పరంబోకు లేక బంచరాయిది ఖండాలు తమకు అత్యావసరమైన సందర్భా లలోనే భూఖామందులకు యివ్వాలి. ఈ సౌకర్యాన్ని వుప యోగించుకొని భూస్వాములు తమ భూముల ప్రక్కనున్న పోరంబోకు ఖండాలను దురాక్రమణ చేయడానికి ప్రయత్నించ కుండా రైతువర్కర్లు జాగ్రత్తలు తీసుకోవాలి.

(ఇ) పోరంబోకు, గైరాన్ భూమి తగినంతగా వుంటే ఆ భూములకోసం హరిజనులు మున్నగు షెడ్యూల్డు తరగతి ప్రజలు దరఖాస్తు చేయకపోతే ఆ భూములను మామూలు పద్ధతిలో హర్రాజు గావించి అమ్మవచ్చును. హర్రాజులో ఎక్కువ పాడినవాండ్లకు పట్టాలుపై మంజూరు చేయవచ్చు.

హరిజనులు వగైరా షెడ్యూల్డు తరగతులవారు ఆక్రమించిన గైరాన్ భూముల గూర్చి ప్రత్యేకంగా ఒక సర్క్యులర్‌ను రెవెన్యూశాఖ యిటీవల అంటే 12-7-52 వ తేదీన జారీ జేసింది. అందులో సాగుభూమిలో నూటికి 10 వంతులకు తక్కువ లేకుండా గైరాన్ భూమి వుంటేనే పట్టాపై ఖాస్తుకు యివ్వాలని ప్రభుత్వ వుత్తర్వులు వున్నాయి. అయితే వీటిని ఆధారంగా గొని నూటికి 10 వంతులకు తక్కువగా గైరాన్ భూములున్నచోట్ల ఖాస్తు చేస్తున్న గైరాన్ భూములనుండి హరిజనులను వెళ్లగొట్ట నవసరం లేదు అని తెల్పబడింది. రెండు లేక మూడు సంవత్సరాలు నుంచి ఖాస్తు చేస్తుంటే అలాంటి హరిజన ఖాస్తుదారులందరికీ (సాగుదారులందరికి) పట్టాలు మంజూరి చేయవలసిందిగా ఆ సర్క్యులర్ ద్వారా రెవెన్యూవుద్యోగస్థులందరూ ఆదేశింపబడ్డారు

అయితే యిలా పట్టాలు మంజూరి గావించడంవలన నిర్ణీత గైరాన్ భూమి విస్తీర్ణం తగ్గితే ఆ తగ్గిన మేరకు భర్తీ చేయడానికి ఆ గ్రామములోనే వుండే పోరంబోకు భూమిని విడగొట్టి గైరాన్ క్రింద అట్టిపెట్టి అలా రికార్డ్సులో నమోదు చేయవచ్చును.

మొత్తంమీద ప్రభుత్వం అనాక్రమిత భూముల సాగు గూర్చిన యీ సర్క్యులర్ల సారాంశం ఏమిటి?

(1) ఇకముందునుండి పోరంబోకు, గైరాన్, ఖారిజ్ ఖాతా భూములు ఏక్‌సాలా ఖాస్తుపై మంజూరి చేయబడవు. శాశ్వత పట్టాల పైనే మంజూరి చేయబడతాయి.

(2) సాధారణంగా హరిజనులు మున్నగు పెడ్యాల్డ తరగతులకు చెందినవారు ఖాస్తు చేసుకోవడం కోసం పెట్టుకొనే దరఖాస్తులను ముందుగా మంజూరి చేయాలి. ఆ తరువాతనే గ్రామములోని యితర ప్రజానీకం పెట్టుకునే దరఖాస్తులను పరిశీలించాల్సి వుంటుంది.

అయితే యీ నిబంధనను అమలు జరిపేప్పుడు కాంగ్రెసు ప్రభుత్వం గ్రామ ప్రజల మధ్య ముఖ్యంగా రైతులు, కూలీల మధ్య ఐకమత్యాన్ని విచ్ఛిన్నం గావించే దురుద్దేశ్యంతో ప్రవర్తించడం మనం నేడు గ్రామాలలో చూస్తున్నాం.

పేదరైతులు కొన్ని సంవత్సరాలనుండి ఖాస్తు చేస్తున్న పోరంబోకు, గైరాను భూములను గూడ ఊడబెరికి హరిజనులకు హరిజనోద్ధరణ పేరిట యివ్వడం జరుగుతోంది. చైతన్యం లేని హరిజనులు భూమికావాలనే తహతహతో ప్రభుత్వం, గ్రామ పటేలు పట్వారీలు పన్నిన యీ కుట్రలో చిక్కుకుంటున్నారు.

భూమికోసం తహతహలాడుతున్న భూములులేని పేద ప్రజలు భూస్వాములకు చెందిన విశాల భూఖండాలను ఎక్కడ ఆక్రమించుకుపోతారో అని చచ్చేంతభయం పెద్దభూస్వాములకు వుంది. అందుచేత హరిజనులను కొంతవరకు సంతృప్తి పర్చడానికి

గత 5, 6, సంవత్సరాలలో భూస్వామి వ్యతిరేక పోరాటంలో నిర్మింపబడిన రైతు కూలీ ఐక్యతను విచ్ఛిన్నం గావించడానికి కాంగ్రెసు ప్రభుత్వం ముఖ్యంగా గ్రామ భూస్వాములుగావున్న పటేలు పట్వారీలు పేదరైతులు ఖాస్తు చేసుకుంటున్న ప్రభుత్వ భూములపై హరిజనులను ఎగతోలుతున్నారు. ఈ విషయాన్ని హరిజనులకు ఎత్తి చూపాలి. పేదరైతులు, మధ్య తరగతి రైతులు కొన్ని సంవత్సరాలుగా ఖాస్తుగావిస్తున్న గైరాన్, పోరంబోకు మున్నగు ప్రభుత్వభూములకు దరఖాస్తులు పెట్టవద్దని హరిజనులకు నచ్చజెప్పాలి. అనాక్రమితంగావున్న యితర ప్రభుత్వ భూములకు దరఖాస్తులు హరిజనులచేత పెట్టించాలి. ఆ భూముల కోసం భూములున్న పేదరైతులుగాని యితర గ్రామ పేదలుగాని ఎగబడి హరిజనులకు పోటీపోకుండా చూడాలి; హరిజనుల దరఖాస్తులను బలపర్చేందుకు తతిమా పేదప్రజలను సమీకరించాలి. ప్రభుత్వం భూములు తగినంతగా లేనప్పుడు ఆ గ్రామములోవున్న పెద్ద భూస్వాములక్రిందవున్న కంచెలను, పడావు భూములను ప్రభుత్వం వశపరుచుకొని హరిజనులకు ఖాస్తుకిప్పించమని పేద గ్రామస్తులందరూ కలిసి ఆందోళన గావించాలి. (ఈ విధంగా ప్రభుత్వం వశపర్చుకోడానికి 1950 కౌలుదారీ చట్టం సెక్షను 51 ప్రకారం అవకాశం వుంది.)

మైసూరా భూమి గ్రామానికి ఆనుకొనివున్న గ్రామాలలో అవసరమైతే మైసురాహద్దును యింకా లోపలికి జరిపి గైరాన్ భూమి విస్తీర్ణాన్ని పెంచమని ఆందోళనగావించాలి. అలా పెంచబడిన గైరాన్ భూమిని హరిజనులకు ఖాస్తుకివ్వ

మని ఆందోళన గావించాలి. ఈ విధంగా హరిజనులకు భూమి సంక్రమించేందుకు ఎన్నిమార్గాలువుంటాయో అన్నిమార్గాలు ఆలోచించి భూమిని వారికి సంక్రమింపజేసేట్లు చూడాలి. ఇందుకోసం ఒకరికొకరి ఇక్కట్లను మరొకరు పరస్పరం బలపర్చు కొంటూ రైతు కూలీఐక్యతను పెంపొందించడానికి కృషిచే యాలి. ఈ విధంగానే పేదరైతుల భూములపై హరిజనులను ఎగత్రోలి తమ భూఖండాలను భద్రంగా కాపాడుకోవాలన్న పెద్దభూస్వాముల కుట్రలను అరికట్టగల్గుతాం. హరిజనులకు భూములనుమంజూరిచేయడంలో ముందుప్రాధాన్యతయివ్వాలన్న ప్రభుత్వ వుత్తరువులను జాగ్రత్తగా అమలుజరిపేందుకు ఆందోళ నగావించాలి.

(3) ముందుగా అనుమతిలేకుండానే ప్రభుత్వభూములను హ రి జ ను లు ఆక్రమించి వున్నప్పటికీ కొన్నినిబంధనలకు లోబడి హరిజనులకు వాటిని పట్టాపై యివ్వాలని సర్క్యులరు లలో చెప్పబడివుంది. హరిజనులకివ్వబడిన యీ సౌకర్యాన్ని పూర్తిగా అమలుజరిగేట్లు ఆందోళనగావించాలి. హరిజనులకు పట్టాలివ్వడాన్ని పేదరైతులుగూడ బలపర్చేట్లు చూడాలి. పేదరైతులనుండి ఎవరూ పోటీకి పోకుండా చూడాలి. అప్పుడే రైతు కూలీ ఐక్యతచెడకుండా వుంటుంది.

(4) మొత్తం సాగుభూమిలో నూటికి పదివంతులకు పైగా బంచరాయిభూమి వున్నప్పుడే బంచరాయిభూమిని ఖాస్తు కివ్వాలని ప్రభుత్వ వుత్తర్వువుంది. ఈ వుత్తర్వును అమలు పర్చడంలో జాగ్రత్తలు తీసుకోకపోతే గ్రామపేదల మధ్య

తగాదాలకు దారితీస్తుంది. అట్టి తగాదాలు బయలు దేరుతు
న్నాయి కూడ గ్రామాలలో గొర్రెలు, మేకలు మున్నగు
జీవాల పెంపకంపై ప్రధానంగా జీవించే గొల్లలు తగిన సంఖ్య
లో వుంటున్నారు. వారు గొర్రెలు వగైరాల మేతకోసం
అధికంగా బంచరాయిభూమి వుండాలని కోరడం సహజమే.
బంచరాయిభూమిని ఖాస్తుచేయాలని ఏభూముల ఆధారంలేని
వ్యవసాయ కూలీలు కోరుకోవడం గూడ సహజమే బంచరాయి
భూమిని ఖాస్తుచేయటాన్ని తరుచు గొల్లలు అభ్యంతర పెట్టడం
జరుగుతోంది. హరిజనులను పేదరైతుల భూములపై ఎగదోలు
చున్నట్లే బంచరాయిభూములను ఖాస్తుచేయడానికి పెట్టుకున్న
దరఖాస్తులు మంజూరిచేయరాదని గొల్లలను రెచ్చగొట్టి వారిచే
అడ్డుపుల్లలు పెట్టించడం జరుగుతోంది.
బంచరాయిభూములను స్వేచ్ఛగా తమ గొడ్లు గోదెలను మేపు
కుంటూ వుంటున్న పెద్దభూస్వాములు అట్టిబంచరాయిభూములు
సాగుక్రిందకువస్తే తమ పశువులకు స్వేచ్ఛగా తిరగడానికి
భూమి తగ్గిపోతుందనే దురద్దేశ్యంతో గొల్లలను యీ
విధంగా రెచ్చగొడుతున్నారు. ఇలాంటిచోట్ల గొల్లలకు అట్టి
స్వార్థపరుల దురుద్దేశ్యాలను గూర్చి వివరపర్చి హరిజనుల
దరఖాస్తులకు అడ్డుపోకుండా చూడాలి. గొల్లల వాస్తవ అవస
రాలను గుర్తించి ఆమేరకు తగినబంచరాయి ఖాస్తుగాకుండా
అట్టిపెట్టేట్లు చూడాలి; గైరాన్ భూముల ఖాస్తుకోసం దరఖాస్తు
లుయిచ్చే హరిజనులు, తదితర పేదప్రజలు గొల్లలను కలుపుకు
పోయేట్లు చూడాల్సివుంటుంది. గొల్లల వాస్తవిక కోర్కెలను

గమనించాల్సి వుంటుంది. అప్పుడే స్వార్థపరులైన భూస్వాములు సైరాన్ భూములను ఖాస్తు కానీయకుండా గావించే కుట్రలను భగ్నంగావించి పేదప్రజలకు భూములు యిప్పించగల్గుతాం. గ్రామాల అవసరాలకు తగినవిధంగా బంచరాయి భూమిని అట్టిపెట్టకల్గుతాం. పేదరైతులు హరిజనుల మధ్య ఐక్యతకు భంగం కలుగకుండా మనం ఎలా కృషి చేయాలో అదేవిధంగా గ్రామాలకు సైరాన్ భూములసాగుదార్లకు ఖాస్తు చేస్తే తదితర ప్రజలకు మధ్య ఐక్యత చెడకుండా ప్రత్యేకజాగ్రత్త తీసుకోవాల్సివుంటుంది.

పెద్దభూస్వాములు ఆక్రమించుకొని వున్న సైరాన్ ఖారిజ్ ఖాతా పోరంబోకు భూములన్నింటిని విడగొట్టించి హరిజనులకు, భూములు లేని తదితర పేదప్రజలకు ఖాస్తు కిప్పించడానికి ఆందోళనగావించాలి.

పైన తెల్పిన ప్రత్యేక జాగ్రత్తలు తీసుకుంటూనే ప్రభుత్వ అనాక్రమిత భూములగూర్చి యిటీవల జారీచేయబడిన రెవెన్యూ శాఖ వుత్తర్వులను సాధ్యమైనంత ఎక్కువగా వినియోగించుకోవాలి.

## — గ్రామకంఠాలు —

గ్రామకంఠం భూములగూర్చి యిచ్చట ప్రత్యేకంగా ఒక విషయాన్ని చెప్పాల్సివుంది. గ్రామకంఠంలో జేరవుండి నివేశనస్థలాలకు అనువుగా వుండే స్థలాలగూర్చి ప్రత్యేకంగా చెప్పాల్సివుంది.

నివేశనస్థలాల, భూములు॥ గ్రామకంఠానికి చెందిన గయ్యాలీ, తదితర పట్టాకాని ప్రభుత్వ భూములు అయివుండ

వచ్చు లేదా భూఖామందులకు చెందిన పట్టా భూములై వుండవచ్చు. ఈ రెండు సందర్భాలలోనూ నేడున్న కానూను ఏమిటి? దాని యెడల రైతుసంఘాల వైఖరి ఏమిటి అనేది ఆలోచించాలి.

ముందు పట్టాదారుకుచెందిన నివేశనస్థలాల గూర్చి ఆలోచిద్దాం.

1950 కౌలుదారీ చట్టం ప్రకారం కౌలుదారు అయిన వారు ఏ భూస్వామికిక్రింద తాము కౌలుకు చేస్తున్నారో ఆభూస్వామికి చెందిన నివేశనస్థలంలో యిల్లు తమ స్వంతఖర్చుతో తమ కౌలుకాలంలో వేసుకోడానికి అవకాశంవుంది. రక్షిత కౌలుదారుకు తనకబ్జాలోవున్న భూమిలో పశువుల కొట్టాం వేసుకోడానికిగూడ అవకాశంవుంది. అలా కౌలుదారు నిర్మించుకున్న యింటినుండి కౌలుదారుని భూస్వామి బేదఖలీ చేయరాదు. అయితే కౌలుదారు స్వంతఖర్చుతోగాక భూస్వామి ఖర్చుతో ఆయిల్లు కట్టబడివుంటే బేదఖలీ చేయడానికి భూస్వామికి అధికారం వుంటుంది. భూస్వామి తననివేశనస్థలాన్ని అమ్ముకోడానికి హక్కువుంటుంది. కాని స్వంతఖర్చుతో యిల్లు నిర్మించుకున్న కౌలుదారు తానే కొంటానంటే అతనికేస్థలాన్ని తహశీలుదారు నిర్ణయించిన ధరకుఅమ్మాలి. భూస్వామి స్థలాన్ని అమ్మతానని కౌలుదారుకు తెలియపర్చినప్పటినుండి మూడు నెలలలోపల కౌలుదారుకొంటానని తెల్పకపోతే భూస్వామియితరులకు అమ్మివేసుకోడానికి అవకాశం వుంది. అలాంటప్పుడు ఆ స్థలంలో కౌలుదారునిర్మించిన యింటికివిమ్మతు క్రింద నష్టపరిహా

రాన్ని తహశీలుదారుగాని లేక ట్రైబ్యునల్ వున్నట్లయిన అదిగాని నిర్ణయించిన ప్రకారం కౌలుదారుకు భూస్వామి చెల్లించాలి. అలానిర్ణయించిన మొత్తాన్ని అవ్మకం అయిన మూడునెలలలోపల చెల్లించాల్సివుంది.

పైన తెల్పిన పద్ధతి ఒక్క కౌలుదార్లవిషయంలోనే గాకుండా కౌలుదార్లుగా లేనట్టి వ్యవసాయ కూలీలు, వృత్తిదారులకుగూడ వర్తింపుతుంది. వ్యవసాయకూలీలు వృత్తిదారులకు చెందినవారు ఎవరైనా భూస్వామికిచెందిన నివేశనస్థలాలను ఆక్రమించుకునివున్నప్పుడు పైన తెల్పినవిధంగానే ప్రభుత్వం చర్యగైకొనాల్సివుంటుంది.

గ్రామకంఠంలో వుండి పట్టాదారులకు చెందని నివేశన స్థలాలలో యిండ్లు నిర్మించుకోవడం విషయమై హరిజనులకు, తదితర వెనుకబడిన తరగతులవారికి కొన్ని ప్రత్యేక సౌకర్యాలు వున్నాయి. స్థలం ఖరీదులో అధికభాగం ప్రభుత్వం భరిస్తుంది. తతిమా భాగాన్ని వాయిదాలబందీగా చెల్లించుకోడానికి హరిజనులకు అవకాశం వుంటుంది. (ఈ విషయంలో ప్రభుత్వం జారీగావించిన తుదివుత్తర్వులు మరోచోట వుదహరించడం జరిగింది.)

హరిజనులు ముఖ్యంగా వెనుకబడ్డకులాలకు చెందినవారు గాకుండా తదితర గ్రామస్తులైన సందర్భంలో నివేశనస్థలాలుగా వుపయోగించే గ్రామకంఠంభూములను ప్రభుత్వం ధరకట్టి యిస్తుంది. మొత్తం ఖరీదునంతా కొన్నవారినుండే వసూలు చేస్తుందిగాని ప్రభుత్వం భరించదు. అదేవిధంగా పట్టాదారుల

భూములను గూడ ప్రభుత్వం హరిజనుల యిండ్ల స్థలాలకోసం కొనవచ్చు. (అక్వైర్ చేయవచ్చు.) అయితే అట్టి పట్టా భూములకు ఆజ్ బాజ్ లోవున్న పట్టా భూములధర ప్రభుత్వం చెల్లించి యిండ్ల స్థలాలకోసం దరఖాస్తు యిచ్చినవారినుండి వాయిదాల మీద ఆ ధరను వడ్డీతో సహా రాబట్టుతుంది.

ఇండ్లస్థలాలను యిప్పించడంలో సాధారణంగా రైతు వర్కర్లు తీసుకోవాల్సిన వైఖరియిది:-

(i) గ్రామకంఠంకు చెందివుండి హరిజనులు, తదితర భూములులేని పేదప్రజలుచేత ఆక్రమించబడివున్న యిండ్లస్థలాల నుండి ఎవరినీ వెళ్లగొట్టకుండా ఆందోళనగావించాలి. తాకీదులు ఏమైనా విధించివుంటే అవన్నీ మాఫీచెయ్యాలి అని కోరాలి.

(ii) గ్రామకంఠాలకు చెందిన స్థలాలవిషయంలో యింతకుముందే హరాజు అయివుంటే హరాజు మొత్తంలో చెల్లించగా మిగిలివున్న బాకీలను పూర్తిగా రద్దు చేయమని కోరాలి.

(iii) ఇండ్లస్థలాలకు భూమిశిస్తు వసూలుగావిస్తూంటే దాన్ని రద్దుచేయాలని ఆందోళన గావించాలి.

(iv) ప్రభుత్వం అధీనంలోవుండి యిండ్ల స్థలాలకు వినియోగపడే గ్రామకంఠం భూములను హరిజనులకు, యితర వెనుకబడ్డ తరగతులవారికి ప్రత్యేకించి వారికి వుచితంగా మంజూరి చెయ్యాలని కోరాలి.

(౨) ఇటువంటి గ్రామకంఠం భూములు సరిపడ లేనప్పుడు ఇండ్లకు ఉపకరించే ఇనాం భూములను ప్రభుత్వం స్వంతఖర్చుపై అక్వైరుగావించి ఉచితంగా హరిజనులకు ఇప్పించాలని తీర్మానం చేయాలి. ఇందుకోసం పంచాయతీలు ప్రభుత్వం లేబరు డిపార్టుమెంటుకు, హరిజనోద్ధరణశాఖకు దరఖాస్తు పెట్టుకోవాలి.

—— శికింతలాంబు భూములు. ——

సాగునీటిని సప్లయిగావించే ప్రభుత్వ చెరువు లోతట్టు భూములను శికింతలాంబు భూములు అంటారు. వర్షాభావంవలన ఏదొకసంవత్సరమైనా లేక కొన్ని సంవత్సరాలవరకైనా అట్టిచెరువు లోతట్టుభూములు సాగుకు అనుకూలంగా తేలివున్నట్లయిన వాటిని ప్రభుత్వం సాగుకుయిస్తుంది. అయితే గైరాన్, పోరంబోకు వగైరా భూములమాదిరిగా వాటిని పట్టాపై శాశ్వితంగా మంజూరు చేయదు. ప్రతిసంవత్సరం హర్రాజుపైన సాగుకు యిస్తుంది. హర్రాజులో ఎవరు ఎక్కువపాట పెడితే వాళ్లకు మంజూరి చేస్తుంది. ఒకటకంటే అధికంగా కారులను పండించడానికివీలున్న చెరువులోతట్టుభూములు ఏకారుకాకారు ప్రత్యేకంగా హర్రాజు చేయబడతాయి. అదేవిధంగా గ్రామములో వున్న ఏచెరువు కాచెరువు ప్రత్యేకంగా హర్రాజు చేయబడుతుందిగాని మొత్తంగా అన్నిచెరువులు హర్రాజుకుపెట్టబడవు. ఇలా ప్రత్యేకంగా హర్రాజుపెడితే పాటమొత్తం పెరుగుతూ వుండి ప్రభుత్వాదాయం ఎక్కువఅవుతుందని ప్రభుత్వోద్దేశ్యం. అందుచేత హర్రాజులో ఒకరికొకరు పోటీపడి పాటమొత్తాన్ని

పెంచుకోకుండా చేయాలి. హరిజనులను, తదితర పేదప్రజలను ఐక్యంగావించి అందరికీఅందుబాటులో హర్రాజు రేటు వుండేట్లు చూడాలి. హరిజనులు మొత్తంగా పాడుకొంటూంటే రైతులు పోటీకి పోరాదు. అదేవిధంగా చెరువులోతట్టుభూమిని ఆనుకొని ఏ రైతుకైనాభూమివుంటే ఆరైతుకు అవసరమైనంతవరకులోతట్టు భూమి వ్యక్తిగతంగా హర్రాజుచేసుకోనివ్వాలి. అలాంటిదాని పై హరిజనులు ముందుగువా సపోటీకిపోరాదు. అయితే ఈపేరుతో ఎవరైనాఒక భూస్వామి లోతట్టుభూమిని తనస్వార్థంకోసం చౌకగా కాజేయాలని చూస్తున్నప్పుడు అట్టిచర్యను సాగనివ్వరాదు. మొత్తంమీద గ్రహించాల్సిదేమంటే భూమి తహాతహాతో ఒకరికొకరుపోటీలుపడుకొని హర్రాజు మొత్తాన్ని అంతులేకుండా పెంచుకుంటూపోరాదు. అది ప్రభుత్వానికితప్ప ఎవ్వరికీ ప్రయోజనవుండదు. పైగా రైతులు, కూలీలుమధ్య, కూలీలు కూలీలుమధ్య తగాదాలు పెరిగిపోతాయి.

చెరువు లోతట్టుభూమిలో స్వంతఖర్చుపై బావి త్రవ్వకొని తరిసాగు చేసుకోవచ్చు. ఇలాంటిసాగుకు తరి రేటు అదనంగా యివ్వనవసరంలేదు. హర్రాజు మొత్తం చెల్లించితే సరిపోతుంది. అయితే ఆచెరువులోవున్న ప్రభుత్వ బావులనుగాని లేక యితరవిధాల ప్రభుత్వపు నీటివనరులనుగాని ఉపయోగించుకోరాదు. అలా ఉపయోగిస్తే తరి రేటు అదనంగా చెల్లించుకోవాల్సి వస్తుంది.

హర్రాజు పూర్తిఅయి యింకా సాగు కాకపూర్వమే అకాలపు వర్షాలఫలితంగా చెరువు నిండిపోతే అట్లా ముంపుకు

లోనైనట్టి భూమికి దావాయిసామీద పాటమొత్తాన్ని వాపసుఇవ్వాలి. సాగుఅయ్యాక చెరువుకుముంపువస్తే మునిగిపోయిన విస్తీర్ణమునకు రిమిషన్ ఇవ్వాలి.

పైన తెల్పిన నిబంధనలే ఏటిలంకల ఖాస్తు విషయంలో గూడా వర్తింపుతాయి. ఏ పట్టాదారుని భూమిప్రక్కనైనా రెండుగుంటలకు ఎక్కువతరిభూమిగాని లేక ఒక ఎకరంకు ఎక్కువ ఖుష్కీభూమిగాని లంకఏర్పడితే దాన్ని సర్వేగావించి, శిస్తు నిర్ణయించి ఆ పట్టాదారునికి ఆ లంకకు పట్టాయిస్తారు. లంక విస్తీర్ణం అంతకు తక్కువ ఉంటే పట్టాఇవ్వరు. అదేవిధంగా పైనతెల్పిన పరిమితులలో సాగుభూమి నదీపాతమైనప్పుడు గూడ శిస్తు మాఫీచేస్తారు.

## తదితర ప్రభుత్వ భూములు.

ప్రభుత్వం ఏమైనా ప్రత్యేక పనులకోసం పట్టాభూములను ల్యాండు ఎక్విజిషన్ చట్టాన్ని అనుసరించి ఖరీదుకు తీసుకొనివుంటే (విమానాశ్రయాలనిర్మాణం మున్నగు పనులకోసం) ఆ ప్రత్యేక పనులు తీరినతరువాత వాటిని పడావుగా పెట్టివుంచవచ్చు. అట్టిసందర్భాలలో మరల వాటిని ఖాస్తు చేసుకొనేందుకు దరఖాస్తులు చేసుకోవచ్చును. అట్టిభూములను ప్రభుత్వం తాత్కాలికంగా సాగుకుగాని లేక శాశ్వితపట్టాపైగాని ఆయా భూముల స్వభావాన్ని, ఉపయోగాన్ని బట్టి మంజూరు చేస్తుంది. అయితే ఏ పరిస్థితులలో గూడ అట్టిభూములను ఉచితంగా మంజూరు చేయదు. బహిరంగ హరాజుపద్ధతిపైనే మంజూరు చేస్తుంది.

# అనుబంధము

## —♦ హైదరాబాదుప్రభుత్వం లావునీ నిబంధనలు — వాటిని అమలుపరుస్తూ రెవెన్యూశాఖ అప్పుడప్పుడు జారీగావించిన ఉత్తర్వులు-సర్క్యులర్లు. ♦—

గైరాన్, పోరంబోకు మున్నగు ప్రభుత్వభూముల ఖాస్తు గూర్చి యింతకుముందు ప్రభుత్వం అనుసరిస్తూన్న పద్ధతులను క్లుప్తంగా వివరించాం. రైతువర్గాలకు యీ విషయంపై సమగ్రసమాచారాన్ని అందజేసే ఉద్దేశ్యంతో హైదరాబాదుప్రభుత్వం లావునీ నిబంధనలగూర్చి ఇంతవరకూ ప్రకటింతుతూ వచ్చిన ప్రకటనలు, ఉత్తర్వుల సారాంశాన్ని యీ క్రింద పొందుపరుస్తున్నాం.

(i) హైదరాబాదుప్రభుత్వం — రెవెన్యూశాఖ.

ప్రభుత్వ ఉత్తర్వు నెం. 10. తేదీ 29-10-1949.

ప్రభుత్వ అనాక్రమితభూములను ఏక్‌సాలా ఖాస్తుపద్ధతిపై అనుమతిస్తూవచ్చిన ఆచరణవలన తరచుగా భూమిపరిపాలనా అవకతవకలు బయలుదేరుమన్నాయి. ప్రభుత్వం లావునీ నిబంధనలప్రకారం, ప్రభుత్వపు ప్రస్తుతఆర్డర్లు ననుసరించి దరఖాస్తు చేయబడినభూమి లావునీకి తగినవిధంగా వుండా లేదా అన్న విషయాన్ని పరిశీలించకుండానే దరఖాస్తుఇవ్వడం తమువుగా ఖాస్తు చేసుకోడానికి అనుమతి సాధారణంగా యివ్వబడుతోంది. అనేకసందర్భాలలో అట్టిభూములను లావునీ

నిబంధనలప్రకారం పరిష్కరించేందుకు చర్య తీసుకోవడంగాని
లేక ఒక సంవత్సరం సాగుఅయ్యాక ఏక్‌సాలా ఖాస్తుదారుని
భూమినుండి తొలగించడంగాని జరగడంలేదు. తత్ఫలితంగా
ఏక్‌సాలా ఖాస్తుదారు అట్టిభూమికి సంవత్సరాలతరబడి కబ్జా
దారుడై కొంతకాలంతర్వాత ఆ భూమిపై హక్కు తనదేనని
వాదించడంమూలా ప్రభుత్వాన్ని చిక్కుపరిస్థితులలోకి నెట్టడం జరు
గుతోంది. ప్రభుత్వ వ్యక్తికి ఇలా ఒకేసు ఒకటి వచ్చింది; అదే
మంటే ఏక్‌సాలా ఖాస్తుకు అనుమతిపొంది ఒక వ్యక్తి ఆభూ
మిపై [illegible] ఖాస్తు చేస్తూవుండెను ప్రభుత్వం
ఆ భూమిని [illegible] వ్యక్తికి
ఖాస్తుకు ఇవ్వడానికి ఒప్పుకుంది. అయినా ఏక్‌సాలా ఖాస్తు
దారు భూమికబ్జా వదులుకోలేదు. తనకు ఎక్కువకాలం
కబ్జా వుండిగానట్టి భూమిపై తనకే హక్కుండాలని వాదిం
చాడు. ఇట్టి చిక్కులు ప్రభుత్వానికి రాకుండా వుం
డేందుకుగాను యికముందు అనాక్రమిత ప్రభుత్వభూములను
ఎవరికిగూడ ఏక్‌సాలా ఖాస్తుపద్ధతిపై మంజూరుచేయడం నిలిపి
వేయాలని యిందుమూలంగా ఆదేశిస్తున్నాం. ఈ సర్క్యులర్
జారీగాకముందు ఏక్‌సాలా ఖాస్తు దరఖాస్తులను మంజూరిగా
విస్తూ యిచ్చిన ప్రభుత్వ ఉత్తర్వులు యిందుతో రద్దుచేయ
బడ్డాయి. లావునీ నిబంధనలప్రకారం పెట్టుకోబడిన దరఖాస్తు
లన్నిగూడ సాగుకాలం రాకమునుపే మంజూరి గావించడమో
లేక తిరస్కరించడమో తప్పక చేయాలి. ఇలాచేస్తే ప్రభుత్వం

అప్రిభూములు భూమిశిస్తును, దరఖాస్తులు మరీ ఆలస్యంగా మంజూరి చేసవలవలన, పోగొట్టుకోవలసిన పనివుండదు.

1350 ఫసలీలో రెవెన్యూశాఖచే జారీ చేయబడిన గస్తీ నెం. 7. (సర్క్యులరు నెం. 7) ఫలితంగా 1318 వ ఫసలీ బందోబస్తు నిబంధన. 15. కు ఒక సవరణగావించబడినది. దాని ప్రకారం ఏదైనా ఒక ప్రాంతం బందోబస్తు చేయబడుతున్నప్పుడు అలా బందోబస్తు చేయబడుతుందన్న ప్రకటన వెలువడే తేదీవరకు యివ్వబడిన లావుని దరఖాస్తులన్నింటి సందర్భంలో తాత్కాలికంగా ఏక్‌సాలా ఖాస్తు మంజూరి చేయాల్సివుంటుంది. అలా మంజూరు చేయబడ్డవారి లిష్టులను గ్రామాలవారీగా తయారుగావించి బందోబస్తు కమీషనర్‌కు పంపాలి. దానిమీదట అలా దరఖాస్తు చేయబడ్డభూములు ఏవైనా కార్యాలకోసం ప్రత్యేకింపబడినవో లేవో కమీషనరు పరిశీలించాలి. అలా ప్రత్యేకించలేదని తనకు విశ్వాసం కుదిరినప్పుడు వాటిని లావునీకోసం మంజూరి చేయవచ్చునని తనఅభిప్రాయాన్ని తహశీలుఆఫీసుకు ఆరు నెలలలోపల తెల్పి ఆ లిష్టులన్నింటిని తిరిగి పంపివేస్తాడు. ఇప్పుడు అసలు ఏక్‌సాలా ఖాస్తు పద్ధతినే రద్దుచేస్తున్నాం గనుక లావునీ దరఖాస్తులను 6 నెలల వరకు తేల్చకుండా అట్టిపెట్టి వుంచడం సవ్యమైనపనిగాదు. అందుచేత బందోబస్తు జరుగుచున్నకాలంలో ఆ ప్రాంతంలో యేదైనా లావునీ దరఖాస్తు పెట్టుకోబడినయెడల దరఖాస్తుదారు కోరినభూమి లావునీ చేయడానికి అనువుగా వుందని తహశీలుదారు భావిస్తే ఆ ప్రాంతంలోవున్న బందోబస్తు కమీ

షనుకు ఆ దరఖాస్తును పంపాలి. దరఖాస్తు చేయబడిన భూమి యితర ప్రత్యేక కార్యాలకోసం ఏమైనా విడిగొట్టబడివుందా అనే విషయాన్ని గూర్చి కమీషనరు అభిప్రాయాన్ని తెల్పాలి. బందోబస్తు కమీషనర్కు ఆ దరఖాస్తు గూర్చి ఎట్టి అభ్యంతరం లేకపోతేగాని లేక కమీషను అభిప్రాయం కోసం దరఖాస్తును కమీషనరుకు అందజేసిన ఒక నెలరోజులలోపల కమీషనరునుండి ఏ సమాధానం రాకపోయిన పక్షంలోగాని, తహశీలుదారు లావునీ నిబంధనలు ఆధారంగాగొని ఆ దరఖాస్తును మంజూరి చేయవచ్చును అని యిందుమూలంగా తెల్పుతున్నాం.

1318 వ ఫసలీ బందోబస్తు నిబంధన 33 ప్రకారం శికింతలాబ్ భూమి ఏక్సాలా ఖాస్తుకోసం పెట్టిన షరాగ్రులకు పైనతెల్పిన ఉత్తర్వు వర్తించదు. అదేవిధంగా బందోబస్తు 8, 9 నిబంధనల ప్రకారం చనిపోయిన, పరారైనవారి తాలూకు ఏక్సాలా ఖాస్తు పద్ధతిపై యివ్వబడిన భూములకు గూడ యీ వుత్తర్వు వర్తించదు.

(ii) హైదరాబాదుప్రభుత్వం — రెవెన్యూశాఖ సర్క్యులర్ సారాంశం:—

ఏక్సాలా ఖాస్తుపద్ధతిపై భూములను మంజూరు చేయడం ఆపివేస్తూ 29-10-49 తేదీన జారీచేయబడిన ప్రభుత్వం సర్క్యులరునెం. 10 కు ప్రస్తుతం ఖాస్తు చేస్తున్నవారినుండి సాగుభూములను ప్రభుత్వం లాక్కోవలసివుంటుందని అర్థం చెప్పడంజరుగు

తోంది. ఈ విషయాన్ని గూర్చి రెవెన్యూమంత్రిగార్కి మెదక్ జిల్లా సంచారంలో తెల్పబడింది. ఆ సర్క్యులరును పైన తెల్ప బడిన భాష్యం సరికాదు. ఇకముందునుంచి ఏక్‌సాలా ఖాస్తు పద్ధతిపై భూములను మంజూరి చేయరాదన్న విషయాన్ని స్పష్టం చేయడమే ఆ సర్క్యులర్ ముఖ్యోద్దేశ్యం. ఏక్‌సాలా ఖాస్తు పద్ధతిపై యింతకుముందు మంజూరిచేయబడ్డ భూములను యీ క్రింది సందర్భాలలో శాశ్వతపట్టాలివ్వాలని వుద్దేశింపబడింది. ఇతరవిధాల అభ్యంతరాలు ఏమీ లేకుండా. సాగుచేస్తున్న భూ [illegible] శాశ్వతపట్టాలు మంజూరు చేయవచ్చును. గతసంవత్సరంలో న మంజూరుఅయిన ఏక్‌సాలా ఖాస్తుభూములకుగూడ శాశ్వతపట్టా లివ్వవలసింది గా ఆ భూముల ఖాస్తుదారులు దరఖాస్తు చేసు కొన్నట్లయిన, మరి యితర కొత్త దరఖాస్తుదారులు ఎవరూ లేకపోయినట్లయిన శాశ్వతపట్టాలివ్వవచ్చును. ఇతరదరఖాస్తులు అట్టిభూములకు వచ్చివున్నప్పుడు లావునీ నిబంధనలప్రకారం ఆ భూములను హర్రాజుపెట్టి ప్రభుత్వానికి సాధ్యమైనంతలా భాన్ని చేకూర్చాలి. ఏక్‌సాలా ఖాస్తుపద్ధతిపై యివ్వబడిన తరి భూముల విషయంలో అట్టిభూములను యింకెవరైనా సాగుచేస్తా రేమో ముందుగా స్థానికాధికారులు పరిశీలించాల్సివుంటుంది. కాబట్టి అట్టిభూములను హర్రాజుకుపెట్టడం మంచిది. తగినంత వ్యవధితో సకాలంలో స్థానికంగా తెలియపర్చి హర్రాజు చేయాలి. ఫలానాఫలానా భూములు హర్రాజుకు పెట్టబోతు

న్యాయమని తాహసీలుదారుకి నోటీసులపై వ్రాతపూర్వకంగా తెలియపర్చాలి.

(ii) హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ ఉత్తర్వు.

విషయం:- భూములు లేనివారికి భూములు మంజూరు చేయడం గూర్చి:—

ఏక్‌సాలా ఖాస్తుపద్ధతిపై భూములను మంజూరు చేయడాన్ని నిషేధిస్తూ 29–10–49 తేదీన యిచ్చిన సర్క్యులర్‌ను యింకా స్పష్టపరుస్తూ 8–3–1950 తేదీన మరొకసర్క్యులరు జారీచేయబడింది. ఇకముందు ఏక్‌సాలా ఖాస్తుపద్ధతిపై భూములను మంజూరి చేయరాదనీ, అలా యింతకుపూర్వమే మంజూరి గావించిన భూములు ఖుష్కీ–భూములైతే, రెండు సంవత్సరాల నుండిగాని, అంతకంటే ఎక్కువకాలంనుండిగాని ఖాస్తు చేయబడుతూవున్నప్పుడు, వాటికోసం యితర దరఖాస్తులేవీ లేనప్పుడు వాటిని ప్రభుత్వం ఖాస్తు చేస్తున్నవారికి శాశ్వతపట్టాపై యిచ్చివేయాలని స్పష్టపర్చడానికే ఆ సర్క్యులరు జారీచేయబడింది. ఒకసంవత్సరం ఖాస్తుకోసం అని యివ్వబడిన భూములకుగూడ ప్రభుత్వపు ఖాస్తుదారులు శాశ్వతపట్టా కావాలని కోరుకున్నట్లయిన యితరవిధాల అభ్యంతరాలు ఏమీ లేకపోతే శాశ్వత పట్టాపై మంజూరి చేయవచ్చును. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

మైనచెప్పిన సర్క్యులర్ జారీ చేయబడ్డతరువాత ప్రభుత్వదృష్టికి ఒకవిషయం తేబడింది: పెద్దయెత్తున భూములుకల్గిన

భూఖామందులకుగూడ శాశ్వతపట్టాపై భూములను మంజూరు గావిస్తున్నట్లు తెలిసింది. పెద్ద భూఖండాలు కలిగివున్న భూఖామందులకేగాక వ్యవసాయంమొుఖమే యెరుగనట్టివారికిగూడ సైరాన్ భూములను శాశ్వతపట్టాపై మంజూరు చేస్తున్నట్లు ప్రభుత్వంకు తెలిసింది.

భూములు లేనివారికే భూములను మంజూరు చేయాలన్న ప్రభుత్వ పాలసీకి యిది విరుద్ధం. అందుచేత ప్రభుత్వం అనుమతిలేకుండా ప్రభుత్వభూములను సాగుచేస్తున్నవారి శాశ్వతపట్టాలు మంజూరుచేయడంలో రెవెన్యూ ఉద్యోగస్థులు అత్యంత విచక్షణాదృష్టితో మెలగవలసిందిగా కోరుతున్నాం. అలా భూములను మంజూరు చేయడంలో యీ క్రిందిపద్ధతి అనుసరించాలి. (1) పెద్దగా భూములులేనివారికి, (2) తన స్వాధీనంలోవున్న భూములను స్వయంగా సాగుచేసుకోగలవారికి మాత్రమే అట్టిభూములను మంజూరు చేయాలి.

ఇంతకుముందే ఎక్కువగా భూములుకలిగిన పెద్ద భూఖామందులు యింకా మరిన్ని భూములను కృత్రిమపద్ధతులద్వారా శాజేయకుండా సాధ్యమైన అన్నిచర్యలు గైకొనాలి.

తగినంత భూములు లేనివారికి భూములు మంజూరుచేసే దృష్టితోనే ప్రభుత్వంయొుక్క యీ ఆర్డర్లను అమలుజరపాలి.

(iv) హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ సర్క్యులరు.
విషయం:- ఏక్‌సాలా ఖాస్తుపై సాగుచేస్తున్న భూములమంజూరి గూర్చి.

ది 29—10—49 తేదీకల్గిన ప్రభుత్వ సర్క్యులరు నెం. 10, 8—3—1950 వ తేదీకల్గిన ప్రభుత్వసర్క్యులరు నెం. 18 ద్వారా ఏక్‌సాలా ఖాస్తుకోసం భూములను మంజూరుచేయడాన్ని నిషేధించమనీ, అట్టి పద్ధతిపై యిదివరకే మంజూరు గావింపబడిన భూములను శాశ్వితంగా పట్టాపై యిచ్చివేయమనీ ఇన్‌స్ట్రక్షన్సను యిదివరకే యిచ్చాం. పెద్ద భూఖామందులకూ, తమ స్వాధీనంలోవున్న భూములను స్వయంగా వ్యవసాయం చేసుకోజాలనట్టి భూఖామందులకూ, ప్రభుత్వభూములు మంజూరు చేయబడకుండా తగుజాగ్రత్తలు గైకొనవలసినదిగా 10-10-50 వ తేదీ కల్గిన ప్రభుత్వ సర్క్యులరు నెం. 43 ద్వారా తెలియపర్చడం జరిగింది.

ది 8-3-1950 వ తేదీ కల్గిన ప్రభుత్వ సర్క్యులరు నెం. 18 లో ఏక్‌సాలా ఖాస్తుకోసం యివ్వబడిన ఖుష్కీభూములకు మాత్రమే శాశ్వితపట్టాలు మంజూరు చేయమనీ, తరిభూములను సకాలంలో గ్రామస్థులందరికి తెలియపర్చి హర్రాజు చేయవలసిందిగాను తెల్పబడింది.

ఖుష్కీ, తరి భూములకు పైవిధంగా విచక్షణ చూపడం వలన చిన్నరైతులు కష్టనష్టాలకు గురి అవుతున్నట్లు ప్రభుత్వానికి తెలియవచ్చింది. కష్టపడి ఖుష్కీభూములను తరిభూములుగా చిన్నరైతులు మార్చుకున్నందువలననూ, బహిరంగ హర్రాజులో ధనికులతో సాధారణంగా చిన్నరైతులు పోటీ పడజాలకపోవుచున్నందువలననూ, యీ విచక్షణవలన వారు కష్టాలకు గురిఅవుతున్నారు.

కాబట్టి ది 8-3-1950 వ తేదీ ప్రభుత్వ సర్క్యులరు నెం. 18 ని కొంతవరకు మార్చుచున్నాం. ఏక్‌సాలా ఖాస్తుకోసం యివ్వబడిన తరిభూములనుగూడ ప్రస్తుతం సాగు చేస్తున్నవారికి శాశ్వతపట్టాపై బజారుధర తీసుకొని మంజూరుచేయవచ్చును. అయితే ఖుష్కీభూములను యిలా శాశ్వతపట్టాలపై మంజూరు గావించేప్పుడు ఏవిషయాలను పరిశీలించి మంజూరు గావిస్తారో తరిభూముల సందర్భంలోగూడ అవే విషయాలను దృష్టిలో వుంచుకోవాలి.

## (v) లావునీ రూల్సుగూర్చి 16-11-1950 వ తేదీ హైదరాబాదుప్రభుత్వం రెవెన్యూశాఖ ప్రకటన.

1. (అ) ఇవి 1950 లావునీ రూల్సు అనబడును. జరీదాలో ప్రకటించబడిన తేదీనుండి అమలులోకి రాగలవు.

(ఆ) ఇవి అమలులోకి వచ్చిననాటినుండీ 1947 నాటి లావునీ రూల్సు రద్దుకాగలవు. అయితే ఆ రూల్సుక్రింద తీసుకోబడిన చర్యలన్నీ నిల్చియేవుంటాయి.

2. అనాక్రమితభూమిని ఎవరైనా కావాలనికోరితే వారు వ్రాతపూర్వకంగా తాశీల్దారుకు దరఖాస్తు పెట్టుకోవాలి. దీనికి స్టాంపు ఏమిఅక్కరలేదు. ఈ దరఖాస్తుదారు తాశీల్దారు ఆఫీసునుండి వ్రాతపూర్వకమైన అనుమతిలేకుండా దరఖాస్తు భూమిలో ప్రవేశించరాదు.

3. దరఖాస్తు భూమియొక్క భోగట్టానంతా దరఖాస్తుదారు కోరితే గ్రామపట్వారీ యివ్వాలి. ఇందుకుగాను రుసుము ఏమీ

వసూలుచేయరాదు. దరఖాస్తుదారుడు చదువురానివాడైతే, అతడుకోరితే, గ్రామపట్వారీయే దరఖాస్తును వ్రాసిపెట్టాలి.

4. (అ) లావుణీపై భూమినికోరుతూ వచ్చే దరఖాస్తుల నన్నిటినీ తాశీల్దారు ఒక ఫైల్‌లో పెట్టాలి. ప్రతిదరఖాస్తుకూ ఒక కాగితాన్ని జోడించివుంచాలి. (ఫారమ్) 'ఎ'

(ఆ ఫారమ్ 'బి'లో, వచ్చిన అన్నిదరఖాస్తులయొక్క సూచీ సంఖ్యను వ్రాసివుంచాలి.

5. (అ (1, శిస్తుకట్టిన బంజరుభూమి (2) శిస్తుకట్టనిభూమి 3. రిజర్వుభూములను ప్రత్యేక ప్రత్యేకంగా వచ్చిన దరఖాస్తుల నన్నిటిని వరుస సంఖ్యలో రిజిష్టరుచేసి, ఫారమ్ 'సి' (1) లో వ్రాసివుంచాలి.

(ఆ) ఇండ్లుకట్టుకొనుట వగైరా పనులకై ఖాళీజాగాలకై వచ్చే దరఖాస్తులన్నిటినీ ఫారమ్ 'సి' (2)లో నమోదుచేయాలి.

(ఇ) ఈవచ్చిన దరఖాస్తులనన్నిటినీ, ఆభూములగూర్చిన తనిఖీ రిపోర్టులకై ఆ భూములున్న హాల్కా గిర్దావరకు తాశీల్దారు పంపాలి.'

6. తాశీల్దారు ఆఫీసునుండి వచ్చిన దరఖాస్తుల నన్నిటినీ గిర్దావరు ఫారమ్ 'డి'లో వుంచాలి. తర్వాత, దరఖాస్తుభూమిని గూర్చి వివరాలూ, దరఖాస్తుదారుని పేరూ, తమవిచారణజరి పే తేదీలుతో కూడిన ఒక నోటీసును ఫారమ్ 'ఇ' ద్వారా తెలియజేస్తాడు. (అయితే ఆ విచారణ నోటీసుయిచ్చిన 15 రోజులలో జరగాలి.) ఈ నోటీసు కాపీలను దరఖాస్తుదారుకూ, ఆ భూమి పక్కనున్న రైతులకూ అందజేస్తాడు. ఈ నోటీసును

గ్రామాధికారుల గ్రామచావిడిలోనూ, దరఖాస్తుభూమిపైనా కట్టాలి. టముకుద్వారా గ్రామస్థులందరికీ తెలియజేయాలి.

7. తనిఖీరోజున గిర్దావరు దరఖాస్తుభూమివున్న గ్రామానికివెళ్ళి, దరఖాస్తుదారుని. దరఖాస్తుభూమి పక్కరైతులనూ. గ్రామాధికారులనూ, గ్రామములోని ముఖ్యులనూ సమావేశపర్చి. వారిసమక్షంలో. దరఖాస్తు భూముల స్వభావాన్నిగూర్చి, ఇంకా ఇతరవిషయాలగూర్చి పంచనామాచేసి, ఆ దరఖాస్తు భూమియొక్క పటాన్ని తయారుచేయాలి. ఈ స్కెచ్ (పటం) పై దరఖాస్తుదారుని సంతకం లేక వేలిముద్ర తీసుకొని, ఆ విధంగా దరఖాస్తును ధృవపర్చుకోవాలి.

8. తాశీల్దారునుండి తనకు దరఖాస్తు చేరిన ఒక నెలరోజులలోగా గిర్దావరు, తన పంచనామారిపోర్టును తాశీల్దారుకు పంపాలి. ఆ రిపోర్టులో. ఆ గ్రామంలో వివిధతరగతుల భూమి ఎంతెంత వున్నది? పశువులెన్ని? దరఖాస్తుభూమి స్వభావం ఏమిటి? దరఖాస్తుదారుని నిజాయితీ ఏమిటి? మున్నగువివరాలన్నిటినీ జేర్చాలి. ఈ రిపోర్టుకు ఒక మెమోరాండమును ఫారమ్ 'యఫ్' గా జతపర్చాలి.

9. గిర్దావరు రిపోర్టు జేరినతర్వాత, ఈ క్రిందివిషయాలను ఆలోచించినపిమ్మట తాశీల్దారు దరఖాస్తును మంజూరు చేయవచ్చునా, లేదా నిర్ణయిస్తాడు.

(అ) దరఖాస్తుభూమి కాల్వలనిర్మాణము వగైరా ప్రజోపయోగములకై రిజర్వు చేయబడివున్నా, సంతలు, తిరునాళ్ళు,

పూజలు వగైరాలకై అప్పుడప్పుడు ప్రజలు వుపయోగిస్తూ వుండే తోపులు వగైరాలుగా వుండివున్నా, భూములు రిజర్వు అడివిగా వుంటున్నా, పి. డబ్ల్యు. డి. వారి ఉపయోగం కొరకు ప్రత్యేకించబడివున్నా, ఉప్పు తయారుచేయుటకుగాని, కుమ్మరులు మట్టి తవ్వుకొనుట వగైరా పనులకుగానీ ప్రత్యేకింపబడి వున్నా తాశీల్దారు దరఖాస్తును నిరాకరించి, ఆ విషయాన్ని గిర్దావరురిపోర్టు చేరిన నెలరోజులలోగా దరఖాస్తుదారుకు తెలియచేయాలి.

(ఆ) [illegible] వగైరాలు [illegible] భూముల నుండి భూమిని మంజూరుచేసేటప్పుడు తాశీల్దారు [illegible] క్రిందా, బీడులక్రిందా, ప్రభుత్వం అవసరాలకొరకూ, పబ్లిక్ ఉపయోగంకొరకూ ఆ దరఖాస్తు భూమి హైదరాబాదు ల్యాండు ఆక్టు సెక్షన్ 25 క్రింద ప్రత్యేకింపబడి వున్నదేమో విచారించాలి. గ్రామ సాగుబడిభూమిలో కనీసం 100 కి 10 వ వంతు భూమియైనా గోభూములు వగైరాలక్రింద ప్రత్యేకించి వుంచబడాలి. ఈ కనీస అవసరాలు పూర్తి అయితేగాని భూములు మంజూరు చేయబడరాదు.

పశువులబీళ్లకు ఏర్పాటు జేసినతర్వాత ఇంకా కొంత భూమి సాగుకుమిగిలివుంటే, 8 ఎకరాలకు పైబడినభూమి ఆక్రమణలకు పెట్టబడిన దరఖాస్తులనన్నిటినీ తన సిఫార్సులతో కలెక్టరు ఆమోదానికి పంపాలి. తరిసాగుకై పెట్టబడిన దరఖాస్తు లన్నిటినీ తాశీల్దారు, కలెక్టరు ఆర్డరుకొరకై పంపాలి. దరఖాస్తుభూమి 8 ఎకరాలు, లేక అంతకుతక్కువ ఖుష్కీభూమి

మైవుండి, ఆ భూమిపైగల చెట్లు యింకా మున్నగువాటన్నిటి తోనూ కలిపి రు 100/- లకు తక్కువవిలువ కల్గివున్నట్లైతే తాశీల్దారు స్వయంగాగాని. గిర్దావరుద్వారాగాని హరాజును పెట్టి మంజూరుచేయవచ్చును.

(ఇ) గిర్దావరు పంచనామా, రిపోర్టులవల్ల దరఖాస్తు భూమి సెటిల్మెంటు (బందోబస్తు) కాలంనుండీ శిస్తుపడిన బంజరు గానే వున్నా, లేక దరిమిలా విడుదలవల్లగాని. స్వాక్షేపంవల్ల గానీ బంజరుగా పడివున్నా ఈ క్రిందివిధంగా ఫైసలాచేయాలి.

(i) భూమి ఖుష్కీయైవుండి, చాలాకాలంనుండీ బంజరుగాపడివుంటే, తాశీల్దారు ఆ భూమివున్నగ్రామంలో దానిని అమ్ముటకు తారీఖు నిర్ణయించాలి.

(ii) (i) వక్లాజులో చెప్పబడిన భూమికీమ్మత్తు రు 100/- లకు తక్కువ వుండివుంటే, అక్కడికక్కడే గిర్దావరు హరాజు చేయవచ్చును.

(iii) భూమికీమ్మత్తు రు 100/- లకుమించి రు 500/- లకు లోపుగావుంటే, ముందు తగినంత ప్రకటనయిచ్చి. తహశీల్ ఆఫీసులో నోటీసు కట్టింతర్వాత తాశీల్దారు స్వయంగా హరాజు చేయవచ్చును.

(iv) భూమివిలువ రు 500/-లకుపైబడి రు 2000/-లకు వుంటే నాయబ్ తాలూకాదారుకు పంపాలి.. తగినంత ప్రకటన జరిగిన తరువాత నాయబ్ తాలూకాదారు స్వయంగా హరాజు చేయాలి.

(v) భూమినిలువ రు. 2000/- లకు పైబడితే తాలూ
క్దారు స్వయంగా హర్రాజు చేయాలి.

(ఈ) దరఖాస్తు భూములు అడవి సరిహద్దులకు చేరువ
గావున్నా, లేక ఆభూములలో ఎకరానికి 50కి మించి ఈత,
తాటిచెట్లువున్నా, తాశీల్దారు, తాలూక్దారుకు తెలియబర్చాలి.
అటవీశాఖ, ఆబ్కారీశాఖలను తాలూక్దారు కనుగొన్నతర్వాత
అవి అటవీ లేక ఆబ్కారీశాఖలకు అవసరమైతే, వాటినిలావుని
క్రింద యివ్వరాదు. అట్లుగాక, అడవి సరిహద్దులు నిర్ణయింప
బడివుంటే తాశీల్దారు స్వయంగా ఆభూమిని తనిఖీచేసి కలెక్ట
రుకు రిపోర్టుపంపాలి. ఆ భూములుగనుక అడవి సరిహద్దులకు
బైటవుంటే, ఆవిధంగా మాపులలోనూ, ఆకార్ బంద్ లోనూ
చూపబడితే, అటవీశాఖను సంప్రదించ నవసరంలేదు.

(ఉ) దరఖాస్తు భూమిగనుక ఒకనంబరులో భాగంమా
త్రమేఅయితే, దానికి మంజూరుచేస్తానికి ఏఅభ్యంతరం లేకపోతే
గిర్దావరు ఆ భూమిని కపరాపద్ధతిని కొలిచి, పక్కనున్న భూమి
రేటు ప్రకారమే యివ్వాలి. సర్వేజరిగి ఆకార్ బందు దిద్దుబడు
వరకూ, ఈ భూమిప్రత్యేకంగా సబ్ డివిజన్ చేయబడువరకూ,
ఈ తాత్కాలికపు రేటేవుంటుంది.

(ఊ) భూములలోవున్న చెట్లను ముందుగాగిర్దావరుతనిఖీ
చేసి, స్థానిక ధరలప్రకారం విలువకట్టాలి. చెట్లు మరీఎక్కువగా
వుంటే తాశీల్దారు స్వయంగా తనిఖీచేసి విలువనిర్ణయించాలి.
తాటి, ఈతచెట్లకు మాత్రం అవిగీత గీయబడదగిన చెట్లయితే,

చెట్టు ఒకటికి రు. 10/-లు, లేదా అప్పుడప్పుడు నిర్ణయించే రేటుప్రకారం, ధరనిర్ణయించాలి.

(బు) హరాజుద్వారాగాని, ఇతరత్రాగాని భూమిని మంజూరు చేసేటప్పుడు, చెట్లవిలువతోసహా భూమివిలువను ఈ క్రిందివిధంగా రాబట్టుకోవాలి.

భూమిని వేలంవేస్తే వేలంరోజున, వేలంలేకుండా దరఖాస్తుపై మంజూరుచేస్తే మంజూరుచేసిన వారంరోజులలోపున. చెట్లవిలువతోసహా భూమివిలువలో 100 కి 25 వంతుల నొసగిన చెల్లించి, మిగతా 75 వంతులు తర్వాత 15 రోజులలోగా చెల్లించివేయాలి. ఈవిధంగా డబ్బు పూరాగా చెల్లించబడినపిమ్మట దరఖాస్తుదారుకు భూమి స్వాధీనపర్చబడుతుంది. (ఫారం 'జి'). దరఖాస్తుదారు సంతకం తేదీతోసహా తీసుకోబడుతుంది. ఫారం 'జి' ఒక కాపీని దరఖాస్తుదారునకుయిచ్చి, మరొక కాపీని గిర్దావరు తాశీల్దారుకు పంపుతాడు. గిర్దావరే స్వయంగా ఈ ఫారాలుయిచ్చి రశీదులు పుచ్చుకోవాలి. ఈ భూమియొక్క వివరాలు, మంజూరుచేయబడిన వ్యక్తి పేరు, వసూలుచేయవలసిన శిస్తు వగైరా వివరాలను గ్రామ అధికారులకుకూడా ఒక మెమోద్వారా తెలియజేయాలి. సర్వే, సెటిల్మెంటుశాఖచే ఆకార్ బంద్ సవరించబడువరకూ ఈ శిస్తునే వసూలుచేస్తూ వుండాలి.

(బూ) హరాజులో సరియైన పాటమొత్తం రాదనుకున్నా, లేక స్వార్థపరులు గూడుపుఠాణీచేసి న్యాయమైనధరకు బీదప్రజలకు భూమి అందకుండా చేయదలబెట్టినా, స్థానిక అధి

కారులరిపోర్టుపై తాలూకాదారు భూమి ధరనునిర్ణయించి, హరాజుజరుపకుండా దరఖాస్తుదారుకు మంజూరు చేయవచ్చును.

(౩) గ్రామస్థులకు 15 రోజులనోటీసు యిచ్చినతర్వాత హరాజు జరపాలి. నోటీసును (ఫారం "హెచ్") తహశీలు కచ్చేరీలోనూ, గ్రామచావడిలోనూ కట్టాలి.

**10.** హరాజు గిర్దావరుచే జరుపబడితే తాశీల్దారుతోనూ, తాశీల్దారుచే జరుపబడుతే నాయిబ్ తాలూకాదారుతోనూ, నాయిబ్ తాలూకాదారుచే జరుపబడుతే తాలూకాదారుతోనూ ఖాయపర్చబడాలి. తాలూకాదారు చేతనే జరుపబడితే రెవెన్యూ బోర్డు (మాల్గుజారీ మహకామా) ఖాయంచేయాలి. మొత్తం డబ్బు చెల్లించబడినపిమ్మట రికార్డులనూ, డబ్బుకట్టిన చలానానూ పైనతెల్పినట్లుగా క్రింది ఉద్యోగి పైఉద్యోగికి పంపాలి. అప్పుడు పై ఉద్యోగి ఏ అభ్యంతరమూ లేదనుకుంటె ఆ అమ్మకాన్ని ఖాయంచేయాలి: లేదా అవుసరమనుకొంటే, దానిని రద్దుచేసి మరల హరాజుకు పెట్టమనాలి. ఆ భూమి లావునీ క్రింద మంజూరు చేయబడరాదని పైఉద్యోగి అనుకొంటే, ఆ అమ్మకాన్ని రద్దుచేయాలి. అట్లు రద్దుచేయడంగాని, ఖాయం చేయడంగాని జరిగినపిమ్మట ఆ కాగితాల నన్నిటిని తాశీల్దారుకు పంపాలి. ఖాయంచేయబడితే ఫారం "జి" ద్వారా భూమిని స్వాధీనపర్చుకోమని దరఖాస్తుదారుకు ఆర్డరు పంపుతాడు. రద్దుచేయబడితే కారణాలుతెల్పుతూ, మంజూరుకాబడలేదని తెల్పుతాడు. రద్దుచేయబడగానే పాటదారుడు వేలం

రోజున చెల్లించిన పాటమొత్తాన్ని వెంటనే వాపసుచేస్తూ, అవసరమైన రికార్డులలో ఆ విధంగా నమోదుచేయాలి.

11. మంజూరు చేయబడిన భూమికి సర్వేనంబరు లేకపోతే షోడి పని పూర్తి చేయమని జిల్లా ల్యాండు రికార్డుఆఫీసరుకు తాశీల్దారు తెలియజేయాలి.

12. తాశీల్దారు రికార్డు చేసినతర్వాత జిల్లా లాండురికార్డు ఆఫీసరు ఆభూమినికొలిచి, భూమితరము వగైరాలబట్టి ప్రత్యేక నంబరును ఏర్పాటుచేసి, ఆ విధంగా ఆకారుబందునూ, వ్యాప్తులనూ సరిజేయించాలి. ఈ విధంగా సరిదిద్దినతర్వాత, గ్రామరికార్డులలో నమోదుచేయబడుటకు ఈ వివరాలన్నీ తిరిగి తాశీల్దారుకు పంపాలి.

13. లాండు రికార్డుశాఖ జరిపిన షోడివల్ల మంజూరుచేయ బడినవ్యక్తి స్వాధీనంలో మంజూరుకాబడిన ఖుష్కీ-భూమిలో 100 కి 20 వంతులకులోపుగాని 1 ఎకరంగాని మించివున్నా, తరీభూమిలో 100 కి 20 వంతులకు లోపుగాని 10 సెంటలను గాని మించివున్నా, ఇందులో ఏది ఎక్కువైతే ఆ పెచ్చుభూమికి సూరాజు చేయబడిన రేటుప్రకారంగాని, నిర్ణయింపబడిన ధరప్రకారంగాని మంజూరైనవ్యక్తి చెల్లించాలి. ఈపై చెప్ప బడిన విస్తీర్ణానికి మించివుంటే ఈ పెచ్చుభూమినికూడా మంజూరైనభూమికి కలపాలో లేక మినహాయించాలో తాశీల్దారు అభిప్రాయంకోరకై లాండురికార్డు ఆఫీసరు పంపాలి. ఆ భూమిని మంజూరుచేసిన వుద్యోగియొక్క అభిప్రాయాలను తాశీల్దారు తెలుసుకొన్నపిదప, పెచ్చుభూమినికూడా మం

జూయభూమికి కలపాలా లేక దానినుండి మినహాయించాలా తన ఫైనల్ ఆర్డరును తాశీల్ దారు జారీచేస్తాడు. తాశీల్ దారు ఆర్డరుప్రకారం లాండురికార్డ్సు ఆఫీసరు చర్యతీసికొని, ఫోడి పని పూర్తి చేస్తాడు.

14. లాండురికార్డ్సు ఆఫీసరు ఆకార్ బంద్ లో చేసిన శిస్తు మార్పు ఆ మార్పు చేయబడిన మరుసటిసంవత్సరంనుండి మాత్రమే అమలులోకి వస్తుందిగాని వెనుకటినుండికాదు.

## (vi) స్పెషల్ లావునీ.

15. హైదరాబాదు లాండు రెవెన్యూ ఆక్టు సెక్షన్ 58 ఎ. ప్రకారం తెల్పబడిన ప్రత్యేక ప్రాంతాలలోని భూములను ఈ క్రింది రూల్సుప్రకారంతప్ప మరేవిధంగానూ మంజూరు చేయరాదు.

(అ) అప్పుడప్పుడు ప్రకటించబడే వ్యవసాయిక తరగతులకుకాక వెనుకబడిన తరగతులకుచెందిన భూమిలేనివారికి లేక మామూలు లావునీ హరాజులలోగాని, ఇతరవిధాలగాని భూమిని కొనగల తాహతులేనివారికిగాని కొన్నిప్రాంతాలలో భూములను మంజూరుచేయుటమే స్పెషల్ లావునీ యొక్క వుద్దేశం. గ్రామంలోగాని, ఆల్లాటుచేస్తానికి ఏర్పర్చిన స్థలంలోగాని బాగా తెలియపర్చినపిమ్మట తాశీల్ దారు దరఖాస్తుదారులలో ఎవరు మిక్కిలి అర్హులో ఎంచాలి.

(బి) సాధారణంగా ఏప్రిల్, సెప్టెంబరులలో ఏడాదికి రెండుసార్లుగాని, లేదా తాశీల్ దారు ప్రదేశాలు పర్యటిస్తూ

వున్నప్పుడుగాని స్పెషల్ లావునీ క్రింద చర్యలు తీసుకోబడు తాయి.

**16.** స్పెషల్ లావునీక్రింద ఎవరికి మంజూరుచేయాలి అనే విషయాన్ని నిర్ధారణచేసేటప్పుడు ఆ గ్రామంలోనే కాపురం వుంటూ ఆ గ్రామంలోగాని, మరెచ్చటనైనాగాని ఏభూమి లోనూ పట్టా హక్కులుగాని, షిక్మీ హక్కులుగాని లేనట్టివా రికీ, లేక దుక్కిటెడ్లు, వ్యవసాయపుపనిముట్లు వుండి, తగినంత భూమి లేనివారికీ ప్రత్యేకత చూపాలి. ఇతర కు లీలకన్న ఇది వరకే "ఆసామీలు" గానో, "బటాయిదార్లు" గానో భూము లుసాగుచేస్తున్నవారికి ప్రత్యేకత చూపాలి.

**17.** తాశీల్దారుచే మంజూరుచేయబడ్డవ్యక్తి ఆ భూమిని స్వాధీనం చేసుకొనేలోపల, ఆభూమిలో వుండే కలపయొక్క విలువను తాశీల్దారు నిర్ణయించినట్లుగా చెల్లించాలి.

అయితే, మంజూరు చేయబడ్డ వ్యక్తి కలపధరను ఒకే దఫా చెల్లించలేడనిఅనుకుంటే ఆ విషయాన్ని తాశీల్దారు తాలూక్దారుకు తెలియజేయాలి. తాలూక్దారు గనుక అట్టి సందర్భంలో అవసరమనుకుంటే, తానునిర్ణయించే తేదినుండి **3** సంవత్సరవాయిదాలలో ఆధరను చెల్లించవలసినదిగా ఆర్డరు వేయవచ్చును.

**18.** స్పెషల్లావునీక్రింద తాశీల్దారు ఏవ్యక్తికైనా భూమిని మంజూరుచేయుటకు ఎంచితే ఆ ఎన్నికజరిగిన నెలరోజు లలోగా దానిని తాలూక్దారు ఖాయంచేయాలి.

19. భూమి మంజూరు చేయబడిన 3 సంవత్సరములోగా మంజూరుకాబడ్డవ్యక్తి ఆభూమిని సాగుయోగ్యముగాచేసి సాగుప్రారంభించాలి. ఈ షరతులకుభిన్నంగా మంజూరుదారు నడిస్తే తాలూకాదారు ఆర్డరుపత్రికారం అతనిని భూమినుండి తొలగించవచ్చును.

అయితే అతనిని తొలగించుటకు ముందు నోటీసుయిచ్చి ఆ నోటీసు అందిన 3 నెలలలోగా ఆతడు షరతులను పాటించక పోతేనే తొలగించాలి. షరతులకుభిన్నంగాభూమిఅన్యాక్రాంతం చేయబడితే తాలూకాదారు కొత్తవ్యక్తిని తొలగించవచ్చును.

20. మామూలులావునిక్రింద నాయబ్ తాలూకాదారూ, స్పెషల్ లావునిక్రింద తాలూకాదారూ మంజూరుచేసిన కేసుల్లో తాశీల్దారు మంజూరుదారునుండి రావలసిన పైకమును రాబట్టుకొని, అగ్రిమెంటు వ్రాయించుకొని, అప్పుడు భూమిని స్వాధీనం చేసుకోవచ్చునని వ్రాతమూలకంగా ఆర్డరుఇవ్వాలి.

21. సెక్షన్ 17 క్రింద వాయిదాలపై చెల్లించవలెనని అనుమతించబడిన సందర్భంలోతప్ప, మిగతా అన్ని మంజూరు సందర్భాలలోనూ, కలపధర చెల్లించబడితేనేతప్ప తాశీల్దార్లు పై అనుమతిని యివ్వరాదు. కలప దాఖలా వసూలు అయిన ప్రతిమొత్తాన్ని అటవీశాఖపేర జమకట్టాలి.

22. భూమిస్వాధీన పర్చబడిన పంటకాలంనుండీ భూమిశిస్తు చెల్లింపబడాలి.

అయితే స్పెషల్ లావునిక్రింద పట్టాపై కలెక్టరు మంజూరుచేసిన బంజరుభూమి, అనాక్రమితభూమి విషయంలో

మాత్రం ఆభూమిసాగులోకి తేబడినదనీ, కానూన్‌లోకి తెచ్చుటకు అవుసరమైన చర్యలన్నీ తీసుకోబడు తున్నాయనీ కలెక్టరుకు నమ్మకం కల్గితే, భూమిస్వాధీనం చేయబడిన నాటినుండి 3 సంవత్సరాలవరకూ భూమిశిస్తును మాఫీచేయవచ్చును.

23. రిజర్వు చేయబడని శిస్తుపడిన భూములన్నిటికీ స్పెషల్ లావుని రూల్సు వర్తిస్తాయి. పైరూల్సుప్రకారం తాశీల్దార్లు పట్టాలకు మంజూరు చేయవచ్చును.

24. స్పెషల్ లావుని రూల్సుక్రింద మంజూరు చేయబడిన భూములన్నిటికీ ఒకప్రత్యేక రిజిష్టరును వుంచాలి.

(vii) హైదాబాదు రెవెన్యూశాఖ సర్క్యులర్.

1. పోరంబోకలు, కంచెలు, గైరాన్ మున్నగు ప్రభుత్వ భూములను ప్రభుత్వముయొక్క అనుమతిలేకుండా సాగుచేస్తూ వుండటం అధికమవుతూ వుండడాన్ని ప్రభుత్వం గమనించింది. ఇటువంటి సందర్భాలలో రెవిన్యూ ఉద్యోగస్థులు కఠినంగా చర్యతీసుకోవాలి. ఇటువంటి ఆక్రమణలపై తావానులూ (పీనల్ రేట్లు) విధించుటకూ, ఆక్రమణదారులను వెళ్ళగొట్టుటకూ, రెవెన్యూ వుద్యోగస్తులకు లాండు రెవెన్యూ ఆక్టు సెక్షను 54 ప్రకారం హక్కువున్నది. అయినప్పటికీ వరుసగా అనేక సంవత్సరాలనుండి యిటువంటి సందర్భాలలో ఆక్రమణదార్లను వెళ్లగొట్టుటకు వెంటనే చర్యతీసుకొనక పోవడమూ, కొన్ని జిల్లాలలో శివాయ జమాబందీ వంటి తావాన్ల వసూళ్ళు మామూలుగా జరుగుతూవుండడం కూడా ప్రభుత్వం గమనిస్తూ వున్నది.

**2.** కాబట్టి ప్రభుత్వభూములు ఆక్రమణల విషయంలో వెంటవెంటనే దృఢమయిన చర్యలు గైకొనవలసినదిగా రెవిన్యూ అధికారులనందరినీ కోరడమైనది.

3. సాగుకు ఏ భూములు లేనటువంటి హరిజనులు యితర వెనుకబడిన కులాలవారిని ఈ ఆక్రమణదారులుగా వుండడాన్ని కూడా గమనించడమైనది. ఈ భూములను వారు సాగులోనికితెచ్చి సాగుచేస్తూవున్నారు. ప్రత్యేకలావునీ నిబంధనల ప్రకారం ప్రభుత్వం హరిజనుల ఎడల యితర వెనుకబడిన కులాలవారి ఎడల అనుసరించేవుదార నైఖరికి అనుగుణంగానూ, ఈ బంజరు భూములను సరిగా వినియోగించే వుద్దేశంతోనూ యిటువంటివారి ఆక్రమణల విషయంలో ప్రభుత్వం ఉదారంగా వ్యవహరించవలసిన అవసరం వున్నది.

4. కాబట్టి యిటువంటి సందర్భాలల్లో యీకింది సూచనలప్రకారం రెవెన్యూఅధికారులు పనిచేయాలి.

(అ) షెడ్యూల్డు తెగలకు చెందినవారుగానీ, వెనుకబడిన తెగలకు చెందినవారుగానీ, భూములులేని యిటువంటి యితరప్రజలుగాని. అనుమతిలేకుండా భూములు ఆక్రమించుకొని సాగుచేస్తూవుంటే అట్టి భూములను కలెక్టరు తనసొంత చొరవతోగాని, లేక ఆక్రమణదారు దరఖాస్తు పెట్టుకున్నాగానీ, ఆనుకొనివున్న ప్రభుత్వ భూములనుండి విడగొట్టి ప్రత్యేక లావునీనిబంధనలప్రకారం అనగా వేలానికిపెట్టకుండానూ భూమిధరను చెల్లించనవసరంలేకుండానూ వాస్తవంగాసాగుచేసేవారికే పట్టాపయి యివ్వాలె.

(ఆ) ఇదివరకే ఆర్థిక పరిమాణానికి మించని యితర భూములను కలిగివుండినవారు గనుక ప్రభుత్వ భూములను ఆక్రమించుకునివుంటే అట్టిఆక్రమణ భూములను 6 సం॥లు స్వయంగా సేద్యంచేస్తూ తమస్వాధీనంలోనే వుంచుకుంటే ఆభూమిపై చెల్లే శిస్తుకు 16 రెట్లు ధర చెల్లించినమీదట ఆ ఆక్రమణ దారులకు పట్టాపై ఆభూమిని యివ్వవచ్చు.

(ఇ) ఆర్థిక పరిమాణానికి మించిన భూమిని యిదివరకే గల భూస్వాములు తమభూములప్రక్కగల ప్రభుత్వపోరంబోకులు, గైరాన్‌లనుండి చిన్న చిన్న తునకలనుకలుపుకుంటే అట్టిచిన్నతునకలు వారి స్వంతభూములసాగుకు అత్యంతావశ్యకమైనా, మరింత వుపయోగకరమైనా శిస్తుకు 16 రెట్లు ధర వసూలుచేసి ఆచిన్న తునకలను ఆభూస్వాములకే మంజూరుచేయవచ్చును. అయితే ఆర్థికపరిమాణపు భూమికి 5 రెట్లుభూమిగల భూస్వాములకు మాత్రం ఎట్టిపరిస్థితులలోనూ అట్టిభూములను మంజూరుచేయరాదు. ఈసదుపాయాన్ని అరుదుగామాత్రమేకలిగించాలి. ఇదివరకేవున్న భూమిసాగును మరింతఅభివృద్ధి చేయటానికైతేమాత్రమే కలిగించాలిగాని యిదివరకేవున్నభూమికిమరికొంత చేర్చటానికిమాత్రం కాకూడదు.

(ఈ) అయితే ఆక్రమణభూమికి పట్టా యిచ్చినతరువాత గ్రామంలోని మొత్తంసాగుభూమిలో గైరాన్ విస్తీర్ణం 100 కి 10 వంతులకు తగ్గే సందర్భంలోగాని ఆవిధంగా తగ్గినభాగాన్ని యితర ప్రభుత్వభూములనుండి కొంతభాగాన్నికలిపి భర్తీ చేయడానికి వీలులేని పరిస్థితులలోగాని అట్టి ఆక్రమణభూములను

మంజూరు చేయమని పెట్టబడే దరఖాస్తులను మంజూరు చేయ రాదు. ఇటువంటి సందర్భాలలో అనుమతి లేకుండా గైరాన్ భూములను ఆక్రమించుకొనేవారిని నిర్దాక్షిణ్యంగా తొలగించాలి.

(ఉ) ఎక్కడయినా సాగులాయకీ బంచరాయి లేక పోరంబోకుభూములు తగినంతగావుండి, పెద్యాలుతగగతులనుండిగానీ, వెనుకబడిన తెగలనుండిగానీ, ఇతరులనుండిగానీ తమకు మంజూరుచేయమని దరఖాస్తులు రానిచో మామూలుపద్ధతిలో పట్టాహక్కులను వేలమువేయవచ్చును. ఆ వేలంలో చట్టబద్ధమయిన హద్దుకు అనగా ఆర్థికపరిమాణానికి 5 రెట్లకు మించని భూమిగలవారిలో ఎక్కువపాట పాడినవారికి మంజూరుకావాలి.

5. ఈ నిబంధనలు జాగ్రత్తగా పాటించబడుతాయనీ, పై 4 వ పేరాక్రిందికి రాని ఆక్రమణలను తొలగించుటకై సత్వర చర్యలు తీసుకోవాలనీ ప్రభుత్వం ఆశించుచున్నది.

(viii) హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ.
నెం. 5 సర్క్యులరు. 22-3-52.

ఏక్‌సాలా కౌళ్లనుగూర్చి.

ఏక్‌సాలాసాగుకు భూములను మంజూరుచేయుటం తాత్కాలికంగామాత్రమనీ, ఈవిధంగా ఆర్డర్లు జారీచేయబడకముందు మంజూరుచేసినవాటిని ఫైసలా చేయవలసినదనీ ప్రభుత్వపు రెవెన్యూశాఖ స్పష్టమైన సూచనలను పంపింది. ఈ విషయమై ఈక్రింది సర్క్యులర్లను గమనించవలసినదిగా ప్రభుత్వం కోరుచున్నది.

(1) నెం. 10. ది 9-10-1949.
(2) నెం. 18. ది 8-3-1950.
(3) నెం. 43. ది 10-10-1950.
(4) నెం. 45. ది 29-10-1950.

ఈ సూచనలు సరిగా పాటించబడటం లేదనీ, పైగా హరిజనులు ఇతర వెనుకబడిన కులాలకు చెందిన భూమిలేని పేదలకు నష్టం కలిగేవిధంగా వుపయోగించబడుతున్నవనీ ప్రభుత్వానికి తెలియవచ్చింది.

కాబట్టి ప్రభుత్వం ఈ ఆగ్రహంలోని అస్పష్టతను తొలగించ గోరుతూ క్రిందిపద్ధతులపై చర్య తీసుకోవలసినదిగా రెవెన్యూ అధికారులను కోరుతున్నది.

(i) భవిష్యత్తులో (తాత్కాలికంగా తేలే చెరువుపడకలు—సికితలాబ్) మినహా ఏ భూములను ఏక్‌సాల్ కౌలుకు మంజూరు చేయరాదు.

(ii) ఖాల్సా ఖాతా భూములూ, సాగులాయకైన బీడుభూములూ లావునీనిబంధనల ప్రకారం పట్టాలపైమాత్రమే మంజూరు చేయాలి.

(iii) ఏక్‌సాల్‌సాగు భూములు మంజూరుచేయబడిన హరిజనులనుండి ఆభూములను లాక్కొనరాదు. ఒక్క సంవత్సరం నుండి యీ విధంగా భూములను స్వాధీనంలో కలిగివున్నప్పటికీ హరిజనులకూ, ఇతర వెనుకబడిన కులాలవారికే యీ సదుపాయం వర్తిస్తుంది.

(iv) హరిజనులు వెనుకబడిన కులాలవారికిగాక యితరులకు ఏక్‌సాల్ సాగుకు భూములు యివ్వబడినచో అట్టి భూముల కొరకై యితరులెవ్వరైనా దరఖాస్తులు పెట్టుకున్నప్పుడు బావుసీ నిబంధనలప్రకారం చర్యతీసుకుని ప్రభుత్వానికి ఎక్కువ ప్రయోజనకరంగా ఉండునట్లుగా వేలానికి పెట్టాలి.

(v) మూడవక్లాజులో చెప్పబడినవారికి పట్టాహక్కులు యిస్తాలికై తక్షణము చర్యగైకొనాలి.

(vi) నాల్గవక్లాజుక్రింద చేర్చబడిన వ్యక్తులకు పట్టాలు మంజూరుచేస్తున్నప్పుడు అక్రమంగా యిట్లు పెద్దభూఖండాలను కలిగినవారికి యివ్వబడకుండా చూడాలి. ఇదివరకే పెద్దభూఖండాలను కలిగివున్నవారు అనుమానాస్పదమైన పద్ధతులద్వారా మరింత భూమిని సంపాదించకుండా తగిన కట్టుదిట్టాలన్నీ చేయాలి.

(vii) భూములు మంజూరు చేయబడిన వారు వారిస్వాధీనంలో యిదివరకే వున్న భూములను సాగుచేయ గలుగుచున్నారా? లేదా? అన్నవిషయాన్ని రెవిన్యూ అధికారులు కనిపెడుతూ వుండాలి.

ఈ సూచనలను అమలు జరుపుటలో రెవిన్యూ అధికారులందరూ స్వయంగా శ్రద్ధతీసుకోవాలని ప్రభుత్వం కోరుచున్నది.

(ix) హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ.

నెం. 16 సర్క్యులరు. ది 12-7-1952.

ప్రభుత్వ బంజరు భూములను సరిగా వినియోగించే వుద్దేశ్యంతోనూ, హరిజనులు ఇతర వెనుకబడిన కులాలవారు అనుమతిలేకుండా పోరంబోకు, గైరాన్ భూములను ఆక్రమించుకొన్న సందర్భాలను ప్రత్యేకలావుని నిబంధనలప్రకారం క్రమబద్ధమొనర్చే వుద్దేశంతోనూ, రెవెన్యూశాఖయొక్క నెం. 2/515/51/A 3 సర్క్యులరు (ది 9-1-1952) ద్వారా స్పష్టమైనసూచనలు చేయబడినవి. వేరేఏమీ భూమిలేనిహరిజనులు, వెనుకబడ్డ కులాలవారుగనుక యీ ఆక్రమణదారులైవుంటే వారిని భూమినుండి తొలగించరాదని, ప్రత్యేక లావునినిబంధనలప్రకారం వారికి పట్టాలు మంజూరు చేయవలసినదనీ యీ సూచనలో చెప్పబడినది. అయినప్పటికీ హరిజనులు, వెనుకబడిన కులాలవారు భూములనుండి తొలగించబడుచున్నారని ప్రజలనుండి అనేకఫిర్యాదులుచేరాయి. అంతేగాకుండా గ్రామాల్లో గైరాన్ విస్తీర్ణం నూటికి 10 వంతులకు తగ్గివున్నప్పటికీ హరిజనులు వెనుకబడ్డకులాలవారు గైరాన్ భూమిని అనుమతిలేకుండా ఆక్రమించుకునివుంటే పైసదుపాయము వర్తిస్తుందా? అనికూడా కొంతమంది ప్రభుత్వాన్ని అడిగారు.

ఇకముందు అటువంటి ఆక్రమణను ఖచ్చితంగా నిషేధిస్తూ ఆక్రమణదారులపై చర్య తీసుకోవలసినదిగా ప్రభుత్వం కోరుతూ హరిజనులుగాని, వెనుకబడ్డ కులాలవారుగాని రెండు, మూడుసం॥లక్రితంనుండి అట్టిభూములను ఆక్రమించు

కునివ్వుంటే వారిని తొలగించపద్దని ప్రత్యేకాలాపునిసిబ ధనల
కిరించ వారికి పట్టాలు మంజూరు చేయవలసి దని ఆజ్ఞ జారీచే
యుచున్నది. ఇందుకొరకై గైరాన్ భూమినుండి భూమిని తీసు
కోవలసివుంటే, ఒక్కొక్క సందర్భాన్ని పరిశీలించి మంజూరు
చేయవలసినదనీ, గైరాన్ విస్తీర్ణం లో ఏర్పడినలోటును భర్తీచే
యుటకై యితర పోరంబోకు భూములనుండి తీసి గైరాన్‌కు కలు
పవలసినదనీ ప్రభుత్వం కోరుచున్నది.

ఈ సూచనలు జాగ్రత్తగా పాటించబడునవీ భవిష్య
త్తులో ఎవరినుండి ఎటువంటిఫిర్యాదు కు అవకాశం లేకుండా సత్వ
రచర్యలు గైకొనబడతాయనీ ప్రభుత్వం ఆశించుచున్నది

(౨) హైదరాబాదు ప్రభుత్వం, రెవెన్యూశాఖ.
నెం. 12 సర్క్యులరు. ది 15-5 1952.

హరిజనులకు, వెనుకబడిన కులాలకు ఇండ్లస్థలాలనుగూర్చి.

(1) హరిజనులకు ఇండ్లస్థలాలను మంజూరుచేయడాన్ని గురించి
రెవెన్యూశాఖజారీచేసిన నెం. 48/1950 సర్క్యులరు రెవెన్యూ
వుద్యోగస్థులు సరిగా అర్థంచేసుకోలేదనీ, సంవత్సరం ఆరుమా
సాలుగడిచినా యిప్పటికీ ఆ సర్క్యులరును సరియైన పద్ధతిలో
అమలుపెట్టుటలేదనీ ప్రభుత్వానికి తెలియపర్చబడింది.

(2) ఏ గ్రామంలో నైనా బంచరాయిగానీ, గైరాన్‌గాని మొ
త్తంసాగుభూమిలో నూటికి 10 పాళ్ళతులకు తగ్గివున్న చో అట్టి
బంచరాయి లేక గైరాన్ భూములనుండి కొంతభూమినితీయుటకు
కలెక్టరుకుగాని, యితర రెవెన్యూఅధికారులకుగాని అధికారం

లేదని తెలియవచ్చింది. ఆవిధంగా భూమినితీయటాన్ని నిషేధి స్తూ జారీచేయబడిన ఆర్డర్లను తప్పుగా అర్థంచేసుకోవడం వల్లనే యిట్టిచిక్కు ఏర్పడుచున్నది. సాగుకొరకై ఈవిధంగా గైరాన్ లేక బంచరాయినుండి భూమిని తీయడానికిమాత్రమే ఈనిషేధం వర్తించుతుంది. హరిజనులకు ఇండ్లస్థలాలను యివ్వ డానికై పెద్దభూఖండాలు అవుసరంలేదు. ఏసందర్భంలోనూ 5 ఎకరాలకన్నా ఎక్కువభూమి అవుసరముండదు. చాలసందర్భా లలో హరిజనులకు యిండ్లస్థలాలు ఏర్పాటుచేయాలంటే కొద్ది గుంటలుకాని లేక 1, 2 ఎకరాలభూమిగాని సరిపోతుంది. కాబట్టి హరిజనులకు యిండ్లస్థలాలకు ఇచ్చుటకుగాను ఏ సందర్భంలోనూ 5 ఎకరాలకు మించకుండా గైరాన్ భూములనుండి భూమిని తీయుటకుగాను కలెక్టర్లకు అధికారమీయబడుచున్నది.

(3) ఈ విధంగా మంజూరుచేయటానికి ప్రభుత్వభూములు లేనప్పుడు నష్టపరిహారం చెల్లించినమీదట ప్రక్కనున్న పట్టా భూములు ప్రభుత్వంసంపాదించి యివ్వవచ్చునని యిదివరకే ఆజ్ఞలు జారీచేయబడియున్నవి. కాబట్టి కలెక్టర్లు వెంటనే లాండ్ ఎక్విజిషన్ చర్యలకు పూనుకోవచ్చును. అవుసరమయితే లాండ్ ఎక్విజిషన్ యాక్టు సెక్షన్ 12 క్రింద వెంటనే భూమిని వశప ర్చుకోవచ్చును. కాని ఈ విధంగా భూమిని అక్వైర్ చేయడం వల్ల భూఖామందులకు అసలే భూమిలేకుండాచేసే, లేక జీవనో పాధిఏమీ లేకుండాచేసే అనవుసరమైన యిబ్బందులు కలుగకుండా సాధ్యమైనంతవరకూ చూడాలి.

(4) హరిజనులకు ఇళ్ళస్థలాలను ఇచ్చుటకుగాను భూమిని అక్వైర్ చేయడం జరిగితే అది ఏ గ్రామస్థుల ప్రకారం స్పష్టంగా పబ్లిక్ కార్యాలయాల్లో ఉంచే ఈ విషయంలో రెవెన్యూ అధికారుల కెలాంటిసందేహమూ ఉండరాదు.

(5) పైన చెప్పబడిన సమస్యలను అన్ని జమాబందీలో వచ్చే టెక్నికలు అభ్యంతరాలను లెక్కచేయకూడదని రెవెన్యూ అధికారులను కోరుతున్నాం. తాము మకాంవేసిన ప్రతిచోటా తహశీల్దారు, డిప్యూటీకలెక్టర్లు యీ విషయాలనువిచారించి అక్కడి కక్కడే తగినచర్యలు తీసుకొని అవసరమైతే భూములు మంజూరు చేసినతర్వాత కలెక్టరు అనుమతిపొందడం వారికర్తవ్యం.

(6) ఈ విషయంలో రెవెన్యూ అధికారులు ఏ మేమిచర్యలు తీసుకుంటున్నారో ప్రతినెలా జిల్లాకలెక్టర్లు రెవెన్యూబోర్డులకు రిపోర్టులు పంపుతూవుండాలనీ, ఈ రిపోర్టుల క్రోడీకరణనూ, తమ వ్యాఖ్యను రెవెన్యూబోర్డు ఆ మరుచటినెల 25 వ తేదీ లోగా రెవెన్యూబోర్డుకు పంపుతూవుండాలనీ ముఖ్యమంత్రి కోరాడు. కాబట్టి అటువంటిరిపోర్టును ప్రతినెలా రెవెన్యూబోర్డుకు పంపుతూవుండునట్లు ప్రతి రెవెన్యూఅధికారి చూడాలి. తన యీకృషిలో ఏ మాత్రం అశ్రద్ధగానీ, ఆలస్యంగానీ చూపెట్టినా, రిపోర్టులు పంపడంలో అశ్రద్ధ, ఆలస్యం చేసినా ప్రభుత్వ దృష్టికి తీసుకురాబడుతుంది. రెవెన్యూఅధికారుల సమర్థతను నిర్ణయించడంలో యీ విషయంలో వారెట్లు పనిచేసినది గమనించబడుతుందనికూడా తెలియజేస్తున్నాం.

# హైదరాబాద్ సంస్థానంలో

# భూమిశిస్తు విధానం

## గ్రామాలలోని యితర పన్నులు.



[ రెండవ భాగము ]

## 1317 వ ఫసలీ ల్యాండు రెవిన్యూచట్టంకు పూర్వంవున్న శిస్తువసూలు విధానం.

1317 వ ఫసలీ (1917 సం.) లో హైదరాబాదు సంస్థానంలో ల్యాండు రెవిన్యూచట్టం జారీచేయబడింది. దీనిప్రకారం ప్రథమ పర్యాయంగా శిస్తులు నేరుగా రైతులనుండి వసూలుచేసేపద్ధతి ఖాల్సాగ్రామాలలో (ఖాల్సాప్రాంతంలోని యీనాంగ్రామాలలోతప్ప) ప్రవేశపెట్టబడింది. అంతకుపూర్వం ప్రభుత్వం రైతులనుండి నేరుగా శిస్తు వసూలుచేయడమనేది లేదు. శిస్తు వసూలుహక్కును ప్రతిసంవత్సరంగాని లేదా కొన్నిసంవత్సరాల కొకపర్యాయంగాని అరాజుచేస్తూఉండేది. సాధారణంగా యీ అరాజు హాల్కాలవారీగా జరుగుతూవుండేది. కొన్నిసందర్భాలలో గ్రామాలవారీగాకూడ యీ అరాజు వుండేది. హాల్కా లేక గ్రామంమొత్తంమీద ప్రభుత్వానికి చెల్లించాల్సిన శిస్తు తేల్చబడి శిస్తువసూలు బాధ్యతను, శిస్తు వసూలు హక్కును అరాజు చేసిన శిస్తువసూలుదారుకు ప్రభుత్వం అప్పగించేది. శిస్తువసూలుదారు ప్రభుత్వం తనవద్ద వసూలుగావించే పన్నుమొత్తంమేరకే గాకుండా అంతకన్నా చాల అధికంగా రైతులనుండి పన్నులు వసూలుగావించేవాడు. ఈ విధంగా పన్నుభారం రైతులపై యెంతో మోపబడుతూ వుండేది. ఇంతేగాకుండా పన్ను వసూలుచేయడానికి ఒక క్రమ పద్ధతిఅంటూ వుండేదిగాదు. శిస్తువసూలుదారు చిత్తంవచ్చినట్లు రైతులపై దౌర్జన్యంగావించి పన్నువసూలుచేయడం జరు

గుతూవుండేది. రైతులు శిస్తువసూలుదార్ల దయాదాక్షిణ్యా లపై ఆధారపడి వ్యవసాయంచేస్తూ వుండేవారు.

ఖాల్సాగ్రామాలలోనే యీవిధంగా వున్నప్పుడు, యిక జాగీరు, యీనాం, మక్తా మున్నగు ఖాల్సాగాని ప్రాంతాల రైతుల దుర్భర పరిస్థితిగూర్చి చెప్పనవసరంలేదు. ఆ ప్రాంతా లలో రైతులు ఏ హక్కులులేని ఉత్త కౌలుదారులుగానే యిటీవలవరకూ పరిగణింపబడుతూవచ్చారు. 1317వ ఫసలీలో (1907సం)ల్యాండు రెవిన్యూచట్టంఅమలులోకివచ్చినా అది జాగీ రుప్రాంతాలకు సంబంధించినంతవరకు 1355 వ ఫసలీ(1945సం.) వరకు అమలులోకిరాలేదు. ఆ ఫసలీలోనే జాగీరుప్రాంతాలలో సర్వే, సెటిల్‌మెంట్లు (బందోబస్తు) తప్పనిసరిగా చేయబడాలని శాసించడంజరిగింది.అయినా 1949వరకూగూడ ఇంకాదాదాపు 1200 జాగీరుగ్రామాలలో బందోబస్తు జరగనేలేదు. అందుచేత 1317వఫసలీకి(1907సం.)పూర్వం ఖాల్సాప్రాంతాలుకాని జాగీ రుమున్నగు ప్రాంతాలలో రైతులనుండి వసూలుగావించబడే శిస్తు వాస్తవానికి భూమిశిస్తు కానేకాదు. జాగీరుదారు, యీనాందార్ల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి నిర్ణయింప బడే కౌలురేట్లు. 1317 వ ఫసలీ (1907సం.) ల్యాండు రెవిన్యూ చట్టం తర్వాతగూడ అదేపరిస్థితి చాలవరకు కొనసాగింది.

గ్రామాల్లో రైతాంగంనుంచి వసూలు చేయబడు తున్నది. బందోబస్తు రేట్ల ప్రకారంగా విధించబడిన పన్నులు మాత్రమేకాదు. ప్రభుత్వం చేసే ఇతరచట్టాల ప్రకారంగా,

వ్యాపార పంటలపై పన్నులవంటివికూడా వసూలుచేయడం జరుగుతున్నది. వీటికితోడుగా, చిరకాలంనుంచి జాగీర్దారులు, మక్తాదారులు, దేశముఖులు, పటేలు పట్వారీలు కట్టుబాటుల రూపంలోనూ లంచాలు, జుర్మానాలరూపంలోనూ వసూలు చేసే అక్రమపన్నులుకూడా చాలాఉన్నవి. ఇవి చట్టరీత్యా నిషేధింపబడినప్పటికీ, పై రైతాంగం పోరాటాలకు కదిలి, వాటిని చెల్లించ నిరాకరించేదాకా చట్టం అమలులోకి రానే రాలేదు. తెలంగాణారైతాంగం ఆంధ్రమహాసభద్వారా ఈ పన్నులభారాన్ని తగ్గించుకోడానికి ఆందోళన సాగించింది. ఆంధ్రమహాసభ నాయకత్వాన పెద్దపెద్ద పోరాటాలు నడిచినవి గత ఐదు సంవత్సరాలుగా తెలంగాణలో సాగుతూ వచ్చిన పోరాట ఆశయాల్లో ఈ పన్నుల భారాన్ని తగ్గించడంకూడా ఒకటిగా ఉన్నది. ఖాల్సా గ్రామాల్లో ఇప్పుడమల్లోఉన్న రేట్ల ను ముఖ్యంగా తరిరేట్లను తగ్గించడం, జాగీరుగ్రామాల్లో భూమిని సర్వేచేయించి, ఖాల్సాగ్రామాల బందోబస్తురేట్లను నిర్ణయించి అమలు జరుపడం, అంతటా అక్రమపన్నులు-అవి ఏరూపాల్లో వసూలుజరుగుతున్నా రద్దుకావడం—ఇవీ భూమి పన్నులకు సంబంధించిన నినాదాలు.

ఈ పోరాటాలు, దేశవ్యాపిత ఆందోళన ఫలితంగా, 1355ఫ (1945) లో ప్రభుత్వం జాగీరుప్రాంతాల్లోగూడా సర్వే సెటిల్మెంటు చేయించే అధికారాన్ని స్వీకరించింది; దీని కనుగుణ్యంగా ల్యాండురెవెన్యూ చట్టంలోని 77వ సెక్షన్ను సవరిం

చింది. అయినా ఇది రైతాంగం పోరాటం సాగించిన కొన్ని గ్రామాల్లో మాత్రమే అమలుజరిగింది. ఇదేవిధంగా ఖాల్సా జాగీరు గ్రామాల్లో పోరాటం సాగించినమేరకు అక్రమపన్నులు కూడా తగ్గిపోయినవి. కాని ఖాల్సా గ్రామాల్లో భావులకింది తరీ భూమి, మరికొన్ని ప్రత్యేకరకమైన తరీభూమి రేట్లుతగ్గింపు, జాగీరుగ్రామాల్లో ఖాల్సాగ్రామాలతో సరిసమానంగా భూమి రేట్లు ఉండాలనీ ఇటీవల నే ప్రభుత్వం నిర్ణయి చింది. ఈ విధంగా రైతాంగం చిరకాలంనుంచి చేస్తున్న ఆందోళన పోరాట ఫలితంగా పన్నుల తగ్గింపుకు సంబంధించిన కొన్నికొన్ని కోర్కెలను సాధించగలిగింది. వీటిని అమలు జరుపుకోవడం తక్షణ కర్తవ్యం. ఈ తగ్గింపును పూడ్చుకోడానికి రైతాంగాన్ని అదనపు పన్ను భారానికి గురిచేయడానికి వ్యాపారపంటలపై పన్నులవంటి కొత్తపన్నులనుకూడా విధించుతున్నదనే సంగతి మరువకూడదు.

## —♦ 1317 వ ఫసలీ ల్యాండు రెవెన్యూచట్టం బందోబస్తుపద్ధతి. ♦—

ఈ చట్టంద్వారా బందోబస్తు (సర్వే సెటిల్ మెంటు పద్ధతి) విధానం ఖాల్సాగ్రామాలలో అమలులోకి వచ్చింది. చట్టం అమలులోకి వచ్చేనాటికి భూఖామందుగా (సాగుచేస్తున్న కౌలుదారుగాదు; ప్రభుత్వసాగు లెక్కలప్రకారం భూఖామందు) పరిగణింపబడుతూ వున్నవారి అధీనంలోవున్న భూవిస్తీర్ణాన్ని సర్వేగావించి భూమి తరములబట్టి భూమిశిస్తు రేట్లు

నిర్ణయించబడ్డాయి. మరల సెటిల్‌మెంటు జరిగేవరకూ యీ రేట్లు అమల్లోవుంటాయి. ఈ విధంగా సర్వే సెటిల్‌మెంటు గావించేందుకు 1317వ ఫసలీ (1907) ల్యాండు రెవిన్యూచట్టం క్రింద 1318వ ఫసలీ (1908)లో బందోబస్తునిబంధనలు (సెటిల్‌మెంటురూల్సు) జారీచేయబడ్డాయి. ఆ నిబంధనలప్రకారం భూఖామందుల అధీనంలోవున్న భూములను వేరువేరుగా సర్వేగావించి శిస్తువిధించి గ్రామరికార్డులు తయారుచేయబడ్డాయి. ఈ సర్వే సెటిల్‌మెంటు ప్రకారమే 'భూమిహక్కుల రికార్డ్సు' (రికార్డ్సు ఆఫ్ రైట్స్ ఇన్ ల్యాండు) తయారుచేయబడ్డాయి. ప్రతి భూఖామందుకు వున్న భూమియెంతో, అతడు ఎంత భూమిశిస్తు చెల్లించాలో మున్నగు వివరాలు తెల్పుతూ పట్టా యివ్వబడింది.

అయితే యీ బందోబస్తు పద్ధతివలనగూడ 1317 వ ఫసలీ(1907)ల్యాండు రెవిన్యూచట్టానికి పూర్వమున్న రైతాంగ పరిస్థితి కొంతమెరుగు అయినా రైతాంగంపై శిస్తుభారం తొలగ లేదు. ఎందుచేతనంటే (1) బందోబస్తు అయ్యాక పంటసరుకుల ధరలలో వచ్చే వడుదుడుకులతో నిమిత్తంలేకుండా నిర్ణయించిన శిస్తురేటు మరల బందోబస్తుగావించి రేట్లు మార్చేవరకూ తప్పక చెల్లించుకుంటూ వుండాలి. (2) ప్రథమ బందోబస్తు కాలమప్పుడు నిర్ణయించిన రేట్లు అంతకుపూర్వం చెల్లే రేట్ల కంటె మరేమీ తగ్గలేదు. పైగా అంతకుముందు ధాన్యరూపంలోవున్న రేట్లు ధనరూపంలోకి మార్చడంవలన ప్రారంభ

దినాల్లో డబ్బుచెలామణి తక్కువగావున్న రోజులలో ధనరూ
పంలో చెల్లించడం చాల కష్టనష్టాలతో కూడుకున్న పనై
యుంది. బందోబస్తుకుపూర్వం శిస్తుబకాయీలను శోఘ్యాడ
గొట్టి వసూలుచేయడమనేది వుఃపేదికాదు. శిస్తుబకాయి
వసూలుకై భూమిని వేలంవేయించడం. భూమానికి చెందిన
తదితర చరాస్థినిగూడ జప్తుచేసుకోవడం మున్నగు కఠిననిర్బంధ
శిస్తు వసూలుపద్ధతి బందోబస్తు విధానానికిపూర్వం వుంఃపేది
గాను. (శిస్తువసూలుపద్ధతిని వివరించేప్పుడు యిది స్పష్టం అవు
తుంది.) కాబట్టి బందోబస్తుపద్ధతివలన శిస్తు రేట్లు యిదమిత్థంగా
తేల్చబడినప్పటికీ పైనతెల్పిన అనర్థకాలుగూడ అమలులోకి
వచ్చాయి.

ఇదిగాక, స్వయంగా బందోబస్తు జరిగినప్పుడే ఎన్నో
లోపాలు జరిగినవి. వాటిని రీ-సెటిల్మెంటుజరిగిన ప్రాంతాల్లో
కూడా కొంతవరకుమాత్రమే సవరించడం జరిగింది. ఇటీవల
ఆదిలాబాదు జిల్లాఅంతటా ఇదివరకుజరిగిన సర్వే సెటిల్మెంటు
సంతృప్తికరంగాలేదని, ఈ జిల్లాలో నివసించే ప్రజల అవసరా
లను దృష్టిలోఉంచుకొని చేయబడలేదనీ, రీ-సెటిల్మెంటుకై
నిర్ణయించడం జరిగింది. ఈ విధంగానే ఇతరజిల్లాలలోని కొన్ని
తాలూకాల్లో జరగవలసి ఉన్నది.

## —♦ సర్వే, సెటిల్మెంటుపద్ధతి. ♦—

1317వ ఫసలీ (1907) ల్యాండు రెవెన్యూ చట్టంప్రకారం
1318ఫ. (1808సం.)లో బందోబస్తునిబంధనలుప్రకటించబడ్డాయి.

వాటిప్రకారం బందోబస్తుగావించబడుతుంది. బందోబస్తు వ్యవహారాన్నంతటినీ చూచే ఒక ప్రత్యేకశాఖ వుంది. దాన్ని సర్వే సెటిల్ మెంటుశాఖ అంటారు. ఈ శాఖ అధిపతిని సెటిల్ మెంటు నాజిమ్ అని పిలుస్తారు. ఈ నాజిమ్‌ను యిప్పుడు బందోబస్తు డైరెక్టరు అని పిలుస్తారు. ఈయన ఆధ్వర్యాన యీ శాఖ పనిచేస్తుంది.

1317వ ఫసలీ (1907సం.) ల్యాండు రెవెన్యూ చట్టంప్రకారం ఖాల్సా ప్రాంతంలో తప్పని సరిగా సెటిల్ మెంటు గావించాలి. 1355వ ఫసలీ(1945సం.)లో ల్యాండు రెవెన్యూచట్టం సవరింపబడింది. ఆ సవరణ ప్రకారం ప్రభుత్వం సంస్థానంలో యే ప్రాంతంలోనైనా (అంటే ఖాల్సా ప్రాంతంలోనే గాకుండా జాగీరు మున్నగు ఖాల్సా కాని యితరప్రాంతాలలో గూడా) సర్వే సెటిల్ మెంట్ల పద్ధతిని ప్రవేశపెట్టడానికి అధికారం కల్గి ఉంది. (1317వ ఫసలీ ల్యాండు రెవెన్యూచట్టం 77 వ సెక్షను ప్రకారం.)

శిస్తు మదింపు (రెవెన్యూ అస్సెస్ మెంటు) కోసం సర్వే సెటిల్ మెంటును ఏ ప్రాంతంలోనైనా జరపాలనుకొని ప్రభుత్వం నిర్ణయించినప్పుడు ఆ నిర్ణయాన్ని ప్రభుత్వం గెజిట్ ద్వారా తెలియపర్చుతుంది. అలా సర్వే చేయబడాలన్న ప్రాంతానికి ప్రత్యేకంగా ఒక సర్వేపార్టీని పంపుతుంది. ఆ సర్వేపార్టీకి భూఖామందులను తమ ఆధీనంలోవున్న భూముల వివరాలగూర్చి ఏ సమాచారాన్నైనా యివ్వమని అడుగుటకు

అధికారం వుంది. (ల్యాండు రెవెన్యూచట్టం.) అంతేగాకుండా ఏ భూఖామందుల భూములలో సర్వే కార్యకలాపాలు సాగింపబడుతాయో ఆ భూఖామందులను తమకు అవసరం తోడ్పాటు యివ్వమని కోరడానికిగూడ సర్వే ఆఫీసర్లకు అధికారం ఉంటుంది. అయితే రైతులచేత ఏ వెట్టిచాకిరీని సర్వే అధికారులు చేయించుకోరాదు. అది చట్టవిరుద్ధం. (ల్యాండు రెవిన్యూచట్టం 78 వ సెక్షను.)

సర్వే పార్టీవాళ్లు ప్రభుత్వం నిర్ణయించిన కనిష్ట విస్తీర్ణం గల భూఖండాలను మాత్రమే ప్రత్యేకంగా సర్వే గావించి ప్రత్యేకసర్వేనెంబర్లు వేస్తారు. సర్వేకోసం ప్రభుత్వం నిర్ణయించే యీ కనిష్టవిస్తీర్ణం వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా ఆయాభూముల స్వభావాన్నిబట్టి (తరములనుబట్టి) వుండవచ్చును. ఈ విధంగా ప్రభుత్వం నిర్ణయించిన కనిష్ట విస్తీర్ణానికి తక్కువ వైశాల్యం కలిగిన భూమిని ఏ భూఖామందైనా కలిగివుంటే అతనిభూమినిగూడ సర్వేచేయడం జరుగుతుందిగాని ప్రత్యేక సర్వేనెంబరు వేయరు. ప్రక్కనున్న ఏదో ఒక పెద్ద భూఖండం సర్వేనెంబరు క్రిందనే నమోదు చేయబడుతుంది.

సర్వేకోసం ప్రభుత్వంనిర్ణయించే కనిష్టవిస్తీర్ణం యెంతవుండాలో ముందుగా అంటే సర్వే కార్యకలాపాలు ప్రారంభంకాకపూర్వమే గ్రామస్థులందరకు తెల్పబడుతుంది. అలానిర్ణయింపబడిన కనిష్ట విస్తీర్ణం భూమి వున్నవారందరూ తమభూమిని ప్రత్యేకంగా సర్వేగావించి ప్రత్యేక నెంబర్లుగా గ్రామ భూమి

రికార్డులలో నమోదు చేయమనికోరడానికి అర్హతకల్గివుంటారు. అదేవిధంగా బందోబస్తు జరగడానికిముందు పొత్తుగావున్న ఆస్తులను విడదీసుకొని యెవరి వాటాకువచ్చిన భూమిని వారు ప్రత్యేకంగా సర్వే చేయమని అడుగవచ్చును.

పైనతెల్పిన విధంగా సర్వే పార్టీవాళ్లు గ్రామస్థుల అధీనంలోవున్న భూములను సర్వే చేయడం, ప్రత్యేక నెంబర్లుగా విడదీయడం పూర్తి అయ్యాక ఒకొక రైతు అతని అధీనంకిృంద వున్న భూమికి చెల్లించాల్సిన శిస్తురేట్లను మదింపు గావిస్తారు. దీనినే **శిస్తు** మదింపు అంటారు. (Revenue assessment) భూమి సారంలోనూ, మార్కెటుకు దగ్గరగా, లేక దూరంగా వుండడంలోనూ, నీటివసరులు కల్గి వుండడంలోను యింక యితర సౌకర్యాల విషయంలో అన్ని భూములు ఒకేమాదిరిగా వుండవు. వివిధరకాలుగా వుంటాయి. ఈ తేడాలనుబట్టే భూమి తరము లను నిర్ణయిస్తారు. శిస్తుమదింపు యీ భూమి తరములనుబట్టి వుంటుంది. ఈ విధంగా భూమి తరములనుబట్టి సెటిల్‌మెంటు డైరెక్టరు (బందోబస్తు నాజీము) శిస్తురేట్లు విధించాక వాటిని ప్రభుత్వం ఆమోదించితే అవి అమలులోకి వస్తాయి. సాధారణంగా బందోబస్తు ప్రతి 30 సంవత్సరాలకు ఒక పర్యాయం జరుగుతుంది.

బందోబస్తు డిపార్టుమెంటువాళ్లు బందోబస్తు, శిస్తుమదింపు పనులు పూర్తిగావించినాక, వాటిప్రకారం బందోబస్తు పూర్తి అయిన ప్రతి గ్రామానికి భూమిహక్కుల రికార్డు నొక

దాన్ని తయారుచేస్తారు. దానిలో ప్రతి పట్టాదారు పేరు, ఆ పట్టాదారుకున్న భూముల విస్తీర్ణం, వాటి సర్వే నెంబర్లు. ఆ భూములపై చెల్లించాల్సిన శిస్తు రేట్లు, గ్రామ మొత్తం శిస్తు మున్నగు వివరాలు నమోదు చేయబడతాయి. ఈ పని అంతా పూర్తి అయ్యాక ప్రభుత్వం నూతనంగా విధించిన శిస్తు రేట్లను గెజిట్ (జరీదా)లో ప్రకటించుతుంది. ఈ రేట్లు అక్రమముగా విధించ బడ్డాయని ఏ రైతు అయినా భావిస్తే అతని అభ్యంతరాలను ప్రభుత్వానికి తెల్పుకోవచ్చును. అభ్యంతరాలు తెల్పుకోడానికి భూఖామందులకు కొంత వ్యవధి యివ్వబడుతుంది. ఈ వ్యవధిలోపల ఏ అభ్యంతరాలు తెల్పుకోకపోతే ప్రభుత్వం విధించిన శిస్తు రేట్లను అంగీకరించినట్లుగానే భావించి ఆ రేట్లు ఖాయం చేయ బడుతాయి. మరుసటి సంవత్సరంనుండి అంటే బందోబస్తు జరిగిన మరుసంవత్సరంనుండి నూతన రేట్లు వసూలు చేయబడు తాయి.

బందోబస్తు చేయడంలోగాని లేక శిస్తు మదింపులో గాని లెక్కల పొరపాట్లు లేక వ్రాతపొరపాట్లు ఏవైనా వుంటే వాటిని సరిచేసుకోడానికి భూఖామందులకు బందోబస్తు అయ్యాక రెండేళ్లవరకూ వ్యవధి వుంటుంది. ఈ వ్యవధిలోపల ఆయా జిల్లా కలెక్టర్లకు అవసరమున్న భూఖామందులు దరఖాస్తు చేసుకోవచ్చును.

బందోబస్తుకయ్యే ఖర్చులు అన్నీ ప్రభుత్వమే భరిస్తుంది. రైతులవద్ద యిందుకోసం ఏమీ వసూలు చేయరాదు.

జాగీరు గ్రామాలలో బందోబస్తు కోసం ఆయిన ఖర్చు లను జాగీరుదారునుండి సగం, రైతులనుండి సగం, ప్రభుత్వం వసూలు చేస్తుంది. రైతులు చెల్లించాల్సిన మొత్తాన్ని ఆరు సమాన సాంవత్సరిక వాయిదాలలో చెల్లించుకోవచ్చును.

బందోబస్తు గావించినతర్వాత ఒకపట్టాదారు భూమికి మరొకపట్టాదారు భూమికి సరిహద్దులను నిర్ణయిస్తూ సరిహద్దు రాళ్లను సర్వేపార్టీవాళ్లే పాతుతారు. ఆ రాళ్లను కాపాడే బాధ్యత ప్రధానంగా గ్రామపటేలు పట్వారీలది. పట్టాదార్లు కూడ తమభూములలో పాతిన సర్వేరాళ్లను జాగ్రత్తగా వుంచే బాధ్యత తీసుకోవాల్సివుంటుంది. ఏ భూఖామందు అయినా బుద్ధిపూర్వకంగా సర్వేపార్టీవాళ్లు పాతినరాళ్లను పీకి పారవే యడంగాని లేక వున్నచోటునుండి మరోచోటికి మార్చడం గాని చేయడం చట్టవిరుద్ధం అలా జరిగితే భూఖామందుల నుండి రాతి ఖరీదుకు నాలుగురెట్లు జరిమాన విధించుతారు. అలా ఎన్నిరాళ్లు కనబడకపోతే అన్నిరాళ్లకుపైన తెలిపినరేట్లు ప్రకారం జరిమానా వసూలు చేస్తారు.

జాగీరు గ్రామాలలో సరిహద్దురాళ్లను కాపాడే బాధ్యత జాగీరుదారుపై వుంటుంది. ఎచ్చటైనా సరిహద్దు రాళ్లు పోతేగాని, లేక అవి పడిపోయినప్పుడు వాటిని సరిగా నిలబెట్టాల్సి వస్తేగాని అందుకు అయ్యేఖర్చులను ప్రభుత్వం జాగీరుదారునుండి వసూలుచేస్తుంది. అయితే ప్రభుత్వం అలా ఎంత జాగీరుదారునుండి వసూలు గావిస్తుందో ఆ మేరకు

జాగీరుదారు రైతులనుండి వసూలుచేసుకోవచ్చు ఆచరణలో జాగీరుదారు యీ పేరుతో అసలు ఖర్చుఅయిన మొత్తం కంటేగూడ అధికంగా రైతులనుండి గుంజుతారు.

ఒక తడవ బందోబస్తుఅయి శిస్తు మదింపు అయ్యాక మరల తిరిగి బందోబస్తు, శిస్తు మదింపు జరగవచ్చు. దీన్నే "రీ సెటిల్ మెంటు" అంటారు. సాధారణంగా రీ సెటిల్ మెంటు ద్వారా రైతులకు లోగడ బందోబస్తులో జరిగే అన్యాయాలను శిస్తుభారాన్ని తొలగించడమనేది వుండదు. ధరలు హెచ్చాయ నో లేక భూములసారం పెరిగిందనో లేక వాటి నీటివనరులు అభి వృద్ధి అయ్యాయనో లేక మరేదో సాకు చూపెట్టి ప్రతి "రీ సెటి ల్ మెంటు" కాలంలోనూ శిస్తులను పెంచడం జరుగుతూవచ్చిం ది. అందుచేతనే ప్రభుత్వం "రీ సెటిల్ మెంటు" చేయబోతోం దంటే, రైతులు సహజంగా శిస్తులు పెంచుతారని భావించు తారు. ఉదాహరణకు గత శాసనసభా సమావేశంలో "రీ సెటిల్ మెంటు జరగనట్టి తాలూకాలలో అదనపు భూమి శిస్తును విధించుతూ ప్యాసుచేయబడిన చట్టాన్నే తీసుకుందాం. ఆ చట్టంప్రకారం రీ సెటిల్ మెంటు పూర్తిగానట్టి తాలూకా లలో ఖుష్కీ-భూమి శిస్తును రూపాయికి రెండుఅణాలునూ్న తరి భూమి నీటి తీరువను రూపాయికి ఒక అణాచొప్పున అధికం చేయటం జరిగింది. ఖుష్కీ భూములకు ఎకరానికి దాదాపు 4 అణాలనుండి 6 అణాలవరకునూ్న తరిభూములకు ఎకరానికి 8 అణాలనుండి 1 రూపాయి 4 అణాలవరకూ రైతులు అదనం

గా శిస్తు చెల్లించుకోవాల్సి వుంటుంది. తెలంగాణాలో యీ క్రింది తాలూకాలకు యీ భూమిశిస్తు పెంపుదల చట్టం వర్తించుతుంది:-

నల్లగొండజిల్లా:—

(1) దేవరకొండతాలూకా.

వరంగల్ జిల్లా:—

(1) పాఖాల్, (2) ములుగు, (3) పాల్వంచ, (4) ఖమ్మం మెట్టు, (5) మానుకోట తాలూకాలు.

నిజామాబాద్ జిల్లా:—

(1) నిజామాబాదు తాలూకా.

కరీంనగరు జిల్లా:—

(1) పరకాల, (2) మహాదేవపురం (మంతెనతాలూకా), (3) సుల్తానాబాదు తాలూకాలు.

ఆదిలాబాదు జిల్లా:—

మొత్తం అన్నితాలూకాలు. (ఆదిలాబాదు, కిన్వట్, నిర్మల్, ఆసిఫాబాదు, సిరిపూర్, రాజురా, చెన్నూరు లక్కి చెట్టిపేట, ఊట్నూరు తాలూకాలు.)

పైన ఉదహరించిన తాలూకాలన్నింటిలో రీ సెటిల్ మెంటు కాలేదు. రీ సెటిల్ మెంటు అయ్యేవరకు పైన ఉదహ

రించిన రేటుప్రకారం అధికంగా భూమిశిస్తు వసూలు చేయ బడుతుంది.

ఈ విధంగా రీ సెటిల్ మెంటు అంటే శిస్తులు పెంచడం తప్ప ప్రభుత్వం రైతులను బాగుచేసేదేమీలేదు. అయితే రీ సెటిల్ మెంటు కాలంలో లోగడ బందోబస్తు అయినప్పుడు భూమికొల్తలలోనూ, శిస్తురేట్లు విధించడంలోనూ జరిగిన కొన్ని అన్యాయాలను తొలగించుకునేందుకు ఆందోళన గావించ వచ్చు. జాయంటు పట్టాలను విడగొట్టించుకొని ప్రత్యేకపట్టాలు సంపాదించుకోవచ్చు.

అసలు బందోబస్తు జరగని ప్రాంతాలు కూడ యింకా వున్నాయి. ప్రభుత్వం లెక్కలప్రకారం సంస్థానంలో 6535 జాగీరు గ్రామాలున్నాయి. వీటిలో యింకా దాదాపు వెయ్యి గ్రామాలలో బందోబస్తు జరగనేలేదు. ఈ గ్రామాలలో త్వరగా బందోబస్తు చేయించేందుకు ప్రభుత్వాన్ని డిమాండు గావిస్తూ ఆందోళన చేయాలి. బందోబస్తు అయిన గ్రామా లలో సహితం జాగీరుదారు ప్రభుత్వోద్యోగులను కట్టుకుని మెన్నో భూఖండాలను తనపేర, తన బంధువులపేర, తన అను యాయులపేర అక్రమముగా, చట్టవిరుద్ధ గా సమోదు చేయిం చుకోవడం జరిగింది. ఇప్పుడు జాగీరులు రద్దుచేయబడ్డాయి గాబట్టి మరల నూతనంగా 1355 వ ఫసలీ (1945 సం.) లలో జాగీరుదారు గ్రామాలలో పట్టాదారుల హక్కులనుగూర్చి

జారీ గావించిన నిబంధనలు ఆధారంగా గాని, తిరిగి బందో బస్తు జరగాలని పెద్దయెత్తున ఆందోళన గావించాలి.

## —♦ 1317 వ ఫసలీ (1907 సం.) ల్యాండు రెవెన్యూ చట్టం ప్రకారం శిస్తు వసూలు పద్ధతి. ♦—

ప్రభుత్వం బందోబస్తు గావించి విధించిన శిస్తును ప్రతి సంవత్సరం గ్రామ పటేలు, పట్వారీలు వసూలు గావిస్తారు. శిస్తు వసూళ్లు యీ క్రింద పేర్కొనబడిన కిస్తీలప్రకారం జరుగుతాయి.

(I) ఖారీఫ్ మరియు ఆబీపంటలకు — జనవరి 1 వ తేదీ నుండి 21 వ తేదీవరకు.

(II) రబ్బీపంటలకు — ఏప్రియల్ 1 నుండి 21 వ తేదీ వరకు.

(III) తాబీ పంటలకు — జూన్ 16 నుండి 30 తేదీవరకు

## "శిస్తు వసూలుచేయు పద్ధతి"

ఈ తేదీలకు 15 రోజులు ముందుగానే గ్రామాల్లో టముకుద్వారా, కిస్తీ వసూలు చేయడాన్నిగూర్చి రైతాంగానికి తెలియజేయాలి. ఒక్కొక్క కిస్తీలో. ఏ రైతునుంచి ఎంత రకం వసూలుచేయాలో, తహశీలు ఆఫీసుద్వారా నిర్ణయించ బడుతుంది. అలాంటి జాబితా నొకదానిని చావుడీ గోడలపైన

అంటించాలి. దానిప్రకారమే, పై విధంగా నిర్ణయించబడిన తేదీల్లోనే వసూళ్లు జరగాలి.

కాని పటేలు, పట్వారీలు తరుచుగా భూస్వాములుగా ఉండటంవలన, చెల్లించవలసిన రకం పోస్తూ, తక్కినదాన్ని నిర్ణీత తేదీలకు ముందుగానే వసూళ్లు చెల్లుబడికావలసిన రకంలో కొంతభాగం వారే స్వయంగా ఇచ్చుకోవలసి ఉంటుంది. వారే రైతాంగానికి ఋణదాతలుగా ఉంటే (చాలా గ్రామాల్లో ఉంటారుకూడా) మిగులు రకంలో కూడా చాలా భాగాన్ని అప్పుపూర్వకంగా చెల్లిస్తూ ఉంటారు. ఇక స్వయంగా చెల్లించే తాహతు కలిగిన రైతాంగంనుంచి వసూలు చేయడానికి పై నియమాలనేమీ పాటించడం జరగదు. టముకు ద్వారా తెలియజేయకనే, నిర్ణీత తేదీలకు చాలా ముందుగనే వసూలుచేసుకొని, తమ అవసరాలకు ఉపయోగించుకొని, పటేలు, పట్వారీలు, తమకు భూముల కౌళ్ళపైన, రైతులనుంచి మామూళ్ళ పేరుతో తీసుకునే లంచాలరూపంలో వచ్చే డబ్బుతో, గ్రామంనుంచి వసూలు కావలసిన కిస్తీని చెల్లించుతారు. దీనివలన రైతులు తమపంటను తక్కువధరలకు అమ్ముకొని చెల్లించవలసివస్తుంది. పటేలు, పట్వారీలు అదనంగా లాభాలు సంపాదించుకుంటారు.

కిస్తీలను గ్రామ చావడీలో మాత్రమే వసూలు చేయాలి. భూస్వాములైన పటేలు, పట్వారీలు తమతమ దివాణాల్లో వసూలుచేస్తూఉండడం తరచుగా జరుగుతున్నది. వారు

రైతులను ఒక్కొక్కరినే పిలిచి, తమ ఏజెంట్ల సాయంతో, దెబ్బలు తిట్లతో వత్తిడి తెచ్చి, చెల్లించవలసినదానికన్న హెచ్చుగా రకాన్ని వసూలుచేస్తారు. రశీదు ఇవ్వడంలో మోసం చేస్తారు. పై అధికారులదగ్గర ఫిర్యాదు చేసుకుందామనుకున్నా సాక్ష్యమే లేకుండా చేస్తారు. చావుడీ బహిరంగ ప్రదేశమగుటవలన, ప్రజానీకానికి అంక బాటులో ఉంటుంది. నలుగురు రైతులు ఒకచోట చేరి పటేలు, పట్వారీలు తెచ్చే వొత్తిడిని ఎదిరించడానికి అవకాశముంటుంది. గ్రామ రైతు సంఘ కార్యకర్తల సాయంతో, రైతులు గుంపులు గుంపులుగా వెళ్ళి, లెక్కలను సరిగా చూపించుకొని, శిస్తులను చెల్లించి రశీదులు తీసుకోవడం మంచిది.

పటేలు పట్వారీలు చదువురాని రైతాంగాన్ని మోసం చేయడానికి ఒక చిన్న కాగితపు ముక్కమీద నాలుగు గీతలు గీసి దాన్నే రశీదని రైతులకు అందిస్తారు. లేదా మొత్తం రకాన్ని ఒకముద్దగా వేసి ఇంతరకం ముట్టిందని రశీదులిస్తారు. లేదా తారీఖు ఇతర అవుసరమైన వివరాలు వ్రాయకుండా ఇస్తూఉంటారు. ఇవన్నీ అక్రమాలే. చట్టప్రకారంగా రశీదులన్నీ ప్రభుత్వపు మొహర్లు కలిగిఉండే పావుత పుస్తకాలపైన వ్రాయాలి. అవి తహశ్శీలు కచ్చేరీల్లో అర్ధరూపాయి లేక రూపాయి ఖరీదు ఇస్తే దొరుకుతాయి. ఒకసారి ఒక పుస్తకాన్ని కొని భద్రంగా దాచుకుంటే చాలా సంవత్సరాలదాకా ఉపయోగపడుతాయి. ఈ పుస్తకంలో రశీదులో ఉండవలసిన వివరాలన్నిటికీ సరిపోయేవిధంగా ఖేబుల్సు ఉంటాయి. రైతు

ఖాతా నెంబరు ఒక్కొక్క కిస్తీలో అతను ఏ సర్వే నెంబరు బాపతు ఎంత చెల్లించవలసిందీ రైతు చెల్లించిన మొత్తం ఎవరే వరిపరంగా ఎంతమొత్తం చెల్లించిందీ చెల్లించిన తేకి రశీదు వ్రాసిన తేదీ మొదలగు వివరాలన్నీ పట్వారీలు వ్రాయాలి. శిస్తు లెక్కలవిషయమై భూమి యాజమాన్యానికి సంబంధించిన అన్ని తగాదాల్లునూ పావుతీ పుస్తకాలద్వారా ఇవ్వబడిన రశీదులే అధికారయుతమైనవిగా పరిగణించబడుతాయి.

పై విధంగా చెల్లించనిరకాన్ని బకాయిగా నిర్ణయించి దానిని వేరే నిబంధనల ప్రకారం వసూలుచేయడం జరుగుతుంది.

శిస్తు చెల్లింపుకు పట్టాదారే ప్రభుత్వానికి బాధ్యుడుగా ఉంటాడు. తాను స్వయంగా వ్యవసాయంచేస్తున్నా లేక కౌలుకిచ్చినా పట్టాదారే ప్రభుత్వానికి శిస్తు కట్టవలసి వుంది. ప్రభుత్వానికి చెల్లించాల్సిన ఏరకపు శిస్తుతోనూ కౌలుదారుకు నిమిత్తంలేదు.

జాయంటుపట్టాలు షికిమీలు హెచ్చుగాఉండడం సర్వసామాన్యమైన విషయం. దీనివలన ఒక పట్టాదారుని పేర చెల్లించబడవలసిన రకాన్ని చాలామంది పంచుకొని చెల్లించాలి. ఎవరి భాగాన్ని వారే చెల్లించుకోవలసి ఉన్నప్పటికీ పంపకంచేసి లెక్కలు చూయించడానికి రైతులు పట్వారీల మీదనే ఆధారపడుతూ ఉంటారు. గనుక ఈ విధంగా పంచివేసే సందర్భాన చాలా మోసంచేసి హెచ్చు శిస్తును వసూలు

చేయడం జరుగుతుంది. కనుక వాళ్ల ప్రకారం మొత్తం రకం సక్రమంగా వసూలు చేస్తున్నదీ లేనిదీ చూచుకోవాలి. భాగ స్తుడు శిస్తు చెల్లించకపోతే పట్టాదారునుంచి శిస్తును వసూలు చేయవచ్చును. ఏ రకపు భూమి శిస్తుతోనూ కౌలుదారుకు నిమిత్తంలేదు.

పట్టాదారు చెల్లించని పక్షంలో అతని హిస్సాదారు నుండి లేక సిక్మీదారునుండి వసూలు చేయవచ్చు. అదీ సాధ్య పడకపోతే ఆ సంవత్సరానికి భూమిపై యెవరు కబ్జా కల్గివుం టారో అట్టి కబ్జాదారునుండిగూడ ప్రభుత్వం వసూలు చేయ వచ్చు. అయితే యిలాంటి సందర్భాలలో పట్టాదారు భూమి సాగుచేస్తున్న కబ్జాదారు లేక కౌలుదారు తాను పట్టాదారుకు చెల్లించాల్సిన కౌలు మొత్తంనుండి ప్రభుత్వానికి చెల్లించిన శిస్తు మొత్తాన్ని మినహాయించుకోవచ్చును. ఒకవేళ భూఖా మందు అందుకు అంగీకరించక పూర్తికౌలు మొత్తాన్ని చెల్లిం చమని పేచీపడితే ప్రభుత్వం భూఖామందు నుండి చెల్లించిన శిస్తుమేరకు వసూలుగావించి కౌలుదారుకు ముట్టజెప్పవచ్చును. పట్టాదారుకున్న భూమి ఆస్థిపై ప్రభుత్వంకు అతను చెల్లించా ల్సిన భూమిశిస్తు ప్రథమచార్జిగా వుంటుంది. (ల్యాండు రెవెన్యూ చట్టం శెక్షను 104.) దీని అర్థం ఏమిటి? ఆరుగాలం కష్టించి పండించిన పేదరైతులకు సరిపడ తిండిగింజలు పండినా, పండక పోయినా లేక వ్యవసాయఖర్చులు మళ్ళినా, మళ్లకపోయినా ప్రభుత్వం భూమిశిస్తును గోళ్ళూడగొట్టి వసూలు చేస్తుందన్న మాట. అందుకోసం పండించిన పంటను జప్తుచేయడం జరుగు

తుందన్నమాట. ఇది చాల అక్రమము; అన్యాయము. కష్టించి పండించే పేదరైతుకు సరిపడ తిండిగింజలుకూడ మిగలకపోతే ఎలా వ్యవసాయం సాధ్యమౌతుంది? ఇక భూమిశిస్తును చెల్లించడమనే సమస్యే లేదుగదా! అలాంటప్పుడు భూమిశిస్తు భూమిపై ప్రథమచార్జీగా వుండరాదు.

ల్యాండు రెవిన్యూ చట్టం సెక్షను 105 ప్రకారం పేద రైతుకు సరిపడ తిండిగింజలు పండినా, పండకపోయినా తప్పక భూమిశిస్తును ప్రభుత్వానికి చెల్లించవలసి వుంటుంది. ఈ పన్నులవిధానం చాల అక్రమము, అన్యాయము. సాగుచేసే రైతుకు సరిపడిన తిండిగింజలు, వ్యవసాయఖర్చులకు సరిపడిన ఆదాయం మిగులునట్లుగా పన్నువిధానం వుండాలి. అంతకు మించిన ఆదాయం గలవారిపైనే భూమిశిస్తు వుండాలి. అందు చేతనే రైతుసంఘాలు సాగు అయ్యే ప్రతికుంటా, సెంటుకు పన్నువిధించే అక్రమ భూమిశిస్తువిధానం అంతం అయి దాని స్థానే వ్యవసాయాదాయపు పన్ను విధింపబడాలనీ, తిండిగింజలకు, వ్యవసాయ ఖర్చులకు సరిపడ ఆదాయం రానట్టి పేద రైతులపై పన్ను అసలే వుండరాదనీ, అంతకుమించిన ఆదాయం వచ్చేవారిపైనే వృద్ధి క్రమానుసారంగా వ్యవసాయాదాయపు పన్ను విధింపబడాలని ఆందోళన గావిస్తున్నాయి.

భూమిశిస్తు విధింపులో జరిగే అన్యాయం ఏమిటో పైన తెల్సుకున్నాం. ఇక భూమిశిస్తు వసూలు విధానం యెలావుందో చూద్దాం. భూమిశిస్తు వసూలుకు ప్రభుత్వం యీ క్రింది పద్ధతులను అవలంబించుతుంది:—

(అ) పట్టా భూమిలోవున్న పంట మొత్తంగాకాని, లేదా కొంతభాగంగాని, ఆ పంట కిస్తీకిముందే మరొకరికి స్వాధీన తనఖా చేయబడడంగాని లేదా అమ్మివేయడంగాని జరిగివున్న పక్షంలో (ఏదైనా కోర్టు ఆర్డరుద్వారానైనా యిది జరగవచ్చు; లేదా భూఖామందే స్వయంగా యిచ్ఛాపూర్వకంగా చేసివుండవచ్చు.) ఆ సాలు భూమిశిస్తును పూర్తిగా చెల్లించనిదే పైరు కోయరాదని లేదా కోసివున్నట్లయిన నూర్చరాదనీ తాలూకాదారు (జిల్లాకలెక్టరు) పైరు తనఖా పొందినవానికి లేదా కొన్నవానికి వుత్తర్వు పంపవచ్చును. అయితే హాల్‌సాలు భూమిశిస్తువసూలు విషయంలోనే యీ విధంగా ఉత్తర్వు చేయడానికి తాలూకాదారుకు అధికారం వుందిగాని గతసంవత్సరం శిస్తుబకాయి వసూలుకోసం యిలా పంటను అడ్డగించరాదు.

(ల్యాండు రెవెన్యూచట్టం శెక్షను 106.)

(ఆ) పట్టాదారు చేతిలోకి పైరు పోయిందంటే శిస్తు వసూలుకాదని తాలూకాదారు నమ్మినట్లయిన తనకుగాని లేదా తనతరఫున అందుకోసం నియమితమైన మరొక ఉద్యోగికిగాని తెల్పకుండా పైరు కోయరాదని పట్టాదారుకు నోటీసు పంపవచ్చును. అట్టి నోటీసు వ్రాతరూపకంగా ఉండాలి; పట్టాదారుకు నోటీసు ముట్టినట్లు రశీదుగూడ వుండాలి.

తాలూకాదారు తాను పట్టాదారుకు నోటీసు, అందించకముందే పైరు కోయబడి వున్నట్లయిన కోయబడ్డ పైరు

ఆభూమినుండి తన అనుమతిలేకుండ కదల్చరాదని పట్టాదారుకు ఉత్తర్వు చేయవచ్చును. కోసిన పైరును కదల్చకుండా చూడ డానికి ఒక కాపలావానిని జీతమిచ్చి వుంచవచ్చును. కాపలా ఖర్చులు నెలకు అయిదురూపాయలకు మించ కుండా వుండాలి. ఈ కాపలా ఖర్చులను శిస్తు వసూలుచేసే ప్పుడు పట్టాదారునుండి రాబట్టవచ్చును. గ్రామాధికారులే కాపలాపని చూడగల్గితే ప్రత్యేకంగా కాపలా అతన్ని పెట్ట నవసరంలేదు. (అదేచట్టం శెక్షన్ 107.)

పైనతెల్పినవిధంగా పట్టాదారులేగాకుండా అతనిహిస్సా దారులకు, కౌలుదారులు వుంటే అట్టి కౌలుదార్లకుగూడ తాలూకాదారు వుత్తర్వు చేస్తాడు. గ్రామ మొత్తంమీద పట్టాదారులకు యిలాంటి నోటీసులు యిచ్చే సందర్భంలో, ఆ గ్రామాలలో టముకుద్వారా తెల్పవలసి వుంటుంది. వ్యక్తి గతంగా పట్టాదారులకు నోటీసు యివ్వాల్సివచ్చిన పరిస్థితులలో అందుకు సంబంధించిన పట్టాదారుకు నోటీసు అందజేయ బడు తుంది.

పైరు నష్టమయ్యేవిధంగా పొలంలో యెక్కువకాలం వరకు అట్టిపెట్టరాదు. రెండునెలలకంటె ఎక్కువకాలం పైరును జప్తుగావించి పొలంలో వుంచడానికి తాలూకాదారుకు అధికారంలేదు. ఈ జప్తుకాలంలో పట్టాదారు శిస్తు చెల్లించక పోయినట్లయిన పైరును చెల్లించాల్సిన శిస్తుమొత్తం మేరకు వేలంవేసి తతిమ్మా పైరును తీసుకుపోవడానికి పట్టాదారుకు అనుమతి యివ్వాలి. (అదేచట్టం 109 శెక్షను.)

పైన తెలిపినవిధంగా తాలూకాదారు యిచ్చే ఉత్తర్వును ఉల్లంఘించితే పట్టాదారులనుండి అతను చెల్లించాల్సినశిస్తు మొత్తానికి రెట్టింపు అపరాధ-క్రింద వసూలు చేయడానికి గూడ తాలూకాదారుకు అధికారంవుంది. (సెక్షను 108)

జప్తు గావించిన పైరును జప్తు ఖర్చులతోసహా భూమిశిస్తును తాలూకాదారు నియమించిన తేదీలోపల చెల్లించేందుకు పట్టాదారు యితర ఆస్తి హామీపెడితే పైరును తీసుకుపోవడానికి తాలూకాదారు అనుమతి యివ్వవచ్చును. ఒకేవాయిదాలోగాకుండా కొన్నివాయిదాలలో మొత్తాన్ని చెల్లించుకోడానికి తాలూకాదారు పట్టాదారుకు అవకాశమివ్వవచ్చును.

(ఇ) ఏ కిస్తీకి ఆ కిస్తీలోపు రైతు తాను చెల్లించవలసిన రకాన్ని చెల్లించకపోతే, చెల్లించగా మిగిలిన రకాన్ని బకాయి అంటారు. సర్వ సామాన్యంగా రైతాంగం ప్రభుత్వానికి చెల్లించవలసివస్తున్న బకాయీలు ఈ క్రిందిరూపాల్లో ఉంటాయి.

1. వర్షాలు లేక కరువు కాటకాలేర్పడినప్పుడు ప్రభుత్వం శిస్తులను పూర్తిగా మాఫీచేయకనే కొంతభాగాన్ని బరాయిందా పేరుతో తాత్కాలికంగా వాయిదావేసి మరుసటి సంవత్సరమో వచ్చే సంవత్సరాల్లోనే వసూలుచేస్తూ ఉంటుంది. ఏసాలు కాసాలు శిస్తులు చెల్లించడమే కష్టంగాఉండే రైతాంగానికి ఈ బరాయిందా శిస్తులు చెల్లించడం కష్టమైపోతుంది. వీటిని చెల్లించడం ఫలితంగా రైతులు శాశ్వితంగా అప్పులపాలై పోతూఉన్నారు.

2. బందోబస్తు రేట్లప్రకారంగా చెల్లించవలసిన శిస్తు గాక, వ్యాపార పంటలపైన, ఇతరవిధాలా అదనపుపన్నులను ప్రభుత్వం విధించుతూవున్నది. రైతులు వీటిని చెల్లించలేక పోవుటవలన, వీటిలో కొంతభాగం బరాయిందా ఉంటున్నది. దీనిని వసూలుచేయడానికి ప్రభుత్వం తీవ్రచర్యలను తీసుకుంటున్నది.

3. సమయానికి చెల్లించని తక్కావీ అప్పులు ఫారెస్టు ప్రాంతాల్లో ఫారెస్టు పన్నులుకూడా తరచుగా బకాయిల రూపంలో వసూలు చేస్తూఉంటారు అధికారులు.

4. 1946—48 వరకు జరిగిన పోరాటంలో రజాకారు మూకలు శిస్తులపేరుతో, లెవీధాన్యంపేరుతో, గ్రామాల్లో రైతులదగ్గర ఉన్న డబ్బు, ధాన్యమే గాక, నగ నాణ్యాలను గూడా కొల్లగొట్టినప్పటికి రైతాంగం శిస్తులు చెల్లించలేదని, ఈ సంవత్సరాల శిస్తులన్నింటినీ బకాయిరూపంలో వసూలు చేశారు; ఇంకా చేస్తూఉన్నారు.

5. జాగీర్లను రద్దుచేసినప్పటికీ, జాగీర్దారులకు చెల్లించవలసిన బకాయీలన్నిటిని వసూలుచేస్తున్నారు. సహజంగా ప్రభుత్వం, జాగీర్దార్లు చూపించే తప్పుడు లెక్కలపైన ఆధారపడి మాత్రమే ఈ బకాయీలను వసూలు చేస్తుంది.

ఇన్ని రూపాల్లో వసూలుచేయబడుతున్న బకాయీలు స్వయంగా రైతాంగపు ఆర్థిక స్తోమతకన్న మించి ఉంటున్నవి.

కాగా, వీటిని వసూలుచేసే సందర్భంలో పటేలు, పట్వారీలు, రెవెన్యూ అధికారులు, రైతాంగంపై అనేకవిధాలా వొత్తిడి తెచ్చి లంచాలను వసూలుచేయడం, పంటలను జప్తీ చేయడం, ఇంటిని, తట్టా చెంబును వేలంవేయడం వంటి అమానుషమైన పనులకు దొరకొంటున్నారు. వీటికి వ్యతిరేకంగా రైతాంగం సాగించే ఆందోళనకై రెవెన్యూచట్టంలోని దీనికి సంబంధించిన భాగాలు పరిశీలించుదాం.

శిస్తు బకాయిగా ఎప్పుడు పరిగణించబడుతుంది? ప్రభుత్వం నిర్ణయించే ఆయా కిస్తీలలోపల శిస్తును పూర్తిగా చెల్లించకపోతేగాని లేక అసలే చెల్లించకపోతేగాని అలా చెల్లించని శిస్తుమొత్తం శిస్తుబకాయిగా పరిగణింపబడుతుంది.

శిస్తు బకాయి పెట్టినందులకు తాలూకాదారు శిస్తు మొత్తానికి రెట్టింపుకు మించకుండా అపరాధం వసూలుచేయవచ్చు లేదా అపరాధపువడ్డీ వసూలు చేయవచ్చు.

శిస్తుబకాయి మొత్తాన్ని తాలూకా ఆఫీసులోని పేష్కారుగాని లేక అదే హోదాలోవున్న మరి యితర రెవెన్యూ ఉద్యోగిగాని తేల్చి ప్రకటించుతాడు. రైతుకు ఆ మొత్తాన్ని తెలియజేస్తారు. (డిమాండ్ నోటీసుద్వారా). రైతు బకాయి చెల్లించకపోతే బకాయి వసూలుకుగాను యీ క్రింది పద్ధతి అనుసరించబడుతుంది.

**(i)** బకాయి పెట్టినతరువాత ఎప్పుడైనా పట్టాదారుకు బకాయిమొత్తాన్ని ఫలానా తేదీలోపల పూర్తిగా చెల్లించవలసినదిగా తహశీలుదారుగాని లేక అతనిచేత నియమింపబడిన మరియే యితర ఉద్యోగిగాని తెలియజేయవచ్చు. ఇలా తెలియజేయడాన్ని "డిమాండ్ నోటీసు" ఇవ్వడంఅంటారు. "డిమాండ్ నోటీసు" ను జారీచేసినందులకు కొంత అదనపుమొత్తాన్ని వసూలుచేస్తారు. శిస్తుబకాయి మొత్తం పదిరూపాయిలకు మించనట్లయిన రెండు అణాలు, పదిరూపాయిల పైబడి యిరువది అయిదు రూపాయిలకు మించని మొత్తమైన నాలుగు అణాలు, అంతకుమించిన మొత్తాలకు ఎనిమిది అణాలు, డిమాండునోటీసు జారీగావించిన ఖర్చులక్రింద వసూలుచేస్తారు. (సెక్షన్ 118).

**(ii)** డిమాండునోటీసులో తెల్పబడిన వాయిదాలోపల శిస్తుబకాయిని పూర్తిగా చెల్లించకపోయిన, బకాయిపెట్టిన పట్టాదారు చరాస్థిగాని లేక పట్టాదారు భూమికాని యితర స్థిరాసిగాని జప్తుకు పూనుకుంటారు. (సెక్షన్ 119).

తహశీలుదారుగాని లేక అతనిచేత నియమించబడిన మరియే ఉద్యోగిగాని యీ జప్తుకు పూనుకుంటాడు. అయితే "సివిల్ ప్రొసిజర్ కోడ్" ప్రకారం జప్తుగావించడానికి వీలులేని చరాస్థిని శిస్తుబకాయి వసూలుకోసం జప్తుచేయరాదు. అలా జప్తుగావించడానికి వీలులేని చరాస్థి వస్తువులు యివి :- (1) విత్తనపుధాన్యం, (2) తిండిగింజలు, (3) నాగళ్లు, (4) దుక్కిపశువులు, (5) మంగళసూత్రం.

వీటినిగాక పట్టాదారుకుచెందిన యే యితరచరాస్తినైనా జప్తుగావించవచ్చు. జప్తుచేయడం అంటే జప్తుఅయిన వస్తువులను తహశీలుదారుగాని, అతనిచేత నియమితమైన వుద్యోగి (సాధారణంగా పటేలు. పట్వారీలే అయివుంటారు) గాని స్వాధీనపర్చుకోవడమన్నమాట. ఫలానా తేదీలోపలశిస్తుబకాయి చెల్లించకపోతే జప్తు వస్తువులను అరాజుగావించి శిస్తుబకాయిని వసూలుచేసుకొంటారు. అరాజు తేదీలోపల బకాయి మొత్తాన్ని అరాజుకోసం నియమించిన ఉద్యోగికి చెల్లించివేస్తే అరాజు నిలుపుచేయబడుతుంది. రొఖంగా చెల్లించకపోయి నప్పటికి బకాయిమొత్తానికి సరిపడ ఆస్థిని హామీ పెట్టినా అరాజును నిలుపుచేస్తారు.

అరాజుకోసం నిర్ణయించిన తేదీలోపల శిస్తుబకాయి చెల్లించబడకపోతే జప్తు గావించిన చరాస్థి అరాజు చేయబడు తుంది. అరాజులో అధికంగా పాడినవారి పేర పాట ఖాయం చేయబడుతుంది. శిస్తుబకాయి మొత్తానికి సరిపడ పాట రాక పోతే ఆనాటికి అరాజు నిలుపుచేయబడి అరాజు పెట్టేందుకు మరోతేదీ నిర్ణయింపబడుతుంది.

జప్తుఅయిన ఆస్థి వేలం వేయబడుతుందని తహశీలు దారు గాని లేక తాలూకాదారు గాని ముందు ప్రకటించు తారు. ఆ ప్రకటనను జప్తు అయిన ఆస్తి వున్నగ్రామములో గ్రామకచ్చేరిలో వ్రాతమూలకంగా వ్రేలాడ కట్టడంద్వారానూ గ్రామంలో టముకు ద్వారానూ తెల్పడం గావించాలి.

అలా ప్రకటన జరిగిన కనీసం వారంరోజులతరువాత అరాజు తేదీ నిర్ణయింపబడుతుంది. స్థిరాస్థిని వేలంవేసే సందర్భంలో పైన తెల్పిన కనీసవ్యవధి ఒక నెలరోజులుండాలి.

చరాస్థి అరాజు సందర్భంలో అరాజుపెట్టిన ఉద్యోగియే సాధారణంగా పాటను ఖాయంచేస్తాడు. స్థిరాస్థివేలం సందర్భంలో మాత్రం తాలూకాదారు పాటను ఖాయపర్చాల్సివుంటుంది.

చరాస్థి అరాజు సందర్భంలో పాట మొత్తాన్ని అంతా సాధారణంగా అరాజు తేదీనే పాటదారు చెల్లించాలి. లేదా వేలంపెట్టిన ఉద్యోగియిచ్చిన గడువులోపల చెల్లించాలి. స్థిరాస్థి వేలం విషయములో పాట మొత్తంలో నాలుగో వంతును తప్పనిసరిగా పాటరోజున చెల్లించాలి. మిగతాపాట మొత్తాన్ని పాటజరిగిన నెలరోజులలోపల చెల్లించాలి.

స్థిరాస్థివేలం సందర్భంలో పాటపెట్టిన వుద్యోగి పాటదార్లు కలసి కూడబలుక్కొని గావించి పాట సరిగా జరగనీయకుండ చేసారనీ కాబట్టి ఆ పాటను రద్దుగావించి మరో అరాజు పెట్టించాలనీ ఎవరైనా తాలూకాదారుకు పాట అయిన నెల రోజులలోపల దరఖాస్తు చేసుకొంటే తాలూకాదారుకు అట్టి దరఖాస్తులోని కారణాలు సక్రమమైనవని నచ్చితే పాటను తిరిగి పెట్టించవచ్చును. పట్టాదారుకు సరిగా తెలియకుండా గాని లేక పాటపెట్టే ఉద్యోగి పాటదారులనుంచి లంచం తీసు

కుని పట్టాదారుకు అన్యాయం కల్గేవిధంగా పాట ఖాయంచేసి నప్పుడుగాని పట్టాదారు యీ అవకాశాన్ని వినియోగించుకో వచ్చును.

అలా ఎట్టి దరఖాస్తురాని సందర్భంలో పాట అయిన నెలరోజులకు తాలూకాదారు పాటదారుపేర పాటను ఖాయ పర్చుతారు. పాట మొత్తాన్ని అంతా చెల్లించిన తరువాత అరాజు చేయబడిన స్థిరాస్థిని పాటదారుపేర రికార్డుల్లో నమోదు చేయడానికి తాలూకాదారు ఉత్తర్వు చేస్తారు.

పాట మొత్తం శిస్తుబకాయికి, పాట ఖర్చులకు సరి పోతే చిక్కేలేదు. అంతకంటే ఎక్కువ మొత్తం వున్నట్లయిన అదనపు మొత్తాన్ని బకాయిబడ్డ పట్టాదారుకు యిచ్చివేస్తారు. అయితే అలా యిచ్చేముందు ఆ పట్టాదారుపేర మరల ఏమైనా నూతనంగా శిస్తుబకాయి వుందేమో చూస్తారు. అలా వుంటే ఆ బకాయి మొత్తాన్నిగూడ మినహాయించుకొని యింకే మైనా మిగిలితే ఆ మొత్తాన్నిమాత్రం అతనికి చెల్లించివేస్తారు.

(**iii**) శిస్తుబకాయి వసూలుకోసం పైన తెల్పినవిధంగా స్థిరాస్థి, చరాస్థి జప్తు, వేలంలద్వారానే గాకుండా బకాయి పడ్డవానిని అరెస్టు గావించవచ్చు. అరెస్టుద్వారా తప్ప మరి యితర మార్గాల శిస్తుబకాయి వసూలుకాదని తాలూకాదారు భావించిన బకాయిదారుని పదిరోజులవరకూ జిల్లా లేక తహ శీలు కచ్చేరీలో కస్టడీలోపెట్టి వుంచవచ్చును. కస్టడీలోవున్న

కాలంలో శిస్తుబకాయిని, అపరాధపువడ్డీని, కస్టడీలో వున్నప్పుడు భోజనం వగైరా ఖర్చులను పూర్తిగా చెల్లించితే వెంటనే విడుదల చేయబడుతాడు. అలా చెల్లించకపోతే తాలూకాదారు వుత్తర్వుపై బకాయిదారు ఏదైనా సివిల్ జైలుకు పంపబడుతాడు. అయితే శిస్తుబకాయి వసూలుకోసం ఒక నెల రోజులకంటే అధికంగా జైలులో ఎవరినీ పెట్టివుంచరాదు.

(iv) శిస్తుబకాయి వసూలుకోసం బకాయి ఏభూమిపై పెట్టబడిందో ఆ భూమిని తాలూకాదారు స్వాధీనపర్చుకోవచ్చు. తాలూకాదారు స్వాధీనంలో యిలా స్వాధీనపర్చుకున్న ఆస్థి పదిఏండ్లవరకూ వుండవచ్చును. ఈ కాలంలో ఆ భూమిని కౌలుకిచ్చి వచ్చిన ఆదాయంద్వారా శిస్తుబకాయిని రాబట్టుకుంటూ వుండవచ్చును. (సెక్షను 124).

తెలంగాణా భూమి శిస్తురేట్లు ముఖ్యంగా తరిరేట్లు రైతాంగపు ఆర్థికస్తోమతకు మించి ఉండుటవలన, ఆంధ్రమహాసభ ఈ రేట్లను తగ్గించడానికి నిరంతరమూ ఆందోళన చేస్తూ వచ్చింది. జేరుబావులీ పన్నులను రద్దుచేసి, ఆ తరీ, తోటభూములపైన ఖుష్కీరేట్లను తీసుకోవాలని, రైతులు కాయకష్టంతో నిర్మించుకునే నీటివనరులైన పర్రికాలువ కోల్లు, యాతం మొదలగు తరిభూమిపైన ఖుష్కీరేట్లనే తీసుకోవాలనీ, చెరువు ప్రాజెక్టులక్రింది తరీభూములమీద, మద్రాసు రాష్ట్రంలోవలె నీటితీరువను నిర్ణయించాలనేది ఈ ఆందోళనయొక్క సారాంశం.

ఈ ఆందోళనఫలితంగా 1938 లో, అప్పటి నిజాంప్రభుత్వం, ఆయకట్టు వెలుపలనున్న జేరుబావులీ తరీపన్నుల్లో నూటికి 33⅓ వంతులనుమాత్రం తాత్కాలికంగా రిమిషన్ ఇస్తూ వచ్చింది. కాని పోలీసు చర్య తర్వాత మిలటరీప్రభుత్వం, వెల్లోడీప్రభుత్వం హయాములో, పై కోర్కెలలో కొన్నిటిని మాత్రము అంగీకరించి, వాటికనుగుణ్యంగా ఆర్డర్లు జారీచేయ బడినవి. వాటినే ఇచ్చట వివరించడం జరుగుచున్నది.

## —♦ ప్రస్తుతపు భూమిశిస్తు రేట్లు. ♦—

ఖుష్కీ, తరీభూములకు ఆయా భూముల తరములనుబట్టి వివిధరకాల భూమిశిస్తు రేట్లు వుంటాయి. ఖుష్కీలో దుబ్బ భూములకు ఒక రేటు వుంటుంది; చెల్కాభూములకు మరొక రేటు వుంటుంది; నల్లరేగళ్లకు యింకో రేటు వుంటుంది. ఈ విధంగానే తరి భూములకుగూడ వివిధ రేట్లు వుంటాయి. అయితే తరిభూముల విషయములో ఒక తేడావుంది; ఖుష్కీభూముల మాదిరిగా ఆయా భూముల తరాలనుబట్టిగాక తరిభూములకు లభించే నీటివనరులనుబట్టి తరిభూముల శిస్తురేట్లలో తేడా వుంటుంది. ప్రభుత్వం పంటచెరువులక్రింద, ప్రాజెక్టులక్రిందవున్న తరిభూములకు ఒకరకపు రేటు వుంటుంది. భావులక్రింద తరిభూములకు మరొక రేటు వుంటుంది. భావులక్రింద తరిభూములకు గూడ ఒకేరకపు రేటుగాక వివిధరకాలుగా వుంటుంది.

తోటపైరులకు యింకో రేటు వుంటుంది. ఈ విధంగా పలురకాలుగా నేడు అమలులోవున్న భూమిశిస్తు రేట్లుగూర్చి తెలుసుకుందాం. ముందు తరిభూములగూర్చి తెలుసుకుందాం.

"1951 వ సంవత్సరపు భూమిశిస్తు నిబంధనలు" అన్న ఒక చిన్న పుస్తకాన్ని హైదరాబాదు ప్రభుత్వం యిటీవల ప్రకటించింది. ఆ పుస్తకాన్ని అనుసరించే భూమిశిస్తు ప్రస్తుతపు రేట్లనుగూర్చిన భాగాన్ని వ్రాస్తున్నా.

I. తరిభూములరేట్లు:—(అ) భావులక్రింద తరిరేట్లగూర్చి ముందు విచారించుదాం.

(i) 1317 వ ఫసలీ (1907 సం.) కి ముందు తమభూములలో త్రవ్వబడిన స్వంతభావులనుండి నీరు పారించుకొంటూ ప్రభుత్వ నీటివనరులనుండి ఏవిధంగానూ నీరు తీసుకోకుండా సాగు చేసుకున్నప్పటికీ తరిరేట్లు విధించబడుతూ వుండేవి. 1317 వ ఫసలీ (1907 సం.) లో ల్యాండుచట్టం అమలులోకి వచ్చాకగూడ అట్టి భావులక్రింద తరిభూములకు 1348 వ ఫసలీ (1938 సం.) వరకూ తరిరేట్లే విధించబడుతూ ఉండెను. కాని రైతుల తీవ్రాందోళన ఫలితంగా అట్టి భావులక్రింద సాగు భూముల శిస్తురేట్లను విచారించేందుకు హైదరాబాదుప్రభుత్వం ఒక విచారణకమిటీని నియమించింది. ఆ కమిటీ సూచనమీాదట 1317 వ ఫసలీ (1907 సం.)కి పూర్వంవున్న స్వంతభావులక్రింద సాగుకు తరిరేటు వసూలు చేయబడడం మానివేయబడింది. ఆ భావులున్న గ్రామంలో అత్యధికంగా వసూలుచేయబడే ఖుష్కీ రేటుకుమించి భూమిశిస్తు అట్టి భావులక్రింద తరిభూములకు విధించరాదని వుత్తర్వు చేయబడింది. ఇప్పటికీ అదేఉత్తర్వు అమలులోవుంది. కాబట్టి 1317 వ ఫసలీ (1907 సం.) కి పూర్వం

త్రివ్వబడిన భావులక్రింద సాగు అయ్యే భూములను ఆ ప్రాంతం లోని అత్యధికమైన ఖుష్కీ రేటుకంటె అధికంగా భూమిశిస్తు వుండరాదు.

ప్రభుత్వ ఆయకట్టుక్రిందకు రాని ఖుష్కీ భూములలో 1317 వ ఫసలీ (1907 సం.) అనంతరం స్వంతంగా భావి త్రవ్వు కుని సాగుచేస్తున్న తరిభూములకుగూడ పైనతెల్పిన విధంగా ఖుష్కీ రేటునే విధించాలిగాని తరిరేటు వసూలు చేయరాదు. నేటికిగూడ రైతులు ప్రభుత్వ ఆయకట్టుక్రిందకురానట్టి ఖుష్కీ భూములలో భావులు త్రవ్వకొని ఖుష్కీ రేటుపై తరిసాగు గావించుకోవచ్చును. పై విధంగా సాగు అవుతున్న భూమి ఎప్పుడైనా భవిష్యత్తులో ప్రభుత్వ ఆయకట్టక్రిందకు వచ్చి నప్పుడుగూడ ప్రభుత్వ నీటివనరులనుండి తప్పనిసరిగా నీరు తీసుకోవాలని, అట్టి పట్టాదారుని ప్రభుత్వం నిర్బంధించరాదు. ప్రభుత్వ నీటివనరునుండి నీరు తీసుకోవడమా లేదా అనే సమ స్యను ఆ పట్టాదారు స్వేచ్ఛగా తేల్చుకోవచ్చును. ప్రభుత్వ నీటివనరునుండి నీరు తీసుకొంటే నిర్ణయింపబడిన తరిరేటు విధిం చబడుతుంది; అలా నీరు తీసుకోకుండా తన స్వంతభావి నీరు తోనే సాగు చేసుకుంటూవుంటే ఖుష్కీ రేటునే వసూలు చేయవలయును.

## (ii) ప్రభుత్వం ఆయకట్టులోపల భావులక్రింద రేట్లు:—

ప్రభుత్వ ఆయకట్టుక్రింద వున్న తరిభూములలోగూడ రైతులు భావులు త్రవ్వకోవచ్చును. ఇలాంటిభావులనే 'జదీద్'

భావులంటారు. యీ భావులక్రింది భూములకు యీ క్రిందిపద్ధతి ప్రకారం శిస్తు విధించబడుతుంది.

—ప్రభుత్వం నీటివనరునుండి వర్షాభావం వలనగాని, మరే కారణంవలనగాని నీరుపారకపోయి భావినీటితోనే సాగు అయినప్పుడు ఖుష్కీ రేటుమాత్రమే వసూలుచేయాలి.

— ఏక్ ఫసలీ తరిభూమి సంవత్సరంలో మొదటిపంట ప్రభుత్వం నీటివనరు పారకంద్వారా పండించబడటం. రెండో పంట పూర్తిగా భావినీటి పారకంద్వారా సాగుచేయబడటం జరిగినప్పుడు రెండోపంటకు తరి రేటు వసూలుచేయబడరాదు. ఖుష్కీ రేటుమాత్రమే వసూలుచేయబడాలి.

అయితే యిలాంటి భూములవిషయంలో రెండోకారు సాగుఅయినా సాగు కాకపోయినా తప్పనిసరిగా ఖుష్కీ రేటును ప్రతిసంవత్సరం భూఖామందు చెల్లించుకోవాల్సిందే.

— మొదటికారుకుగూడ ప్రభుత్వం నీటివనరునుండి నీరు పారుదల కాకపోయినప్పుడు మొదటిపంటకుగూడ ఖుష్కీ శిస్తే వసూలుచేయాలిగాని తరి రేటు వసూలుచేయరాదు. అయితే ప్రభుత్వం నీరుపారకం లేనప్పుడు మొదటికారును భావి క్రింద నిర్బంధంగా సాగుచేయ నవసరంలేదు. అలా సాగుమాని వేసి రెమిషన్ అడగడానికిగూడ పట్టాదారుకు హక్కుంది. భావిక్రింద సాగు చేస్తేమాత్రం ఆ హక్కు వుండదు.

—దో ఫసలా తరిభూమి (డబుల్ క్రాప్ వెట్ ల్యాండు) యే కాకున్నా ప్రభుత్వం నీరుపారకం లేనప్పుడు భావిపారకం ద్వారానే సాగు గావించినప్పుడు ఆ కారుకు ఖుష్కీ రేటుమాత్రమే వసూలు చేయబడాలి.

— ప్రభుత్వ నీటివనరులు అభివృద్ధి అయ్యో లేక విస్తృతమయ్యో ఎవ్విధంగానైనా అంతకుముందు ఒకే కారుకు సప్లయిఅయ్యే నీరు రెండో కారుకుగూడ సప్లయిఅయ్యే అవకాశం ఏర్పడ్డప్పుడు ఆ నీటివనరు ఆయకట్టుకిందవున్న భూములన్నింటిలో నీరు సప్లయి వున్నంతవరకు రెండుకార్లు తప్పనిసరిగా రైతులు పండించాలి. అలా పండించకపోయినా రెండు కారులకు నీటితీరువా వసూలు చేయబడుతుంది.

పైన తెల్పిన నిబంధనలన్నీ 1303 వ ఫసలీ (1893 సం.) లో ప్రభుత్వం జారీగావించిన వుత్తర్వులప్రకారం యివ్వబడిన కౌలుదారులకు చెందిన భావులకుగూడ వర్తించుతాయి.

<u>(iii) ఇతరవిధాల భావులకింద సాగు —</u>

— ప్రభుత్వం నీటిపారకంద్వారాసాగు అవుతూవున్న భూమిని ఏ కారణంచేతనైనా ప్రభుత్వపు నీటిసప్లయి లేక అందు బాటులో ప్రభుత్వానికిచెందిన ఏ భావినీటిద్వారానైనా సాగు చేసుకోవచ్చును. అయితే అట్టి ప్రభుత్వపు భావికింద ప్రత్యేకించిన సాగుభూములు ఏవీ లేనప్పుడే పైవిధంగా అట్టి భావుల నుండి నీరు తీసుకోవచ్చును. అలా నీరుతీసుకున్నప్పటికీ తరి రేటు

తీసుకోరాదు. ఖుష్కీ రేటుమాత్రమే తీసుకోవాలి. తరి రేటు లోని తతిమ్మా మొత్తాన్ని ఆ సంవత్సరానికి మాఫీ చేయాలి. అయితే పక్కనున్న ప్రభుత్వపు భావినీరును తీసుకుని తప్పని సరిగా రైతు సాగుచేయాలన్న నిర్బంధం ఏమీ లేదు. అలా సాగుచేయడమా, చేయకపోవడమా అనేది రైతు యిష్టంపై ఆధారపడి వుంటుంది.

—— బందోబస్తు అప్పుడు భావికింద సాగుభూములుగా నమోదుఅయి దరిమిలా ప్రభుత్వం నీటివనరులు ఏర్పడి ప్రభుత్వం నీటిపారకంకింద సాగుభూములుగా రికార్డుఅయిన భూముల సందర్భంలో ప్రభుత్వం నీటిసప్లయి తగ్గిపోయో లేక మరే కారణంవలన అయినా భావి పారకంద్వారా మాత్రమే సాగు చేయాల్సి వచ్చినప్పుడు ఖుష్కీ రేటుమాత్రమే వసూలు చేయాలి. అయితే అలా నీరుసప్లయి గావించే భావులను "ఇందాదీ భావులుగా" (సహాయకభావులుగా) పరిగణించ రాదు.

—— 1318 వ ఫసలీ (1908 సం.) బందోబస్తుకు పూర్వం త్రవ్వబడిన ఏదైనా ఒక భావిని బందోబస్తుకాలంలో పారకం భావిగా పరిగణించకుండావుండి దానికింద ఏభూమిని సాగుకు ప్రత్యేకించకుండావున్న సందర్భాలలో దరిమిలా ప్రభుత్వ నీటి సప్లయి లేనప్పుడు అట్టిభావిని షరమ్మతు గావించుకొని సాగు చేసుకుంటూ వున్నప్పుడు ఖుష్కీ రేటుమాత్రమే వసూలుచేయ బడాలి. "కమీ ఏక్ సాలా" క్రింద తరి రేటు వసూలు నిల్పు

చేయబడాలి. ప్రతిసంవత్సరం ''కమీ ఏక్ సాలా'' క్రింద తరి రేటు వసూలు నిలుపుచేస్తూవుండడం సరిగాదు. అట్టిభావులను బందోబస్తు అనంతరం త్రవ్వబడిన నూతనభావులుగానే రికార్డులో నమోదుచేస్తే సరిపోతుంది. అలా చేయడానికి తహశీలుదారుకు హక్కువుంది.

— ప్రభుత్వం నీటిసప్లయి లోపించినప్పుడు ప్రభుత్వ ఆయకట్టులోని తరి పైరును కాపాడుకొనేందుకు 'గైరు హంగామా' భావులనుండి (వర్షాభావంవలన చెరువులలో నీరు తక్కువ అయినప్పుడు ఉపయోగించే భావులు) మోటద్వారా నీరు ఉపయోగించుకోవచ్చును. అలాంటి సందర్భాలలో తరి శిస్తు వుండదు. రిమీషన్ కోరుకోవచ్చును.

— ప్రభుత్వం నీరుసప్లయి లోపించినప్పుడు ఆ ఆయకట్టులో జేరివున్న తరిభూమిని ఆ ఆయకట్టులో జేరనట్టి ఏకేలీ భావి పారకంద్వారాగాని లేక ఆయకట్టులో జేరివున్న ఏ యీనాం భావి లేక తదితరరైతుకు చెందిన భావిద్వారాగాని సాగుచేస్తే ఆబీ, తాబీ పంటలకు ఖుష్కీ రేటుమాత్రమే విధించాల్సి వుంటుంది. తతిమ్మా తరిరేటును "కమీ ఏక్ సాలా" క్రింద రిమీషను యివ్వాలి.

—భావి పారకంక్రింద లెక్కలలో నమోదుచేయబడిన భూమి ప్రభుత్వ నీటిసప్లయిద్వారా సాగుచేయబడిన పక్షంలో అట్టిభూమికి భావి పారకం రేటు గాకుండా ప్రభుత్వం నీటితీరువాయే విధించబడుతుంది.

ప్రభుత్వ ఆయకట్టులోనే జేర్చబడి భావికింద సాగు అవుతూ బందోబస్తుప్రకారం భావిపారకం రేటు చెల్లించేభూము లలో సాగుమార్పిడి వచ్చినా అంటే వరికిబదులు ఎక్కువనీరు కావాల్సివచ్చే చెరుకు, అరటి, తమలపాకు మున్నగు తోట పైర్లు పండించినప్పటికీ భావిపారకం రేటే వసూలుచేయబడాలి తప్ప అదనంగా శిస్తు విధించరాదు. అంతేగాకుండా తనభావిని అభివృద్ధిగావించుకొని బందోబస్తులో భావికింద నిర్ణయించిన ఆయకట్టుకు మించిగూడ ప్రక్కనున్న ఖుష్కీభూమిని సాగు లోకి తెచ్చినా అదనపుశిస్తు చెల్లించుకోనవసరంలేదు.

పైనతెల్పిన భావులకింద సాగుభూములకు రాళ్ళవర్షం కురిసి, వరదలుపారి, మిడతలదండువచ్చి యిలాంటిరైతుల శక్తికి మించిన అవాంతరాలు వచ్చిన సందర్భాలలోతప్ప రిమిషను ఇవ్వబడదు.

## భావిపారకం, ప్రభుత్వం నీటిసప్లయి, రెంటిద్వారా సాగు అయ్యే భూములు:—

ఈ విధంగా లెక్కలలో నమోదుఅయిన తరిభూముల సందర్భంలో యీ క్రిందివిధంగా రేట్లు విధించబడుతాయి.

— ప్రభుత్వ నీటిసప్లయి, భావిపారకం రెండువిధాల ఆధారంవున్నదో ఫసలీ తరిభూమివిషయంలో ప్రభుత్వం నీటి పారుదల సాధ్యంకానప్పుడు (చెరువు లేక కాలువ గండ్లుపడి పోయి నీరంతా పోయినప్పుడు) భావిపారకంద్వారా సాగుచేయ

బడితే ఆ పంటకు మామూలుగా చెల్లించే రేటుతో $2/3$ వంతు 'కమీా ఏక్ సాలా' క్రింద రిమీాషను యివ్వబడుతుంది,

ఏక్ ఫసలీ (ఆబీ) తరిభూమి అయినప్పుడు ఆబీపైరు ప్రభుత్వం నీటిసప్లయిద్వారానూ, తాబీపైరు ప్రభుత్వ నీటిస ప్లయి లేకుండా భావిపారకంద్వారానూ సాగు అయివుంటే ముందు తాబీరేటు ఎంతో నిర్ణయించి ఆ రేటులో $2/3$ వంతు "కమీా ఏక్ సాలా" క్రింద రిమీాషను ఇవ్వాల్సివుంటుంది.

ఆబీపంటకు ప్రభుత్వ నీటిపారకం, తాబీపంటకు ప్రభుత్వం నీటిసప్లయి, భావిపారకం రెండూ నిర్ణయించివున్న సందర్భంలో చెరువుకు గండిపడిపోయి ఆబీపైరు పెట్టకుండా పడావుగా వుండడం. తాబీపైరుగూడ ఏకారణంచేతనైనా పెట్టకుండా వుంచడం జరిగినప్పుడు ఆబీకిస్తీలో పూర్తిగా రిమీాషను ఇవ్వాల్సి వుంటుంది. తాబీకిస్తీకి ఆబీకిస్తీ మొత్తంలో సగం మాత్రం వసూలుచేయాల్సి వుంటుంది.

—దో ఫసలీ తరిభూమి విషయంలో ఆబీపైరుకు ప్రభుత్వ నీటిసప్లయి, తాబీపైరుకు భావినీరు సప్లయి జరుగుతూ వున్నప్పుడు ఏ కారణంచేతనైనాగాని ప్రభుత్వ నీటిసప్లయి లోపించి అబీలో ఖుష్కిసాగు, తాబీలో భావిపారకంద్వారా తరిసాగు జరిగివున్నట్లయిన ఆబీకిస్తీకి ఖుష్కిరేటున్నూ, తాబీకిస్తీకి భావిపారకంక్రింద తరిరేటున్నూ వసూలుచేయ బడుతుంది.

తాబీలో గూడ ఎట్టికారణం లేకుండానే అసలుభూమిని పడావు పెట్టివున్న సందర్భాలలో గూడ తాబీలో భావి పారకంక్రింద పూర్తి తరి రేటు వసూలుచేయబడుతుంది.

ఆబీపైరుకు ప్రభుత్వ నీటిసప్లయి లేక తాబీకాలుకు నిర్ణయించిన బావిపారకంక్రిందనే సాగుచేస్తే ఆబీకిస్తీకి ఖుష్కి రేటు విధించబడుతుంది.

ప్రభుత్వ నీటిపారకంద్వారా ఆబీపైరు సాగుఅయి తరువాత పైరు, నీరుచాలక ఎండిపోవడం, తరువాత తాబీపైరు భావిపారకంక్రింద పండించడం జరిగితే తాబీకిస్తీకి భావిక్రింద పూర్తి తరి రేటు వసూలు చేయబడుతుంది.

— ప్రభుత్వ నీటిసప్లయిద్వారా సాగుఅయి, పైరు పూర్తికాలంలో సగంకాలానికి తగ్గకుండా నీరుసప్లయి అయి ఆ తరువాత ప్రభుత్వ నీరుసప్లయిగాక యితర ఏ ఇతుదాదీ భావి పారకంద్వారా పైరు పెంచబడ్డప్పుడు రిమీషను కోరడానికి వీలులేదు. అంటే, తరి రేటే చెల్లించుకోవాలి. ప్రభుత్వం నీటి సప్లయి సగంకాలానికి తక్కువ వున్నప్పుడు "కమీ ఏక్ సాలా" క్రింద తరి రేటు రిమీషను ఇవ్వబడాలి.

ప్రభుత్వ నీటిపారుదల వనరుకు గండిపడ్డప్పుడు రైతులు తమ స్వంత శ్రమ, ఖర్చులతో పైరు నాశనంగాండా కాపాడుకున్నప్పుడు తరి రేటులో సగంవరకే శిస్తు వసూలుచేయాలి.

## (ఆ) ప్రభుత్వ నీటివనరులక్రింద తరిభూములు

— బందోబస్తు కాలమప్పుడు ఏకీ ఫసలీ తరిభూము లుగా గాని లెక్క కట్టబడిన అన్నిరకాల తరిభూముల సంద ర్భంలోనూ ఆబీ పంట మొదటి పంటగానూ, తాబీపంట రెండవపంటగానూ పరిగణింపబడుతుంది. ప్రభుత్వ నీటి సప్లయి సక్రమముగా వుంటే ప్రభుత్వ ఆయకట్టుక్రింద సాగుఅయ్యే అన్నిరకాల తరిభూములలోనూ ఆబీ తప్పనిసరిగా సాగు చేయాలి. నీటిసప్లయి సక్రమముగా వుంటే తాబీకారు గూడ తప్పనిసరిగా సాగు చేయాలి. దో ఫసలీ తరిభూములలో ఆబీ కారుకు పూర్తి తరి రేటున్నూ, తాబీకారుకు ఆబీ రేటులో సగం రేటున్నూ వసూలు చేయబడుతుంది.

తగిన కారణాలు లేకుండా భూమిని పడావుగా వుంచితే రిమీషన్ యివ్వబడదు.

— ఆబీకారు సాగుకు ఆశ్లేషకార్తెఆఖరి గడువుగా పరిగణింపబడుతుంది. ఆశ్లేషకార్తిలో సెను సరిపడ వున్నట్లయిన ఆబీకారు తప్పనిసరిగా సాగుచేయాల్సి వున్నట్లే భావించబడు తుంది.

బుగ్గనీటి పారకంద్వారా సాగుఅయ్యే భూములకు గూడ యితర ప్రభుత్వ నీటివనరుల పారకంద్వారా సాగు అయ్యే భూములకు వసూలు గావించే తరి రేటునే వసూలు చేస్తారు.

## (ఇ) పక్కా మరియు కచ్చా బుక్కీలు ద్వారా తరిసాగు (శాశ్వత మరియు తాత్కాలిక ఏతం లేక గూడలు)

నదులు, వాగులు మున్నగు సహజ నీటి పారుదల వనరులనుండి బుక్కీలద్వారా అంటే ఏతం లేక గూడలద్వారా ఖుష్కీభూములుగా నమోదు అయిన భూములలో తరి పండించు కోవచ్చును. అలాంటప్పుడు తరిరేటు విధించబడదు శాశ్వతంగా ఏతం ఎత్తుకుని సాగుచేసుకుంటుంటే ఆ ప్రాంతంలోవున్న గరిష్ట ఖుష్కీ రేటును విధించాలి. తాత్కాలికంగా గూడల ద్వారా సాగుచేసుకొంటుంటే 1¼ ఖుష్కీ రేటు విధించాలి. ఈ రేట్లకు మించి శిస్తు వసూలు చేయరాదు.

— బందోబస్తుద్వారా శిస్తు ఖాయ పర్చనట్టి ప్రభుత్వ ఆయకట్టుకింద సాగుఅయ్యే నదులు, వాగులు చేరువనున్న తరిభూములకు ఆ నదులు వాగులకు ఏతములు ఎత్తి సాగుచేసు కొంటూ వున్నప్పుడు శాశ్వతంగా ఏతాలు ఎత్తి సాగుఅయ్యే భూములకు ఆ ప్రాంతంలో అమలులోవున్న గరిష్ట రేటున్నూ మరియు ఆ రేటులో ఎనిమిదోవంతున్నూ శిస్తురేటు విధించాలి. ఏతములద్వారా గాకుండా తాత్కాలికంగా గూడల ద్వారా సాగు అవుతున్న గరిష్ట ఖుష్కీ రేటున్నూ మరియు అందులో నాలుగోవంతున్నూ వసూలుచేయాలి.

### (ii) భాగాతు లేక తోటపైర్లు:—

ప్రభుత్వ ఆయకట్టులో చేరనట్టి ఖుష్కీభూములలోని స్వంతభావులద్వారా సాగుఅయ్యే తరిభూములకు ఖుష్కీరేట్లు

మాత్రమే వసూలు గావించాలని లోగడనే చూపాం. అదే విధంగా ఖుష్కీ-భూములలోని స్వంతభావులక్రింద భాగాతుపైర్లు వేసినప్పుడు కూడ ఖుష్కీ-రేట్లే వసూలుచేయాలి. ఇక ప్రభుత్వ నీటిసప్లయిద్వారా పండించే తోటపైర్లుకు ఏవిధమైన రేట్లు వసూలుచేయబడతాయో పరిశీలిద్దాం. ముందు చెరుకుపంట గూర్చి విచారిద్దాం.

(అ) చెరుకుపైరు సాగు:—

(i) ప్రభుత్వ నీటిసప్లయిద్వారా పండించే ఆబీకారుకు విధించే తరి రేటుకు చెరుకుపంట పండించినప్పుడు సాధారణంగా రెట్టింపు విధించుతారు. ఎకరంలో నాలుగోవంతు అంటే 10 గుంటలకు తక్కువ భూవిస్తీర్ణంలో చెరుకు వేసినా 10 గుంటల విస్తీర్ణానికే పైనతెల్పినవిధంగా రేటు వసూలుచేస్తారు.

(ii) చెరుకుపైరుకు ముందు నీటిసప్లయి చేయాలి. ఆ తరువాతనే యితరపైరులకు నీరు సప్లయిచేయాలి.

(iii) మోడెము మరియు మకరమోడెము చెరుకుపైరులకు అంటే రెండోకారు మరియు మూడోకారు చెరుకుపైర్లుకు రెంటికీ మొదటి తాబీకారు రేటునే వసూలుచేస్తారు.

మొదటికారు చెరుకుపంట పూర్తి అయ్యాక తాబీకారు సాగుచేస్తే పూర్తి తాబీకారు రేటు వసూలుచేయ బడుతుంది. అయితే తప్పనిసరిగా రైతు తాబీకారుసాగు చేయాలన్న నిర్బంధం లేదు.

(iv) నీటికరువువచ్చి ప్రభుత్వం మామూలుగా నీరు సప్లయి చేయజాలకపోయినప్పుడు ప్రభుత్వ వనరునుండి గూడల ద్వారాగాని లేక మరోవిధంగాగాని చెరుకుతోటకు ఒక నెల రోజులకు తక్కువ లేకుండా నీరు పారించుకుంటే అలా పారించుకున్నంతకాలం ప్రతి నెలకూ చెరుకుపైరుకు మామూలుగా విధించే పూర్తి రేటులో పన్నెండోవంతు రిమిషను ఇవ్వబడుతుంది. అలా పారించుకున్న కాలం నెలకు తక్కువవుంటే అసలు రిమిషను కోరడానికి అవకాశంలేదు. చెరుకుపైరుకు విధించే పూర్తి శిస్తును చెల్లించాల్సిందే.

(ఆ) ఇతర తోటపైరులు — ప్రభుత్వ నీటిసప్లయి సక్రమముగా వున్నప్పటికీ ప్రభుత్వ ఆయకట్టులో జేర్చబడిన తరి భూమిలో భాగాతుపైరులు వేస్తే కిస్తీ పూర్తి తరి రేటు వసూలు చేయబడుతుంది. సంవత్సరంఅంతా ప్రభుత్వ నీటిసప్లయివున్న తోటపైరులకు పూర్తి తరి రేటుకు రెట్టింపు వసూలుచేయబడుతుంది.

బందోబస్తు అప్పుడు ప్రభుత్వం ఆయకట్టులో జేర్చబడిన భాగాతుభూమిగా నిర్ణయింపబడినదాని తరం రేటు, ఆబీకారుకు చెల్లించే రేటుకు సమానంగా వున్నప్పుడు అట్టిభూమిలో వరి సాగుగాని లేక చెరుకుపైరు సాగుగాని చేసివున్నట్లయిన ప్రభుత్వం ఆయకట్టులోజేరిన తరిభూములకు విధించిన రేటుచే వసూలు చేయాలి.

ప్రభుత్వ నీటిసప్లయిద్వారా తమలపాకుతోట వేసిన ప్పుడు దానికి దోఫసలీ తరిభూమికి విధించే పూర్తి రేటు విధించబడుతుంది. చెరుకుతోటలవలెనే తమలపాకు తోటలుగూడ 10 గుంటల విస్తీర్ణానికి తగ్గివున్నప్పటికీ, 10 గుంటల విస్తీర్ణానికి తగిలే రేటునే వసూలుచేస్తారు.

(III) ఖుష్కి—భూములపై రేట్లు:—

భూమి తరములనుబట్టి ఖుష్కి—రేట్లు విధించబడుతాయి.

ఒకసంవత్సరంలో ఖుష్కి—భూమిలో ఎన్నికారులు పండించినా ఒకే ఖుష్కి—రేటుకంటే అధికంగా వసూలుచేయరాదు.

— ఖుష్కి—భూమిలో వర్షాధారంతో తరిపంట పండించితే (ఆస్మాన్ తరి) అందుకు అదనంగా శిస్తు వసూలుచేయరాదు. అయితే ప్రభుత్వ నీటిపారుదల వనరుకుచెందిన ఏ చెరువు లోదట్టులోనే అట్టి ఆస్మాన్ తరిసాగు చేస్తేగాని లేక ఆ చెరువులోకిపారే నీటిద్వారా సాగుచేస్తేగాని అట్టి సందర్భాలలో కనిష్ట తరిరేటు విధించబడుతుంది.

— సాధారణంగా ఖుష్కి—భూములకు రిమిషను ఇవ్వబడదు. అయితే మానవాతీతమైన కారణాలవలన పంటలు పూర్తిగా పోయినప్పుడు రైతులు రిమిషను కోరవచ్చును. రిమిషను ఇవ్వడమా లేదా అన్నది ఆయా జిల్లాకలెక్టర్లపై ఆధారపడి వుంటుంది.

## (IV) లోకల్ సెస్సుల విధింపు

భూమిశిస్తుపై రూపాయికి అణాచొప్పున సెస్సు విధింపబడి అదనంగా భూమిశిస్తుతోపాటు వసూలుచేస్తారు. తరి, ఖుష్కి భాగాతు మున్నగు భూములన్నింటిపై యీ సెస్సు విధించబడుతుంది. అయితే సేతిసింధీలు, నీరాడీలు, మాదిగలు, బలోతాదార్లు మున్నగు పనిపాటలవారికి ఇవ్వబడిన సర్వీసు యీనాంభూములపై సెస్సువసూలుచేయబడదు. అంతేగాకుండా అనుమతిలేని సాగు చేసినప్పుడు చెల్లించే అపరాధపు పన్నులపై గూడ యీ సెస్సు విధించబడదు. భూమిశిస్తు చెల్లే పట్టాభూములపై మాత్రమే యీ సెస్సు వసూలుచేయబడుతుంది.

(V) (అ) పట్టాభూములలోవుండే ఫలవృక్షాల (తాడి, ఈత, విప్పచెట్లు మినహా) పంటనుగూడ ఇటీవలవరకు అంటే 1359 వ ఫసలీ (1949 సం.)వరకూ ప్రభుత్వం అరాజుపెడుతూ వుండేది. అందుచేత పట్టాదారే ఆ పంటను సంవత్సరం సంవత్సరం పోడుకోవాల్సి వచ్చేది. పాటనాటికి గత పదిసంవత్సరాల మీాద సగటుపాట మొత్తంలో సగం చెల్లించి, పట్టాదారు తన పట్టాభూమిలోవున్న ఫలవృక్షాల పంటను అనుభవించుతూ వుండేవాడు. ఈ పద్ధతి 1359 ఫసలీ (1949 సం) లో అంతం చేయబడింది. నేడు పట్టాభూములలోని ఫలవృక్షాల సర్వసంపదలపైన పట్టాదారుదే హక్కు. ఫలవృక్షాల పంటను అనుభవించేందుకు పట్టాదారు ప్రభుత్వానికి ఏవిధమైన పన్ను చెల్లించనవసరంలేదు.

(ఆ) 1340 ఫసలీ (1930 సం.) వరకు తెలంగాణాలో ప్రభుత్వానికు చెందిన పోరంబోకు, గైరాన్, ఖారిజ్, కాతాభూము లలో పశువులు మేపుకోనేందుకు బంచరాయిపన్ను దానిపై సెస్సు వసూలుచేయబడుతూ వుండేది. కాని ఆ తరువాత ఆ పైన తెల్పిన భూములలో అట్టి బంచరాయిపన్ను, సెస్సువసూళ్లు నిలుపుచేయబడ్డాయి. అయినా బంచగొండిఉద్యోగులు, పటేలు పట్వారీలుకలసి రైతులనుండి ఆపన్ను వసూలుచేస్తూవచ్చారు. దీనిపై రైతుల తీవ్రాందోళన ఫలితంగా 1358 ఫసలీ (1948) లో హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ క్రింది రెవెన్యూ ఉద్యోగులందరికీ పోరంబోకు, గైరాన్, ఖారిజ్ కాతాభూము లలో బంచరాయిపన్ను వసూలుచేయరాదని వుత్తరువుపంపింది.

అయితే ప్రభుత్వానికు చెందిన అన్ రిజర్వులలో అనగా రమనాభూములలో పచ్చికను అరాజు గావించేపద్ధతి మెప్పటి మాదిరే కొనసాగుతుంది. అదేవిధంగా రిజర్వు అడవులలో జంగ్లాతువాండ్లు పశువులు మేపుకోనేందుకు పుల్లరి రేట్లు వసూలు చేస్తూ వుంటారు.

"శిస్తు రెమిషనులు":—

గ్రామాల్లో శిస్తు రిమిషన్ (మాఫీ) ఇవ్వవలసిన పరిస్థి తులు ఏర్పడినప్పుడు, ఈ విధంగా దొరికే రిమిషనులలో అత్య ధికబాగాన్ని అనుభవించే భూస్వాములు, ఈ పేరుతో నాలుగు డబ్బులు సంపాదించుకోడానికి తయారయ్యే పైరవీకారులు,

కొంతభాగాన్ని కాజేయడానికి ప్రయత్నించే పటేలు, పట్వారీలు పోరవతీసుకోవడం జరుగుతున్నది. ఒకవిశాలప్రాంతంలో ఇలాంటి పరిస్థితు లేర్పడినప్పుడుమాత్రమే ప్రజాసంఘాలు కొంతవరకు కదిలి ఆందోళనచేయడం జరుగుతున్నది. దీనివలన, రిమిషనులన్నీ, ఈ ప్రజావ్యతిరేకుల దయాదాక్షిణ్యాలకు వదిలి వేయబడుతున్నవి. అంతేగాక, ప్రభుత్వం ప్రజాందోళనకు తట్టుకోలేక శిస్తులను, లేక వాటిలో కొంతభాగాన్ని బరాయిందా పెట్టడంతో, ఆందోళన చల్లారిపోతున్నది. రైతులు ఏదో విధంగా గండం కొంతవరకైనా కడతేరింది గదాయని, యీ బరాయిందాలతోనే సంతృప్తిపడుతున్నారు. కొన్నిసార్లు ఈ బరాయిందాలనే, మాఫీలని పొరబడి, తీరా మరుసటిసంవత్సరం శిస్తువసూళ్ళకు పూనుకునేసరికి, వాటిని చెల్లించలేక అప్పుల పాలై కృంగిపోతున్నారు.

రెమిషను లిప్పించడంలోనూ, వాటిని అమలు జరిపించటంలోనూ ప్రజా వ్యతిరేకులచేతికి చొరవను పోలిస్తే, వారికిన రెమిషనులో కొంతభాగాన్ని—తరచుగాసగభాగంవరకువారు కాజేస్తూఉంటారు. రైతులు, శిస్తులో ఎంతతగ్గినా తగ్గినట్లేనని, మిగిలినదానితోనే సంతృప్తిపడుతున్నారు. దీనికిబదులుగా ఆది నుంచీ చివరిదాక రైతుసంఘాలే చొరవతో పనిచేస్తే, రిమిషనులను సాధించడమేగాక, అమలుజరిపించడంగూడా జరిగి, రైతాంగానికి దీనివలన పూర్తిగా లాభపడుతుంది. ఒకసారి శిస్తులను బరాయిందా పెట్టడానికి ప్రభుత్వమంగీకరిస్తే, దానిని మాఫీ

చేయించడానికి కనీసం, భూస్వాములను మినహాయించి, తక్కిన రైతాంగానికైనా ఎడతెగనికృషి చేయడంకూడా అవుసరం.

చట్టాలప్రకారం, శిస్తురెమిషనులకున్న అవకాశం చాల తక్కువ. కనుక రెమిషనులు దొరికేది ప్రజాందోళనమీద ఆధారపడివుంటుంది. కనుక, ఒకవైపున చట్టరీత్యా జరుపవలసిన వ్యవహారకాండను జరుపుతూనే, పెద్దఎత్తున ప్రజాందోళనను గూడా పూనుకోవడం అవుసరం.

ఇంతకుపూర్వం నీటివనరులోకి ముఖ్యకార్తెలోని చివర రోజున నీరువచ్చినా, ఆబినీస్తు పూర్తిగా వసూలుచేయడం జరిగేది; రిమిషను ఇవ్వడం జరుగకపోయేది. ఈ విధంగావచ్చిన నీరుతో నారుపోసి, నాట్లువేస్తే, పంటపండేది చాలా స్వల్పం. కనుక రైతాంగం చాలా నష్టపడుతూవచ్చింది. ఆంధ్రమహాసభ దీనికి వ్యతిరేకంగా తీవ్రమైన ఆందోళన చేసినను ఫలితంగా 22—8—49 నాడు, ఆశ్లేషను చివరికార్తెగా నిర్ణయిస్తూ, ప్రభుత్వం ఆర్డరు జారీచేయడం జరిగింది.

## —♦ శిస్తు రిమీషన్లు – వాటినియిచ్చే విధానం. ♦—

(అ) (i) ఖుష్కీభూములలో పంటలు ఏవో మానవాతీతమైన కారణాలవలన అనగా విపరీతమైన రాళ్లవానకొట్టో, వరదలుపారో యింకా ఇదేవిధమైన ప్రకృతికి సంబంధించిన అవాంతరాలు వచ్చినప్పుడుతప్ప, సాధారణ పరిస్థితులలో

పంటలు పండకపోయినా రిమీషను ఇవ్వబడదు. పైన తెల్పిన అసాధారణ పరిస్థితులలో సంఘటన జరిగినవెంటనే పట్వారీ తహశీలుదారుకు మరియు డిప్యూటీకలెక్టరుకు (దువ్వం తాలూకాదారుకు) పైర్ల నష్టాలగూర్చి రిపోర్టుపంపాలి. ఆ రిపోర్టును ఆధారంగాగాని తహశీలుదారుగాని లేక దువ్వం తాలూకాదారుగాని నష్టపడిన పైర్లగూర్చి పంచనామా చేయడానికి రావాలి. పంచనామా రిపోర్టును తాలూకాదారుకు వెంటనే వారు పంపాలి. ఆ పంచనామా రిపోర్టునునమ్మి తాలూకాదారు రిమీషను ఇవ్వవచ్చు; లేదా ఇవ్వకపోవచ్చు. అదంతా తాలూకాదారు నిర్ణయంపై ఆధారపడి ఉంటుంది.

(ii) ఆయకట్టులో చేరిన అంటే ప్రభుత్వపు నీటిసప్లయి ద్వారా సాగుఅయ్యే తరిభూములను నీటిసప్లయి సక్రమముగా వున్నప్పుడుగూడ సాగుచేయకుండా పడావుపెట్టితే రిమీషను కోరే హక్కు ఉండదు. అలాగాకుండా యీ క్రింద పేర్కొన్న కారణాలవలన సాగు కాకపోతే రిమీషనుకోరేహక్కు వుంది. ఆశ్లేషకార్తెవరకు నీటివనరులోకి నీరు రానప్పుడు, ఆబీశిస్తు రెమిషన్ ఇవ్వబడుతుంది.

—ప్రభుత్వం నీటిపారుదల వనరుకు అసలు నీరు రాకపోయి సాగు కానప్పుడు,

—అధిక వర్షాలవలన నీరు ఎక్కువఅయి సాగు చేయడమే సాధ్యం కానప్పుడు,

—ఆబీ, తాబీ కారులలో ఏకారుగూడ సాగు చేయడానికి భూమిసాగు లాయకుగా లేనప్పుడు,

—సాగునీరు చెరువులో అత్యధికంగావుండి అసలు పంటకా ల్వాల తూములే తెరవడానికి సాధ్యముకానంత లోతుగా నీరు వున్నప్పుడు,

—పైన తెల్పిన మానవాతీతమైన ప్రకృతి ఇబ్బందులు కల్గి నప్పుడు,

తప్పక రిమీషన్ ఇవ్వాల్సివుంటుంది. అంటే పూర్తి తరిశిస్తు రేటు వసూలుచేయరాదు. ఖుష్కి రేటుమాత్రమే వసూలు చేయాలి.

(iii) ప్రభుత్వ నీటిసప్లయిద్వారా సాగుఅయ్యే తరిభూ ములలో ఏనెంబరు లేక ఆ నెంబరులోనిభాగం (పోటునెంబరు) కు చెందిన భూమి పైనతెల్పిన కారణాలవలన సాగు అవకుండా పడావుగా వున్నప్పుడు, ఆ గ్రామ పట్వారీ మరియు గిర్దావరు రిపోర్టుపైనగాని లేక అట్టిసాగుకానట్టి భూముల యజమాని రిమీషన్ కోసం తహశీలుదారుకు దరఖాస్తు పెట్టుకోవడం జరి గినప్పుడుగాని రిమీషన్ ఇవ్వబడాలి. అలాఇచ్చే రిమీషన్‌ను "కమీ ఏక్ సాలా" క్రింద ఇవ్వబడిన రిమీషన్ అంటారు.

(iv) నీటిసప్లయి సక్రమముగా లేకపోయి తరిపంట నష్ట మైపోయినప్పుడు యీ క్రింద చెప్పబడిన ప్రకారం రిమీషను ఇవ్వాల్సివుంటుంది.

—దో అణాపంటకు తక్కువ పండినప్పుడు పూర్తి రిమీషను ఇవ్వాలి.

—దో అణాకు మించి చాక్ అణాకంటే అధికంగా పంట పండి నప్పుడు శిస్తులో ⅔ వంతు రిమిషన్ ఇవ్వాలి.

—చాక్ అణాకంటె పంట అధికంగా వున్నప్పుడు రిమిషన్ ఇవ్వబడదు.

పంటను అంచనా వేసేప్పుడు వరిగడ్డి విలువను గణన లోకి తీసుకోరాదు. ప్రభుత్వ నీటిసప్లయి ద్వారా సాగుఅయ్యే వరి, చెరుకు, తమలపాకు మున్నగు యితర తోటపైర్లు అన్నిటి సందర్భంలో పైనతెల్పిన నిబంధనలు వర్తించుతాయి.

(ఆ)శిస్తురిమిషన్లకోసం దరఖాస్తుచేసుకొనేవిధానం:- శిస్తు రిమిషనులకై దరఖాస్తులన్నీ తహశీలుదారుకుగాని లేక నాయబ్ తహశీలుదారుకుగాని పెట్టుకోవాలి. స్టాంపుబిళ్లలు అతికించనవసరంలేదు. ఉత్త తెల్లకాగితంపై వ్రాతపూర్వకమైన దరఖాస్తు ఇచ్చుకోవాలి. ఆబీపంట విషయంలో అయితే దర ఖాస్తును నవంబరు 22 వ తేదీ లోపలనూ, తాబిపంట విష యంలో అయితే ఏప్రియల్ 15 వ తేదీ లోపలనూ పెట్టుకో వాలి. ఆ తేదీలు దాటితే రిమిషను దరఖాస్తులు తీసుకోబడవు.

చెరుకుపంట సందర్భంలో మరోపద్ధతి అనుసరించాలి. చెరుకుమొక్క మొలవకుండానే పైరు నష్టపడిపోతే జూన్ నెలా ఖరులోగా దరఖాస్తు పెట్టుకోవాలి. చెరుకుమొక్క మొలిచాక పంట నష్టమైపోతే నవంబరు 15 వ తేదీలోపల పెట్టుకోవాలి. అయితే కొన్ని ప్రత్యేకసందర్భాలలో నవంబరు 15 నుండి

డిశెంబరు 30 వ తేదీవరకు దరఖాస్తులు పెట్టుకోవచ్చును. (తహశీలుదారు అనుమతిపై.)

రైతుకు చదువురాని సందర్భంలో పట్వారీ దరఖాస్తును వ్రాసిపెట్టాలి. అందుకు అదనంగా ఏమీ రైతునుండి వసూలు చేయరాదు.

పైనతెల్పినవిధంగా శిస్తు రిమీషన్ కోసం పెట్టుకోబడిన దరఖాస్తులను విచారించేందుకు దరఖాస్తులు చేరినవెంటనే తహశీలుదారుగాని లేక నయబ్ తహశీలుదారుగాని వాటిని గిర్దావారుకు పంపుతూ, తక్షణం నష్టపడిన పొలాలను పంచనామా గావించేందుకు ఉత్తర్వులు జారీచేయాలి. గిర్దావారు బాగా వ్యవసాయపరిస్థితులు తెలిసిన పంచలయెదుట పంటను అంచనా వేస్తాడు. ఆ అంచనా రిపోర్టును తక్షణమే తహశీలుకుపంపాలి. గిర్దావారు గావించిన పరిశీలనేగాకుండా నాయబ్ తహశీలుదారు హోదాకు తక్కువగాని రెవెన్యూఉద్యోగి మరొకరు రిమీషన్ దరఖాస్తు అందిన 15 రోజులలోపల స్వయంగా వచ్చి నష్టపడిన పంటలను తనిఖీచేయాలి.

పైవిధంగా తనిఖీఅయ్యేంతవరకు ముఖ్యంగా గిర్దావారు తనిఖీ పూర్తి అయ్యేంతవరకూ రైతులు తమ పైరులను కోయకుండా అట్టిపెట్టాలి. అలాగాకుండా గిర్దావారు తనిఖీలోపలనే పైరులు కోసివేసినట్లయిన అట్టి పైరులసందర్భంలో రిమీషన్ కోరడానికి హక్కుపోతుంది.

గిర్దావారు పంచనామా రిపోర్టు, నాయబ్ తహశీలుదా రుగాని లేక ఆ హోదాలోవున్న మరొక రెవెన్యూ ఉద్యోగి రిపోర్టు చేరాక తహశీలుదారు వాటిపై తన అభిప్రాయాన్ని వ్రాసి దువ్వాం తాలూకాదారుకు పంపుతాడు. ఈ రిపోర్టుల నాధారంగాగాని రిమీషను ఇవ్వవలసిన సందర్భాలలో రిమీ షను యిస్తూ జమాబందిలో ఆఖరి ఉత్తర్వులు జారీ చేయబడు తాయి. ఇలా ఇవ్వబడే రిమీషన్‌ను "మాఫీ పక్ సాలా" అంటారు.

రిమీషన్ ఇచ్చేందుకు పైన తెల్పిన క్రమమంతా చూస్తే ఆచరణలో రైతులకు లంచగొండి ఉద్యోగులు బాగా అన్యా యంచేయడానికి ఎంతో అవకాశంవుంది. అసలు రిమీషను యిచ్చే నిబంధనలే కఠినంగా వున్నాయి. అందులోనూ వాటిని ఆచరణలో నిరంకుశ, లంచగొండి ఉద్యోగస్థులు అమలుజరపరు. అందుచేత పైనతెల్పిన రిమీషను నిబంధనలు అయినా అమలు జరిగేట్లు రైతువర్కర్లు కృషి చేయాలి. లేని హక్కులకోసం ఆందోళన గావించుతూ వున్న హక్కులను అమలుజరుపు కొంటూ వుండాలి.

## —♦ భూమిశిస్తు వసూలుకు కిస్తీలు. ♦—

హాల్‌సాల్ భూమిశిస్తు వసూలుకు ప్రభుత్వం ఈ క్రింది విధంగా నాలుగు కిస్తీలను నిర్ణయించింది. ఈ కిస్తీల ఆఖరి తేదీ లోపల ఆ కిస్తీకి యివ్వవలసిన శిస్తుమొత్తాన్ని చెల్లించాల్సి

వుంటుంది. అలా యివ్వకపోతే శిస్తు బకాయికింద పరిగణించి బకాయి వసూలుగావించేపద్ధతి అనుసరించుతారు.

<u>కిస్తీలు:—</u>

(అ) ఖుష్కి— మొదటిపైరు లేక పునాస:- ఈ పైరుకు చెల్లించాల్సిన శిస్తును ప్రతిసంవత్సరం జనవరి ఒకటవ తేదీనుండి జనవరి 21 వ తేదీవరకు వసూలుచేస్తారు. ఈ కిస్తీకి కట్టాల్సిన ఆఖరు తేదీ <u>జనవరి 21 వ తేదీ.</u>

(ఆ) ఆబీపంట లేక మొదటికారు తరి:— ఈ పంటకు గూడ పైనతెల్పిన తేదీలలోనే శిస్తు వసూలుగావిస్తారు.

(ఇ) రబ్బీపంట లేక మాగీపంట:- ఈ పంటకు ఏప్రియల్ 1 వ తేదీనుండి ఏప్రియల్ 21 వ తేదీవరకు శిస్తు వసూలు చేస్తారు. ఆఖరుకు చెల్లించాల్సిన తేదీ ఏప్రియల్ 21 వ తేదీ.

(ఈ) తాబీ లేక వేసంగికారు - ఈ పంటకు చెల్లించాల్సిన శిస్తును జూన్ 16 వ తేదీనుండి జూన్ 30 వ తేదీలోపల చెల్లించాలి.

ఈ నాలుగుకిస్తీలలో మొత్తం సంవత్సరంలో రైతులు చెల్లించాల్సిన భూమిశిస్తు, నీటితీరువ అంతా చెల్లించాల్సి వుంటుంది.

## —♦ జమాబంది. ♦—

సంస్థానంలో భూమిశిస్తువిధానం, ప్రభుత్వ ఖజానాకు ఆదాయాన్ని బాగా హెచ్చించేఉద్దేశ్యంతో నిర్ణయించబడింది. ముఖ్యంగా తెలంగాణలో. తరీశిస్తు రేట్లను నిర్ణయించడంలో రైతులు చీటికిమాటికి పన్నులు చెల్లించవలసివచ్చేట్లు చేయడం జరిగింది. దీనివలన పటేలు పట్వారీలు, రెవెన్యూ ఉద్యోగులు, రైతులను నానాబాధలుపెట్టి. లంచాలు వసూలు చేసుకోడానికి, మామూళ్ళను సంపాదించుకోడానికి అవకాశాలేర్పడినవి. ఈ మామూళ్లు, లంచాలు, క్రిందివిధంగా ఉన్నవి.

1. ఖర్చులు:— పటేలు పట్వారీలు, ప్రతిరైతునుంచి రూపాయికొక అణానుంచి 8 అణాలవరకు వసూలుచేస్తూ ఉంటాడు. ఈ విధంగావచ్చిన మొత్తాన్ని మాలీపటేలు, పట్వారీలు, రెవెన్యూ ఇన్స్పెక్టర్లు (గిర్దావర్లు) తహశ్శీలు ఆఫీసుల్లోని క్లర్కులు, ఇతర ఉద్యోగులంతా ఒక నిర్ణీతమైన రేటుప్రకారంగా పంచుకుంటారు. వీటినే "ఖర్చులు" అనేపేరుతో వసూలుచేస్తూఉంటారు. వీటిని చెల్లించుకోవడంవలన రైతులకు అదనంగా చేకూరే సౌకర్యాలేమీలేవు. పటేలు పట్వారీలు, రెవెన్యూఉద్యోగుల ఆగ్రహానికి పాత్రులుగాకుండా ఉండటానికే ఈ మామూళ్లు.

పటేలు పట్వారీలు ఈ లంచాలను పై ఉద్యోగులకు కూడా పంచిఇవ్వడంవలన, రెవెన్యూఇన్స్పెక్టర్లు ప్రత్యేకంగా

రైతుల భూముల్లోకి వెళ్ళి, సాగుకు సంబంధించిన హెచ్చుతగ్గులనుపరిశీలించకనే, వారు రికార్డులో నమోదుచేసింది, చేసినట్టుగానే, 'సరిగాఉంద' ని రాసివేయడం, పై అధికారులుకూడా గుర్తించడం,జరుగుతూఉంటుంది. ఈవిధంగా రైతులపైవిధించే శిస్తుఅంతా పటేలు పట్వారీల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉంటుంది.

2. రెమిషనులను ఇప్పించడానికీ, చట్టానికి వ్యతిరేకంగా సాగుచేసిన భూమిపై తావానులను మాఫీచేయించడానికి, లేక తగ్గించడానికి ప్రత్యేకంగా లంచాలు రాబట్టుతారు పటేలు పట్వారీలు. వీటిలోకూడా రెవెన్యూఉద్యోగులకు— ముఖ్యంగా రెవెన్యూ ఇన్స్పెక్టరులకు భాగంఉంటుంది. ఈ పన్నులుగూడా జమాబందీలో విధించబడేవే.

3. రైతు చనిపోతే, అతని పట్టాభూమి, వారసులపేర పట్టాకావడం, అమ్మకం, కొనడం మొదలగు పట్టామార్పులు జమాబందిలోనే జరుగుతూఉంటాయి. వీటి కొరకు గూడా పటేలుపట్వారీలు వందలరూపాయీల లంచాలు తీసుకుంటారు.

రైతులు మొదటినుంచి జాగ్రత్తగాఉంటూ,- పటేలు పట్వారీలు తప్పురాతలు రాయకుండా చూమకోడానికి, జాగ్రత్తలు పడడానికి, జమాబందికి ముందుగానే పై అధికారులదృష్టికి తెచ్చి, తమపై అదనపుశిస్తులు— వీటినే దండుగలని అంటారు. పడకుండా చేసుకోడానికి అవకాశం లేకుండేది. దీనిఫలితంగా, జమాబందిలో అదనపుశిస్తులు నిర్ణయింపబడి, చివరికిస్థిరమైన అయిన

తాబీకిస్తీలు, మామూలు శిస్తుతోబాటు అదనపుశిస్తుకూడా
చెల్లించవలసి వచ్చేవరకు రైతులు వాటిని చెల్లించలేక, ఇల్లు
వాకిలిని, గొడ్డు గోదలను, తట్టి చెంబులను అమ్ముకొని చెల్లించ
వలసి వస్తూఉండేది. తాబీకిస్తీ సమయం. పంటలసమయంగాక
తినడానికి తిండిదొరకని వేసవికాలపు చివరిరోజులు.

ఆంధ్రమహాసభ జమాబందిలో జరిగే అన్యాయాలకు,
లంచాలకు వ్యతిరేకంగా ఆందోళన సాగించింది. దీనిఫలితంగా,
పోలీసుచర్యతర్వాత, జమాబందిచేసేవిధానంలో కొన్నిమార్పు
లను ప్రభుత్వం ప్రకటించింది. వాటిఫలితంగా రైతులు పటేలు
పట్వారీలు, రెవెన్యూ ఇన్స్పెక్టర్లను కాదనికూడా, జమాబం
దికిపూర్వమే నేరుగా తహశీలుదారుదగ్గరికి చేరుకొని తమకు
అన్యాయం జరుగకుండా చూచుకోవచ్చును. దీని కార్యవిధానం
ఇచ్చట వివరించబడుతున్నది.

ప్రతిసంవత్సరం చెల్లించాల్సిన భూమిశిస్తు మొత్తాన్ని
తేల్చడానికి జమాబంది రెవెన్యూ ఉద్యోగులచేత జరుపబడు
తుంది. బందోబస్తుద్వారా ఏగ్రామము కాగ్రామము చెల్లించా
ల్సినభూమిశిస్తు మొత్తాన్ని తేల్చినప్పటికీ ప్రతిసంవత్సరం సాగు
భూమి విస్తీర్ణంలో కలుగుతూఉండే కమ్మీ, జాస్తీలనుబట్టి శిస్తు
మొత్తం తగ్గడం, హెచ్చడం జరుగుతూఉంటుంది. అంతేగా
కుండా పంట నష్టపోతే రిమీషన్లుగూర్చి, అనుమతి లేకుండా
సాగుచేస్తే తావాన్లుగూర్చి తేల్చవలసి ఉంటుంది. ఈ విధంగా
ప్రతిసంవత్సరం ప్రతిపట్టాదారు ఆఖరుకు చెల్లించాల్సిన భూమి

శిస్తు మొత్తాన్ని తేల్చవలసివుంటుంది. ఇందుకోసం తహశీలు దారు లేక దువ్వం తాలూకాదారు లేక తాలూకాదారు సంద ర్భానుసారంగా "జమాబంది" జరుపుతూవుంటారు.

తెలంగాణాలో తహశీలుదార్లు జరిపే ప్రాథమిక జమా బంది మార్చి నెలాఖరులోపలనూ, నాజిమ్ జమాబంది (అంటే మొదటి తాలూకాదారు లేక రెండో తాలూకాదారు) జరిపే ఆఖరి జమాబంది మే మాసాంతంకు జరపబడాలి.

తహశీలుదారు జరిపే ప్రాథమిక జమాబందియే ముఖ్య మైనది. ఇందులోనే రైతులకు అన్యాయాలు జరుగకుండా చూసుకోవాలి.

తహశీలుదారు తన తాలూకాను నాలుగు, మూడు సెంటర్లుగా విభజించి ఏయే సెంటరులో ఎప్పుడెప్పుడు జమా బంది జరిపేది నిర్ణయించి, ఆయా సెంటర్లకు చెందిన గ్రామాలకు ముందు తెల్పవలసివుంది. కాని సాధారణంగా పటేలు పట్వా రీలకుమాత్రం తెల్పడం జరుగుతోందిగాని, గ్రామస్థులందరికీ తెల్పబడడం లేదు. ఈ విషయంలో రైతువర్కర్లు ముందుగా జాగ్రత్త పడాలి.

తహశీలుదారు జరిపే ప్రాథమిక జమాబందిలో యీ క్రింది విషయాలగూర్చి చర్చించబడుతాయి.

(i) పట్వారీ తయారుగావించిన సాగుబడిలెక్కల వివ రాలు (దీనినే 'పహాని' అంటారు). ఇందులో నమోదుగాబడి

న్లు వాస్తవంగా సాగు అయిందీ లేనిదీ పరిశీలిస్తారు. ఏమైనా హెచ్చుతగ్గులు వుంటే మార్పులుచేస్తారు. అందుచేత పట్టాదారికి లంచాలుయివ్వని కారణంవలననో లేక మరేకారణంవలననో సరిగా సాగుబడిలెక్కలను నమోదుచేయకుండావుంటే వాటిని జమాబందిలో సరిచేయించుకొని ఆ ప్రకారం శిస్తుమొత్తాన్ని తేల్చుకోవాలి.

(ii) రిమిషన్ దరఖాస్తులు ఏమైనావుంటే వాటిని కూర్చి సక్రమముగా తహశీలుదారు తాలూకాదారుకు రిపోర్టుపంపేట్లు చూచుకోవాలి.

(iii) అనుమతిలేని సాగుచేయడంవలనగాని లేక అను మతిలేకుండా ప్రభుత్వంభూమిని ఆక్రమించడం వలనగాని లేక మరేకారణంగాగాని తావాను విధించబడినట్లయిన, తావానును సాధ్యమైనంత తక్కువ చేయించుకొనేందుకు కృషిగావించాలి. సాధారణంగా మామూలుశిస్తు రేటును రెట్టింపుకంటే అధికంగా తావాను విధించకుండా ప్రయత్నించుకోవచ్చును.

(iv) లావునీ సాగుపైయిచ్చిన భూములకు పట్టాలు మం జూరిచేసుకొనే విషయంగూడ జమాబందిలో వస్తుంది. అందు చేత సాధ్యమైనంతవరకు జమాబందికాలంలో అలా పట్టాలు పొందేందుకు వుత్తర్వులను సంపాదించేందుకు కృషిచేసుకోవాలి.

(v) బందోబస్తు లెక్కలలో ఏమైనా పొరపాట్లువుంటే వాటిని సరిచేసుకొనేందుకు జమాబందికాలంలో దరఖాస్తులు

యివ్వవచ్చును. అదేవిధంగా పట్టామార్పిళ్ళగూర్చి, జాయింటు విడగొట్టించుకొనేందుకుగూడ దరఖాస్తులు ఇవ్వవచ్చును.

(vi) రక్షితకౌలుదారు ఫారాలు యిప్పించమనీ, తదితర కౌలుదారు హక్కుల నమోదుచేయమనీ తహశీలుదారుకు దరఖాస్థులు జమాబందికాలంలో యిచ్చుకోవచ్చును.

(vii) చిన్నచిన్న జలాధారాలను పరీక్షించి మరమ్మతులకు వుత్తర్వులివ్వవలసిందిగా దరఖాస్థులు యివ్వవచ్చును. ఆ దరఖాస్థులను పరిశీలించే జమాబంది కాలంలోనే వాటిపై వుత్తర్వులు తహశీలుదారు జారీచేయువచ్చును.

అదేవిధంగా ప్రభుత్వ అవసరాలకుగాను రైతులనుండి ఎంకై ్వరీగావించిన (కొన్నట్టి) భూముల సందర్భంలోవున్న సమస్యలన్నింటినీ జమాబందికాలంలో పరిష్కరించుకోవచ్చును.

(viii) పట్వారీలు శిస్తువసూలులో డబ్బుతీసుకుని అసలు రశీదులు యివ్వకపోతేగాని లేక కొంత మొత్తానికిచ్చి కొంత మొత్తానికి రశీదులు ఇవ్వకుంటేగాని అట్టి అక్రమాలను తొలగించమనీ, చెల్లించినంతవరకు పూర్తి రశీదులు యిప్పించమని అడగడానికి రైతులకు హక్కువుంది.

(ix) పైన తెల్పిన విషయాలనేగాకుండా జమాబందికాలంలో తహశీలుదారు రైతులు విన్నవించుకొనే యితరవిషయాలగూర్చిగూడ వినాల్సివుంటుంది. జమాబందిజరిగేకాలంలో

ప్రతిరోజు రైతుల కష్టసుఖాలగూర్చి నోటిమాటద్వారా చెప్పు కొనేందుకు, వ్రాతపూర్వకంగా ప్రత్యేకవిషయాలపై యిచ్చే అర్జీలు తీసుకొనేందుకు కొంతకాలం వినియోగించాలి. అంతే గాకుండా ఏ సెంటరులో జమాబంది జరుగుతూవుంటుందో ఆ సెంటరుకుచెందిన కొన్ని గ్రామాలలో నిలుపుమీదవున్న పం టలపరిస్థితిగూర్చి, మహాసూలుగావించిన పంటలగూర్చి స్వయ ముగా పరిశీలించి, యితరులను విచారించి తెలుసుకోవాలి.

శివాయి జమాబందికి సంబంధించిన దరఖాస్తులు. ఆరాత్రి జులుగూడ జమాబందికాలంలో విచారింపబడుతాయి. అదేవి ధంగా గడ్డిపాటలు, చాపలపాటలు, పండ్లవృక్షాల ఫలసాయా న్నిగూర్చిన వేలంపాటలు, వీటన్నిటిగూర్చికూడ విచారణకు తేవచ్చును.

ఈ విధంగా జమాబందికాలంలో పైనతెల్పిన విషయా లన్నింటిగూర్చి తహశీలుదారు సక్రమముగా విచారించేందుకు రైతువర్కర్లు కృషిచేయాలి. జమాబంది విచారణకు రైతులను గుంపులు గుంపులుగా వారివారి ప్రత్యేక సమస్యలపై రాయ బారం తీసుకువెళ్ళాలి. జమాబంది విచారణలో రైతువర్కర్లు స్వయంగా పాల్గొనేందుకు ప్రూనుకోవాలి. అందుకు అవకాశం యివ్వాలని జమాబంది ప్రారంభం కాకమునుపే తహశీలుదా రుపై ప్రజావత్తిడి తీసుకురావాలి. ఈ విదంగా జమాబందిలో పాల్గొని గ్రామ పటేలు పట్వారీలు రైతులకు చట్టవిరుద్ధంగా గావించే అనేక అక్రమాలను తొలగించాల్సివుంది.

ప్రతిసంవత్సరం మార్చి నెలాఖరులోగా తహశీలుదార్లు పైన తెల్పిన విధంగా జరుపబడే జమాబందీలు సక్రమముగా జరుపబడినవా లేదా అని మరల తాలూకాదారు మే మాసాంతం లోపల ఆఖరిజమాబంది జరుపుతాడు. ఆ జమాబందిలో ప్రధానంగా తహశీలుదారు ప్రాథమిక జమాబందిజరిపి పంపిన రిపోర్టులను ఆధారంగాగొని తిరిగి విచారణ జరుపబడుతుంది. సాధారణంగా తహశీలుదారు పంపిన జమాబంది రిపోర్టును తాలూకాదారు పెద్ద విచారణ లేకుండానే అంగీకరిస్తాడు. అవసరమనుకున్న మార్పులను చేయడానికీ లేక పూర్తిగామార్చి నూతన రిపోర్టు తయారుచేయడానికి తాలూకాదారుకు అధికారంవుంటుంది. అందుచేత తహశీలుదారుగావించే ప్రాథమిక జమాబందిలో అన్యాయాలు జరుపబడినట్లయిన తాలూకాదారు జరిపే ఆఖరి జమాబందిలో అట్టి అన్యాయాలను తొలగించుకోడానికి ఆందోళన గావించుకోవచ్చు.

తాలూకాదారు గావించే ఆఖరుజమాబంది రిపోర్టును రెవెన్యూబోర్డుకు తాలూకాదారు పంపుతాడు. రెవెన్యూబోర్డు తాలూకాదారు గావించే జమాబంది నిర్ణయాలను రెవెన్యూబోర్డు, తను అవసరమనుకున్న మార్పులను గావించవచ్చు. రెవెన్యూబోర్డు నిర్ణయాలే అంత్యనిర్ణయాలు.

తాలూకాదారుగావించే ఆఖరుజమాబందిలో రైతులు తమకు అన్యాయమైన నిర్ణయాలు జరిగినవని భావించితే వాటిని అమలు జరుపకుండా ముందు రెవెన్యూబోర్డునుండి 'స్టే ఆర్డరు'

తెచ్చుకోవాలి. అట్టి అన్యాయపు నిర్ణయాలను రద్దుచేయమంటూ రెవెన్యూ బోర్డుకు అప్పీలు చేసుకోవచ్చుకూడ.

జమాబంది జరిగేపద్ధతి యిది.

## ఆయకట్టు నిర్ధారణ.

(i) ఆయకట్టు నిర్ణయించడమంటే ప్రభుత్వం నీటిపారుదల వనరులవలన సప్లయిగాబడే నీటివలన సాగుఅయ్యే భూమి యింత అని నిర్ధారణచేయడం. ఉదాహరణకు ఏదైనా ఖుష్కీభూమి ఆయకట్టులో చేర్చబడిందంటె అర్థం ఆ ఖుష్కీ భూమికి యికముందునుండి ప్రభుత్వ నీటిసప్లయి వుంటుందన్న మాట. అందుకోసం తరిరేటు విధించబడుతుందన్నమాట.

తెలంగాణా జిల్లాలలో, తరచుగా చెరువులకింద, బందోబస్తులో నిర్ణయించబడినప్రకారం, ఆయకట్టులోవుండే భూమి అంతా తరీసాగు కావడంలేదు. చెరువు లోదట్టులు పూడిపోవడంవలన చెరువులను మరామతుచేసే సందర్భంలో వత్తడి ఎత్తును తగ్గించివేయడంవలన, చెరువులోకివచ్చిన నీరులో చాలా భాగం వెళ్ళిపోతున్నది. కొన్ని చెరువుల్లోకి నీటివారువలేక పుష్కరానికొకసారి గూడా నిండడం కష్టమవుతున్నది. ఈ కారణాలవలన, తరచుగా మిట్టపొలాలు, చివరిపొలాలు, సంవత్సరాలతరబడిగా సాగుకాకుండా బీడుపడిఉండడమో లేక ఖుష్కీ పంటలకోసం సాగుచేయడమో జరుగుతున్నది. పటేలు పట్వారీలు ఇలాంటిభూమి రైతాంగంనుంచి లంచాలు గుంజడానికి ఉపయోగించుతూవచ్చారు.

దీనిఫలితంగా 11–10–1949 వ తేదీన హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ ఒక ఉత్తర్వును జారీచేసింది. దాని ప్రకారం 1347 వ ఫసలీ (1937 సం.) తో అంతమయ్యే దశాబ్దంలో వరసగా ఏ నాలుగుసంవత్సరాలైనా తరిసాగు చేయబడివున్న భూములన్నీ ఆయకట్టులో జేర్చబడి వాటికి అవ్విధంగా తరిరేట్లు విధించబడ్డాయి. ఆవిధంగా సాగుచేయబడని భూములు ఆయకట్టునుండి శాశ్వతంగా తొలగించబడి వాటికి ఖుష్కి రేట్లు విధించబడ్డాయి.

ఈ విధంగా ఆయకట్టులో జేర్చనట్టిభూములకు సాధారణంగా నీటిసప్లయి వుండదు. వాటికి ఖుష్కి రేట్లుమాత్రమే వసూలుచేయబడుతాయి. అయితే ఏదైనా అమితవర్షాలు పడ్డ సంవత్సరం చెరువులు, కుంటలలో అమితమైననీరు నిల్చిపోయినప్పుడు ఆయకట్టులో లేని ఖుష్కిభూములనుగూడ తరిసాగుచేయవచ్చు. అయితే యిందుకు ప్రత్యేక అనుమతిని పొందాల్సివుంటుంది. ఖుష్కి రేటుకు, తరి రేటుకు మధ్యవున్న తేడామొత్తాన్ని గూడ ముందుగా డిపాజిట్ చేయాల్సి వుంటుంది.

అయితే యీ సౌకర్యం చిన్న ప్రాజెక్టులక్రిందమాత్రమే కలుగజేయబడుతుంది. పెద్ద ప్రాజెక్టులక్రింద అలా సాగుచేయడానికి వీలులేదు.

## (ii) "తాహిబంది" పద్ధతి (తాబీకారుకు నీరుపంచేపద్ధతి.)

సర్వసామాన్యంగా ప్రతి జలాధారంక్రింద ఉన్న ఆయకట్టులో ఏక్‌ఫసలా, దుఫసలా అనే రెండురకాల తరీభూము

లుంటాయి. ఎక్ ఫసలా తరీనెంబర్లు, ఆబీలో సాగుచేయవలసి వుంటుంది. దుఫసలా తరీనెంబర్లు తాబీలో కూడా సాగుచేయ వలసి ఉంటుంది. కాని, జలాధారంలో నీరు కొరతపడి ఉన్న ప్పుడు, ద ఫసలాసాగు తరీభూమిఅంతా సాగుచేయడం సాధ్యం కాదుకనుక, నీరుసరిపడువరకే సాగుచేయవలసి వస్తుంది. దీనికై ఏయేపొలాలకు తాబీపంట పండించేందుకు నీరు ఇవ్వాలి అన్న విషయాన్ని ప్రతిసంవత్సరం గిర్దావర్ పర్యవేక్షణక్రింద (తనిఖీ క్రింద) స్థానిక పటేలు, పట్వారీలు ఆ ప్రాంతాలలో వున్న జలాధారాలలోని నీటినిబట్టి నిర్ణయించుతూవుండడం యిటీవల వరకూ జరుగుతూవచ్చింది. ఇలా ప్రతిసంవత్సరం తాబీకారు ఆయకట్టును నిర్ణయించడాన్నే "తాహిబంది" అంటారు. ప్రతి సంవత్సరం సాధారణంగా డిశెంబరు నెలలో జలాధారాలు తనిఖీగావించి వేసంగి ఆయకట్టు నిర్ణయిస్తూ వుండేవారు.

ప్రస్తుతం ఈపద్ధతి మానివేయబడింది. దీనిస్థానే ప్రతి సంవత్సరం ఏయే పొలాలలో వేసంగి పండించడానికి అవకాశం వుందో శాశ్వతంగా నిర్ణయించివేయడం జరిగింది.

కాని ఆచరణలో ఈపద్ధతి భూస్వాములకు ఉపయో గంగాను, రైతాంగానికి నష్టదాయకంగాను, రెవెన్యూ డిపార్టు మెంటు పరిపాలనలో అనవసరమైనచిక్కులు తెచ్చేదిగాను తయా రైంది. భూస్వాముల పొలాలు చెరువుకింద ఎక్కడున్నప్పటికీ, వాటికి నీరుఅందించడానికి ప్రాధాన్యతనిస్తూ రైతుల పొలాలను ఎండబెట్టేవిధంగా లంచగొండి రెవెన్యూ ఇన్స్పెక్టర్లు తైబంది

చేస్తూవచ్చారు. తరచుగా నీటిఅంచనా సరిగావేయలేక నీరు తక్కువై పొలాలు ఎండిపోయి పంటలు నష్టపడడం, రైతులు తప్ప నిసరిగా శిస్తులు చెల్లించవలసి రావడం జరుగుతూ వచ్చింది. రైతాంగం ఈ విధానానికి వ్యతిరేకంగాకూడా ఆందోళన చేసింది. ప్రస్తుతం ఈ పద్ధతి మానివేయబడింది.

1949 వ సంవత్సరంతో అంతమయ్యే దశాబ్దంలో వరుసగా ఏ నాలుగుసంవత్సరాలైనా వేసంగిపంటలు పండించిన పొలాలన్నీ తాబీకారు సాగుచేయడానికి శాశ్వితంగా అనుమతి యివ్వబడ్డ పొలాలుగా పరిగణింపబడాలని 20–7–1950 వ తేదీన హైదరాబాదు ప్రభుత్వం రెవెన్యూశాఖ నిర్ణయించింది. నేడు ఆ వుత్తర్వులే అమలులోవుంది. ఈ ఉత్తర్వుప్రకారం వేసంగి ఆయకట్టులో జేర్చబడిన పొలాలు ఏమైనావుంటే ఇప్పటికీ ఆయకట్టులో జేర్పించుకోవచ్చును.

ఇలా ఆయకట్టులో జేర్చబడిన పొలాలు దోఫసలా తరిభూములుగా పరిగణింపబడుతాయి. వీటికి మామూలు తరి భూములకు చెల్లించే రేటుకు 1½ రెట్లుశిస్తు చెల్లించాలి. అయితే ఎప్పుడైనా జలాధారంలో నీరు కొరతఅయి వేసంగిపైరు పెట్టక పోతే రిమిషన్ ఇవ్వబడుతుంది. ఉదాహరణకు, ఆబీరేటు ఎకరానికి రు 12-0-0 లు వుందనుకోండి. అప్పుడు వేసంగిరేటు ఎకరానికి రు 6-0 0 లు అవుతుంది. అంటే, దోఫసలా తరిరేటు ఆబీ, తాబీ కలిపి మొత్తం ఎకరానికి రు 18/- లు అన్నమాట. నీటికొరతవలన వేసంగికారు సాగుచేయకపోతే వేసంగిరేటు

అయిన రు 6-0-0 లులో సగం అంటే, రు 3-0-0 లు. (ఎకరానికి) రిమిషన్ యివ్వబడుతుంది.

కొన్ని గ్రామాల్లో, చెరువు లోదట్టుభూములు భూస్వాముల పేర పట్టాలుగా ఉన్నాయి. ఇవి చాలా సారవంతమైన భూములుగనుక, ఆబీపంటలు పండగానే, భూస్వాములు నీరు వెళ్ళతీసి, లోదట్లులో సెనగ, ధనియాలు, ఇతరపంటలు పండిస్తారు. నీరు రైతులు వేసంగిపొలాలకు నీరు అవసరమున్నప్పటికీ, ఆ పొలాలకు నీరివ్వాలని నిర్ణయం జరిగినప్పటికీ, ఈ విధంగా నీరు తీసివేయడం జరుగుతుంది. కొన్నిసార్లు, వరిపైరు పొట్టలతో ఉన్నప్పుడుకూడా ఇలాగే జరుగుతుంది. రైతులు, తాబీశిస్తులు చెల్లించుతున్నారుగాబట్టి: ఈనీరును పంటపండించేదాకా అధికారం కలిగిఉంటారు. కనుక దీనిని జరుగకుండా చేయడానికి తహశీల్దారునుంచి ఆర్డర్లు తెచ్చుకోవాలి.

ఇదేవిధంగా, చెరువులలో చేపలుపట్టడానికి హరాజులో పర్మిషన్ తెచ్చి భూస్వాములు, రైతులు పంటలను లెక్కచేయకుండా నీరు తీసివేసే అక్రమాలను ఆపివేయడానికిగూడా పై విధంగా ప్రయత్నించాలి.

పైన తెల్పిన విషయాలన్నీ జాగీరు మున్నగు ఖాల్సాకాని గ్రామాలకుకూడ వర్తించుతాయి. జాగీర్లు రద్దుపర్చడంతోనూ సర్ఫెఖాస్ ప్రాంతాన్ని ఖాల్సాప్రాంతంలో మిళితం చేయడంతోనూ నేడు సంస్థానమంతా ఖాల్సాప్రాంతంగానే పరిగణింప

బడుతోంది. అందుచేత ఖాల్సాప్రాంతానికి వర్తించే నియమాలు, నిబంధనలు, చట్టాలు, తదితరప్రాంతాలకుగూడ వర్తించుతాయి.

శిస్తురేట్లువిధించే మూలసూత్రాలుఒకటైనా అమలులో వున్న రేట్లలోమాత్రం తేడాలున్నాయి. ఖాల్సాప్రాంతంలో వున్న ఖుష్కి, తరి, భాగాతురేట్లకంటే, జాగీరు ప్రాంతాలలో ఆ రేట్లు చాల అధికంగా నేటికీవున్నాయి. అందుచేతనే జాగీర్లు రద్దుగావించినతరువాత, జాగీరుప్రాంతాలలో అమలులోవున్న భూమిశిస్తురేట్లు అన్నీ 1359 ఫసలీ (1949 సం) లో నూటికి 12½ వంతులు అంటే రూపాయికి రెండుఅణాలు తగ్గించబడ్డాయి. అంటే ప్రభుత్వంగూడ జాగీరుప్రాంతాలలో శిస్తురేట్లు ఖాల్సాప్రాంతాలకంటే అధికంగా ఉన్నాయని అంగీకరించక తప్పలేదన్నమాట. అందుచేత పైనతెల్పిన భూమిశిస్తు తగ్గింపు అంటే రూపాయికి రెండుఅణాలు తగ్గింపును అమలు జరిపించుకొంటూ, జాగీరుప్రాంతాల శిస్తురేట్లు కనీసం ఖాల్సాప్రాంతాల శిస్తురేట్లవరకూ తగ్గింపబడాలని తీవ్ర ఆందోళన గావించాలి.

## —♦ ఇతరపన్నులు. ♦—

### (i) వ్యవసాయాదాయపుపన్ను:—

హైదరాబాద్ సంస్థానంలో మొట్టమొదటిపర్యాయంగా వ్యవసాయాదాయపుపన్ను చట్టాన్ని 1950 వ సంవత్సరంలో గావించారు. ఈ చట్టంప్రకారం సంవత్సరానికి రు 10,000/-

లకు మించి నికర వ్యవసాయాదాయం వచ్చేవారిపై అదనంగా ఆదాయపుపన్ను విధించబడుతుంది. అంతకులోపు వ్యవసాయాదాయం వచ్చేవారిపై యీ పన్నువుండదు. ఈ క్రింది రేట్లు ప్రకారం యీ పన్ను వసూలుచేయబడుతుంది.

రు 10,000/- లుగాని, అంతకుమించిగాని నికర వ్యవసాయాదాయం వచ్చినప్పుడు,

మొదటి రు 1500/- లు ఆదాయంపై పన్నువుండదు.
ఆతరువాత రు 3500/- లు ఆదాయంపై రు 1 కి అర్ధణా.
ఆతరువాత రు 5000/- లు ఆదాయంపై రు 1 కి అణా.
ఆతరువాత రు 5000/- లు ఆదాయంపై రు 1 కి 2 అణాలు.
తతిమాభాగానికి రూపాయికి మూడుఅణాలు.

ఈ రేట్లప్రకారం వ్యవసాయాదాయపుపన్ను విధింపబడుతుంది. ఉదాహరణకు, సంవత్సరానికి రు 20,000/- లు నికరాదాయంవచ్చే ఒక భూస్వామిని తీసుకుందాం. అట్టి భూస్వామి ఈ క్రిందివిధంగా వ్యవసాయాదాయపుపన్ను చెల్లించాల్సి వుంటుంది:—

| | |
|---|---|
| మొదటి రు 1500/- లకు | 0-0-0 |
| తరువాత రు 3500/- లకు | 109-6-0 |
| తరువాత రు 5000/- లకు | 312-8-0 |
| తరువాత రు 5000/- లకు | 625-0-0 |
| మిగిలినభాగం అంటే రు 500/- లకు | 937-8-0 |
| మొత్తం | 1984-6-0 |

కాబట్టి ప్రస్తుతం హైదరాబాదులోవున్న వ్యవసాయాదాయపుపన్ను చట్టంప్రకారం సంవత్సరానికి ఇరువదివేలరూపాయిల నికరాదాయం (నికరాదాయం అంటే ఖర్చులన్నీపోను ఏయేఖర్చులు మినహాయించాలో చట్టంలో చెప్పబడివుంది) వచ్చే భూస్వామి రు 2000/- లకు లోపుమాత్రమే ఆదాయపు పన్ను చెల్లించుతున్నాడు. అంటే నికరాదాయంలో నూటికి పదివంతులుకన్నా హెచ్చు చెల్లించడంలేదన్నమాట. దీన్నిబట్టి పెద్దభూస్వాములకు యెవరికీ యీ చట్టం ప్రమాదకరమైనది గాదు. వాళ్లకువచ్చే అమిత ఆదాయాన్ని పెద్దగా ముట్టుకోదు.

ఇలాంటి బూటకపు వ్యవసాయ ఆదాయపుపన్ను కోసం గాదు రైతుసంఘాలు ఆందోళనగావించేది. నేడు ప్రతియకుటా, సెంటూ భూమికిగూడ భూమిశిస్తు వసూలు గావించడంవలన వ్యవసాయఖర్చులు, కుటుంబఖర్చులకుగూడ చాలీచాలని కొద్ది పాటి భూములున్న పేదరైతులకు నేటి పన్నులవిధానం చాల భారవంతంగావుంది. అందుచేత యిట్టి అక్రమపన్నుల విధానం పోయి దీనిస్థానే వ్యవసాయఖర్చులు, కుటుంబఖర్చులు పోను నికర వ్యవసాయాదాయం వచ్చేవారిపైనే ఆదాయపుపన్ను విధించే భూమిశిస్తువిధానం అమలులోకి రావాలని రైతుసంఘాలు ఆందోళన గావిస్తున్నాయి. "పేదరైతులపై పూర్తిగా భూమిశిస్తు తొలగాలి; మధ్యతరగతి రైతుపై చాల స్వల్పంగా వుండాలి. ఆపై తరగతులైన ధనికరైతులు, చిన్న, పెద్ద భూస్వాములపై భూమిపన్నుభారంలో అత్యధికభాగం పడాలి. అందు

లోనుపెద్ద భూస్వాములపై భూమిపన్ను అధికంగా పడాల్సివుం టుంది. ఆ విధంగా భూమిపన్ను భారం పంపిణీఅయ్యేట్లుగా శాస్త్రీయ పద్ధతులపై వ్యవసాయాదాయపుపన్నును ప్రవేశ పెట్టాలి. ఈ ప్రధానసూత్రాన్ని ఆధారంగా వ్యవసాయా దాయపు పన్ను చట్టాన్ని సవరించేందుకు నిర్దిష్టమైన సూచనల తో ఆందోళన లేవదీయాలి.

(ii) అమ్మకపుపన్ను:— హైదరాబాదు సంస్థానంలో ప్రథమపర్యాయంగా యూనియన్ ప్రాంతంలో అమలునం దున్న అమ్మకపుపన్నును 1950లో ప్రవేశపెట్టటం జరిగింది. 1950 ఏప్రిల్‌లో హైదరాబాదు అమ్మకపు పన్ను చట్టాన్ని ప్రభుత్వం ప్రకటించింది. ఈ చట్టంప్రకారం 1950—51 సంవత్స రానికి 1950 మే 1వ తేదీనుండి 1951 మార్చి 31వ తేదీవరకు రు 6875—లకు తక్కువ లేకుండా మొత్తం వ్యాపారం గావించిన ప్రతివర్తకుడూ రూపాయికి రెండుపైసలు చొప్పున అమ్మకపు పన్ను యిచ్చుకోవాలి. ఆ తరువాత సంవత్సరాలలో సంవత్స రానికి రు 7500— లకు తక్కువ లేకుండా వ్యాపారం సాగిస్తుండే ప్రతివర్తకుడూ పైన తెల్పిన రేటుప్రకారం అమ్మకపు పన్ను యిచ్చుకోవాలి. ఇదిగాకుండా కొన్ని ప్రత్యేక వస్తువుల వ్యా పారం సాగిస్తున్నందుకు ఆ వస్తువుల వ్యాపారంకు సంబంధించిన మొత్తానికి రూపాయికి ఆరు పైసలు చొప్పున అమ్మకపు పన్ను చెల్లించాలి.

ప్రభుత్వానికి వర్తకులు చెల్లించే యీ అమ్మకపు పన్నును వర్తకులు వినిమయ దారులనుండి (వస్తువులు కొను

కొన్నే సేవారు) వసూలు చేసుకోడానికి చట్టం అధికారం యి స్తోంది. అందుచేత వాస్తవానికి అమ్మకపుపన్ను అంతా ప్రజల పైన పడేదేగాని వర్తకులపైన పడేదేమీగాదు. పైగా ఆపన్ను పేరుతో అమాయకంగా వున్న ప్రజలనుండి అధికంగా వసూలు గావించి అధికలాభాలు సంపాదించడానికిగూడ యీ చట్టం అవకాశం యిస్తోంది.

ఈ సంవత్సరం గత అసెంబ్లీ సమావేశంలో పైన తెల్పిన చట్టాన్ని కాంగ్రెసు ప్రభుత్వం సవరించింది. రూపాయికి రెండుపైసలనుండి నాలుగుపైసలవరకూ అమ్మకపుపన్నును పెంచింది. అంటే సరిగ్గా అమ్మకపుపన్ను లోగడకంటే రెట్టింపు అయిందన్నమాట. మూలిగేనక్క పై తాటిపండుపడ్డట్లు అసలే ప్రత్యక్ష పరోక్షపన్నుల భారంతో కృంగిపోతున్న పేద గ్రామీణ ప్రజలకు యీ అమ్మకపుపన్ను పెంపుదల చాల నష్ట దాయకమైనది. వర్తకులు, ప్రజలు, మొత్తం సమస్త ప్రజానీకంయొక్క క్రోధాగ్నికి కాంగ్రెసుప్రభుత్వం అమ్మకపుపన్ను పెంపుదలవలన గురిఅయింది. అన్ని పట్టణాలలోనూ యీ పన్ను హెచ్చింపుకు వ్యతిరేకంగా యిటీవల సార్వజనిక హర్తాళ్లు ఒకటికంటే ఎక్కువసార్లు జరుపబడ్డాయి.

<u>(iii) రీ సెటిల్ మెంటుగాని ప్రాంతాలలో భూమి శిస్తు హెచ్చింపు.</u>

రీ సెటిల్ మెంటు (తిరిగి బందోబస్తు) కాని ప్రాంతాలలో తరిభూములకు రూపాయికి ఒక అణా చొప్పున, ఖుష్కీ

భూములకు రూపాయికి రెండు అణాలు చొప్పున భూమిశిస్తును హెచ్చింపు చేయడానికి యిటీవల జరిగిన హైదరాబాదు శాసన సభా సమావేశంలో ఒక బిల్లును కాంగ్రెసు ప్రభుత్వం ప్రవేశ పెట్టింది. శాసనసభ ముగిసేలోపల యీ బిల్లు చట్టం కాలేదు. పైగా దానిపై శాసనసభ్యులందరిలో తీవ్ర అసంతృప్తిని కల్గించింది. అందుచేత బిల్లులోని ఏర్పాట్లును తిరిగి విచారించేందుకు యీబిల్లును సెలెక్టు కమిటీకి పంపడం జరిగింది. ప్రస్తుతం యీ బిల్లు సెలక్టుకమిటీ విచారణలో వుంది.

ఈ బిల్లు తేవడానికి కాంగ్రెసుప్రభుత్వం రీసెటిల్ మెంటు జరిగిన ప్రాంతాలలో నేడు అమలులోవున్న భూమి శిస్తు రేట్ల స్థాయిలోకి రీసెటిల్ మెంటు కాని ప్రాంతాలలోని భూమిశిస్తు రేట్లనుగూడ తీసుకువచ్చే వుద్దేశ్యమే ప్రధాన కారణం అని చెప్పింది. ఈ సాకుతో నేడున్న అధికభూమిశిస్తు రేట్లను దొడ్డిత్రోవను మరింత అధికం గావించింది. వాస్తవానికి నేడు కొన్ని ప్రాంతాలలో ముఖ్యంగా జాగీరు ప్రాంతాలలో యింకా కొన్నిట్లో ప్రథమపర్యాయంగా నైనా బందోబస్తు జరుగలేదు. అట్టిప్రాంతాలలో నేడు రీసెటిల్ మెంటు జరిగిన ఖాల్సా ప్రాంతాలకంటే గూడ అధికమైన రేట్లు వసూలుచేయబడుతున్నాయి. అయినా అట్టిప్రాంతాలలో గూడ పైన తెల్పిన బిల్లుప్రకారం భూమిశిస్తు రేట్లు హెచ్చింపబడ బోతున్నాయి. ఇదిచాల దారుణమైన అన్యాయం అసలు ఖాల్సా ప్రాంతాలలో వున్న శిస్తురేట్లకంటే ఎంతో ఎక్కువ రేట్లతో కుంగిపోతున్న జాగీరురైతులపై యీ బిల్లువలన మరింత భారం

పడుతుంది. అందుచేత కాంగ్రెసు ప్రభుత్వం యీ బిల్లుద్వారా రైతాంగానికి ముఖ్యంగా జాగీరు రైతాంగానికి యెలా హాని కల్గించుతుందో బట్టబయలు గావిస్తూ యీ బిల్లును ఉపసంహరించుకొనేందుకు పెద్దయెత్తున రైతు వర్కర్లు ఆందోళన గావించాలి.

## (iv) వ్యాపార పంటలపై అమ్మకంపన్ను:—

గత హైదరాబాదు శాసనసభా సమావేశంలో వ్యాపార పంటలు అమ్మకంపై ప్రత్యేకపన్ను విధించుతూ కాంగ్రెసు ప్రభుత్వం ఒకచట్టాన్ని గావించింది. ఈ చట్టంప్రకారం విత్తులు తీసిన ప్రత్తి, విత్తులుతీయని ప్రత్తి, వేరుశెనగపప్పు, వేరుశెనగ కాయ, ఆముదాలు, కుసుమవిత్తనాలు, నువ్వులు, అవిశెగింజలు, ఆవాలు, ఉల్లిపాయలు, యెల్లిపాయలు ధనియాలు, పసుపు, వాము, వీటన్నింటిపై అదనంగా అమ్మకపుపన్ను విధించబడుతుంది. పైన తెల్పిన వస్తువులను అమ్మకానికి అంగడికిగాని, గిర్నీకిగాని రైతులు గొంపోయినప్పుడు అమ్మకపుపన్ను వసూలు చేయబడుతుంది. (సాధారణపు అమ్మకపుపన్ను వేరేవుంది.) ప్రతి నూరురూపాయిల అమ్మకానికి ఒకరూపాయి ప్రత్యేక పన్ను వసూలుచేయబడుతుంది. ఈ పన్ను రైతులనుండి ఒక అర్ధరూపాయి, వర్తకునినుండి మరొక అర్ధరూపాయి అప్పటి కప్పుడే వసూలుచేయబడుతుంది. పేరుకు వర్తకుడు పన్ను యివ్వాలని వున్నప్పటికీ, యీ పన్ను మేరకు మినహాయించేవస్తువును రైతునుండి ఖరీదుచేస్తాడు. అందుచేత సాధారణపు అమ్మ

కపుపన్ను మాదిరిగానే ఈ వ్యాపారపు పంటలపై విధింపబడు తున్న ప్రత్యేక అమ్మకంపన్ను మొత్తంఅంతా ఆచరణలో రైతులనుండే వసూలుచేయడం జరుగుతుంది.

ఈచట్టం నేడు అమలులోవుంది. అమ్మకంపన్ను అనేది ప్రత్యేకంగా వుండగా మరల యీ వ్యాపారపు పంటల పన్ను విధించడం దారుణం. అందుచేత యీ పన్ను పోవాలని రైతు సంఘాలు ఆందోళన గావించాలి.

## (v) గ్రామాలలో యిండ్లపై పన్నులు:—

పంచాయతీలు ఏర్పడ్డగ్రామాలలో యిండ్లపన్ను వసూలుచేయబడుతోంది. హైదరాబాదు పంచాయతీ చట్టంప్రకారం ఇండ్లపైన పన్ను వసూలు చేయడానికి అధికారంవుంది. పంచాయతీచట్టం ప్రకారం ఇండ్లకిమ్మతునుబట్టి పన్ను వేయాలి. అంటే పూరిగుడిశెలు, భవంతులు, మిద్దెలు, మేడలు మున్నగువాటికి వేరకమైన యింటిపన్ను వేయరాదు. ఇంటికిమ్మతునుబట్టి ఇంటి పన్ను వుంటుంది. చట్టం ప్రకారం ఇంటిపన్ను సంవత్సరానికి నాలుగు అణాలనుండి రు 5/- లవరకు యింటి కిమ్మతునుబట్టి విధించవచ్చు. చట్టం ప్రకారం రు 5/- లకుమించి ఏ ఇంటిపైనా అద్దె వేయడానికి పంచాయతీకి అధికారంలేదు.

పంచాయతీల ఆదాయాన్ని పెంచుకోడానికి ఇంటిపన్ను వసూలుచేయడాన్ని రైతుసంఘాలు వ్యతిరేకించరాదు గాని ప్రస్తుతం యింటిపన్నును విధించే పద్ధతికిమాత్రం రైతుసంఘాలు అనుమతించరాదు. రెక్కలకష్టంపై బ్రతికే కూలికిచెందిన పూరి

గుడిశెలకుగూడ ఇంటిపన్ను విధించడం దారుణం. అంతేగాకుండా ఎంత పెద్దభవంతి, మిద్దె అయినా రు 5/- లకంటే అధికంగా యింటిపన్ను వుండరాదనడం అన్యాయం. ఇవ్వలేని నిరుపేద వాళ్లవద్ద గోళ్ళూడగొట్టి పన్ను వసూలుచేయడం, యివ్వగల్గిన శ్రీమంతులను పన్నులభారంనుంచి తప్పించడం, కాంగ్రెసు అనుసరించే పన్నులవిధానానికి మూలం. అదేసిద్ధాంతం ఇంటిపన్నుల విధింపులోగూడ అమలుజరుగుతోంది. ఈ సిద్ధాంతాన్ని వ్యతిరేకించాలి. పూరిగుడిశెలకు, పేదరైతుల యిండ్లకు యింటిపన్ను వుండరాదు. పెద్దభూస్వాముల మిద్దెలు, భవంతులపై అధికంగా పన్ను వసూలుగావించి, పేదవాళ్లమీద పన్ను తీసివేయడం ద్వారా వచ్చేలోటును భర్తీచేయాలి. ఇందుకోసం రైతుసంఘాలు ఆందోళన గావించాలి.

ఇండ్లపన్ను విధించడానికి అధికారంవున్నట్లే గ్రామపంచాయతీలకు గ్రామ వృత్తిదారులపై పన్నువిధించే అధికారం గూడ వుంది. అయితే సంవత్సరానికి రు 10/- లకు మించి ఏ వృత్తిదారుపైనా పన్ను విధించరాదు.

ఈవృత్తిపన్ను గూడ చాల అక్రమమైనదే. గ్రామాలలో సాధారణంగా వృత్తి గావించుకొనేవారంతా పేదవారే. పొట్టగడవక ఏదోవృత్తి గావించుకొంటూ వుంటారుగాని ఏవో లాభాలు సంపాదించుదామనే వుద్దేశ్యంతో వృత్తిగావించేవారు ఎవరూవుండరు. అందుచేత గ్రామాలలో పంచాయతీలు విధించే వృత్తిపన్ను పేదవారిపై పడుతుంది; కాన ఈ వృత్తిపన్ను వుండరాదని రైతుసంఘాలు ఆందోళన గావించాలి.

# తప్పొప్పుల పట్టిక. (మొదటిభాగం)

| పేజీ. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 6 | 1 కోటి 16 లక్షలు | 1 కోటి 46 లక్షలు |
| 3 | 14 | 1,00,50,00 | 1,00,50,000 |
| 7 | 13 | వివేదికలో | నివేదికలో |
| 8 | 11 | 13 | 31 |
| 8 | 16 | 31/ | 3 1/2 |
| 9 | 16 | సాగుచేయు | సాగుచే |
| | 1 | ” | ” |
| 10 | 1 | ” | ” |
| 10 | 11 | 12000 | 92000 |
| 10 | 14 | 3890000 | 3980000 |
| 11 | 10 | సాగుచేయు | సాగుచే |
| 12 | 1 | కేద్రీకరణ | కేంద్రీకరణ |
| 15 | 4 | 1117 | 1177 |
| 20 | 3 | నిత్యకత్యంగా | నిత్యకృత్యంగా |
| 28 | 5 | వాటికి | అవి |
| 30 | 2 | జయంటుగా | జాయింటుగా |
| | 1 | వుంచవచ్చు | వుండవచ్చు |
| | 10 | పొందేవక్తిని | పొందేవ్యక్తి |
| 33 | 2 | పరిభుత్వం | పరిభుత్వం మొదట్లో |
| 41 | 8 | ఇప్పించామని | ఇప్పించమని |
| 45 | 2 | ఎక్కువలేకుండా | తక్కువలేకుండా |
| 50 | 1 | పైన | పై |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 52 | 7 | పకీలు | వకీలు |
| 53 | 6 | రికాాగులను | రికార్డులను |
| 56 | 1 | వేరుగా | వేగుగా |
| 57 | 7 | ఎవరికజ్ఞాలోవున్న | ఎవరికబ్జాలోవున్నవో |
| 60 | 1 | జరీగా | జరీదా |
| 61 | 4 | చేయుబడ్డానని | చేయుబడ్డానని |
| 68 | 3 | అధికారులు | అధికారాలు |
| 73 | 20 | మించపనప్పుడు | మించినప్పుడు |
| 78 | 4 | గరిగణించబడింది | పరిగణించబడింది |
| 80 | 7 | కాలులేదు | వీలులేదు |
| | 1 | మతపూర్వకంగా | వ్రాతపూర్వకంగా |
| 82 | 4 | నానిక | నావికా |
| 87 | 3 | వున్నప్పుడు | వున్నప్పటికీ |
| 88 | 5 | చేయమనే | చేయమని |
| 93 | 5 | వుంచరాదు | జరగరాదు |
| 96 | ఆఖరివాక్యం | ఉద్దేశింపబడితే | ఉద్దేశించితే |
| 97 | మొదటివాక్యం | తదాదాలు | తగాదాలు |
| 99 | రెండవవాక్యం | నయబడినట్లుగా | చేయబడినట్లుగా |
| 101 | ,, | సాధారంగావుంటాయి | సాధారంగా పేదలకువుంటాయి |
| 109 | మొదటివాక్యం | క్రివిక్రమాలను | క్రియవిక్రియాలను |
| 110 | 1 | వ్యవహాయితరుడు | వ్యవసాయేతరుడు |
| ,, | 4 | చెల్లిదిగా | చెల్లేదిగా |
| 135 | 3 | కంటే | అంటే |

